

ఈ సంపుటిలో కథలు :

# చదరంగం

నేను మా స్వగ్రామంనుంచి కలకత్తాకువచ్చి కాలేజీలో ప్రవేశించాను. నిర్మల్ అప్పటికి బి.ఎ. చదువుతున్నాడు. మే మిద్దరం ఆప్తమిత్రులం. నిర్మల్‌ని చూస్తే నాకు అదో విధమైన ఆదరభావం కలిగేది. అతని బాహ్యరూపాన్నే చూట్టంకాకుండా అతని అంతరాత్మనుకూడా చూడగలిగాను. కాని—

అత్యాశ్చర్యం! తోటి విద్యార్థులందరూ అతన్ని ఏవగించుకునేవారు. వాళ్లు మా స్నేహాన్ని పసికట్టారు. వాళ్ళ కళ్లల్లో కారం జల్లినట్టనిపించింది. సహించలేకపోయారు. నాకు వినిపించేట్టుగా నిర్మల్‌కి విరుద్ధంగా ఏవో వ్యంగ్యోక్తులుకటువుగా విసిరేవారు. అంతా వింటూ ఊరుకునేవాణ్ణి; **Silence is golden** అనే సామెత ప్రకారంగా.

ఓనాడు నిర్మల్ చరిత్రమీాద ఘోరంగా దెబ్బకొడుతూ వాళ్ళల్లో వాళ్లే వాదించుకున్నారు. "ఇది ముమ్మాటికీ నిజం" అన్నాడు ఒకడు. మరి నేను సహించలేకపోయాను. గదంతా ప్రతిధ్వనించేట్టుగా కోపంకొద్దీ అరిచాను—"నేను నమ్మను. ఇవన్నీ కాకమ్మ కబుర్లు."

మరునటిరోజు 'ఇంటర్‌వల్'లో కాలేజీ కాంపౌండులో పచ్చగడ్డిమీాద చేరబడి నిర్మల్ ఏదోపుస్తకం చదువుతున్నాడు. నేనువెళ్లి నా మనస్సులోనున్న కోపమంతా వెళ్ళగక్కాను. తనిచ్చిన జవాబు నాకు తృప్తిగాలేదు.

"వాళ్లు నిన్ను నాస్తికుడంటున్నారు. ఇది నిజమేనా ?" అన్నాను. జంకూగొంకూ లేకండా – 'అవున'న్నాడు. నానోట మాటలేదు. నిర్మల్ నాస్తికుడని తెలీక నేను వాదించినందుకు నాలో నేనే సిగ్గుపడ్డాను. ఇన్నాళ్ళవరకూ నేనతన్ని బ్రాహ్మణు డనుకున్నాను. కాని, శూద్రుడని తెలిసినతరువాత...జాతి రీత్యా మా 'కాయస్థులు' శూద్రుల్ని ఏవగించుకుంటారు. అందులో నాస్తికుణ్ణి గోహంతకుడికన్నా నీచంగా చూస్తారు.

ఏమీ జవాబివ్వకండా నిర్మల్ మొహాన్ని చూడ సాగాను. గాని అతని మొహంలో అదోవిధమైన దివ్యజ్యోతిని చూడగానే, అనుకోకుండానే నాకళ్లు కిందికిదిగిపోయాయి... శూద్రుడితో సహపంక్తిని భోంచేస్తాననీ, వాణ్ణి గురువుగా భావించి పూజిస్తాననీ, నేను కలలోనన్నా అనుకోలేదు. అలాగే జరిగిందికూడాను—ఖర్మ!

ఆ రోజుల్లో నాస్తికుల్లో సుప్రసిద్ధుడుగా చలామణీ అయిన ప్రకాశ్ బాబు, నిర్మల్‌కి పెత్తండ్రి. ప్రకాష్‌బాబు గొప్ప నాస్తికుడు. అతను ఆస్తికులతో ఇలా వాదిస్తాడు— "దేవుడు లేడు. మీరన్నట్టు పోనీ, దేవుడున్నాడే అనుకుందాం. వుంటే నాకున్న బుద్ధి అతను ప్రసాదించిందేనా ? నా మనస్సు దేవుడు లేడని చెబుతోంది. అంటే దేవుడు లేడని దేవుడే చెబుతున్నాడన్నమాట. కాని, మీరంతా అతని మొహంమీదే దేవుడున్నాడని అరుస్తున్నారు. ఈ పాపానికి శిక్షగా ముప్ఫయిమూడుకోట్ల దేవతలూ మీ చెవుల్ని పట్టుకొని మీపై 'జరిమానా' విధిస్తున్నారు..."

ప్రకాశ్ బాబుకి చాలా చిన్నతనానే వివాహం జరిగింది. యవ్వనంలో అడుగిడగానే అతనిభార్య పరలోకానికి వేంచేసింది. తరవాత అతను మరి పెళ్ళిచేసుకోలేదు. ఇతని తమ్ముడు హరిమోహన్ కొడుకు నిర్మల్. ఈ యిద్దరు అన్నదమ్ముల స్వభావాల్లో భూమ్యాకాశాల తేడావుంది. ఇద్దరూ అసలు ఎదురుచుక్కల్లాంటివాళ్లు.

చిన్నప్పటినుండీ, హరిమోహన్ రోగిష్టిగానే వుండేవాడు అందుకని యింటికి ఇరవైనాలుగ్గంటలూ సాధుసన్యాసుల రాకలూ పోకలూ జరుగుతుండేవి. ఎప్పుడూ విభూతులూ, తావిత్తులూ, రక్షరేకుల్లోనే సమయం గడిచేది. ఇంట్లో బ్రాహ్మణ సంతర్పణలు, సత్యనారాయణవ్రతాలూ, పూజా పునస్కారాలూ, భజనలూ, వీటితోనే ప్రొద్దుపోయేది.

వయసు వచ్చింతరవాత హరిమోహన్‌కి ఏ జబ్బూ లేకపోయింది. కాని, ఇతను ఓటిమనిషనే భావం కలిగింది తలిదండ్రులకు—ఏవిటో! పాడులోకం!

అయితే అతని శరీరస్థితి మాత్రం అందర్నీ బాగా జడిపించింది. హరిమోహన్ తండ్రి చనిపోయి కొద్దిరోజులే అయింది. గాని, అతను చనిపోయేముందు, కొడుకుకి సౌకర్యాలు సవ్యంగా జరగాలని తాఖీదుపర్చి మరీ చచ్చాడు. హరిమోహన్‌కి దైవమంటే ఎంతో భక్తిభావం. బ్రాహ్మణుల్నీ సాధుసన్యాసుల్నీ కలికాల దేవతలుగా భావించేవాడు. ఇదంతా ప్రకాశ్ బాబుకి గిట్టేదికాదు. అతను పక్కా నాస్తికుడు.

హరిమోహన్‌కికూడా చిన్నతనంలోనే వివాహమైంది.

ముగ్గురు ఆడపిల్లలు, ముగ్గురు మగపిల్లలు - తరవాత నిర్మల్ పుట్టాడు. అచ్చంగా పెత్తండ్రిలాగే వుంటాడని అందరూ అన్నారు. అలాగే ప్రకాష్‌బాబుకూడా నిర్మల్‌ని తన సొంత కొడుకులాగే భావించి, అతనిపై అధికారం చేసుకున్నాడు. నిర్మల్‌కి చదువు చెప్పించే భారం ప్రకాష్‌బాబు తీసుకొన్నాడు. హరిమోహన్‌కి భారంకొంచం తేలికైనట్టనిపించింది. ఆ కారణం చేత ప్రేమంతా పెద్దకొడుకు పురందర్ మీదకు మళ్ళింది.

ఇంట్లో పురందర్ మాట వేదవాక్యం. అతనేది కోరినా హరిమోహన్ కాదనలేకపోయేవాడు. పురందర్‌కి ఖర్చులెక్కువయ్యాయి. పోకిరీ వేషాల్లోకి దిగాడు. చదువుకూడా మానేశాడు. పెళ్ళిచేస్తే దార్లోకి వస్తాడేమోననే ఆశతో చిన్న వయస్సులోనే పురందర్‌కి పెళ్ళికూడా చేసేశాడు. అతనికి దొరికిన భార్య పక్కా గయ్యాళిగంప. ఇంట్లో ప్రతిరోజూ ఏదో గొడవ తప్పకుండా వుండేది.

మళ్ళా అలవాటు ప్రకారంగా పురందర్ వ్యభిచార గృహాలకు దారితీశాడు. అతని చెడుతిరుగుళ్ళకు కోడలే కారణమని హరిమోహన్ అప్పుడప్పుడూ కోడల్ని చీవాట్లు పెట్టేవాడు—గాయం ఓ దగ్గరైతే మందు మరోచోట—హుఁ!

ఇంటి గొడవలనుండి దూరంగా వుంచాలనే ఉద్దేశంతో నిర్మల్‌ని ప్రకాష్‌బాబు ఎప్పుడూ తనదగ్గరే వుంచుకొనేవాడు. మిత్రునిపట్ల ఎలా వ్యవహరించాలో నిర్మల్‌తోకూడా ప్రకాష్‌బాబు అలాగే ప్రవర్తించేవాడు. తనలాగే నిర్మల్‌నికూడా పక్కా నాస్తికునిగా తయారుచేశాడు - విన్నారా!

* * *

# 2

నిర్మల్ చదువు పూర్తయింది. అతని ప్రవర్తన చూచి హరిమోహన్ చాలావిచారించాడు. (ఏడ్చాడుకూడానేమో!) నిర్మల్‌ని చాలామట్టుకు మందలించాడు కూడాను. కాని, లాభం శూన్యం. అతని ప్రవర్తనలో ఏవిధమైన మార్పూ కన బడలేదు. కొడుకుమీద కోపమంతా అన్నగారిమీద చూపిం చాడు హరిమోహన్. ప్రకాష్‌బాబుమీద లేనిపోని నిందలన్నీ మోపి వీధంతా చాటాడు. కాని—

ప్రకాష్‌బాబు వాటిని ఖాతరు చెయ్యలేదు. అతని నాస్తికధర్మం యొక్క ప్రధానోద్దేశం లోకోపకారమే. పరిసర వీధుల్లోనున్న నిమ్నజాతులవారికి కావలసిన సహాయం చేసి పెట్టేవాడు ప్రకాష్‌బాబు. హరిమోహన్ బ్రాహ్మణ సంతర్పణ చేస్తే ప్రకాష్‌బాబు హరిజన సంతర్పణ జరిపాడు.

దీంతో హరిమోహన్‌కి 'ఫ్ర్ర్'మని మంట లేచుకు వచ్చింది. వెంటనే పైతృకసంపత్తి పంపకమై పోవాలన్నాడు. డబ్బంతా అపవ్యయం చేస్తున్నావన్నాడు. "ఈ బొండాం గాళ్ళనీ, బైరాగుల్నీ, సన్యాసిగాళ్ళనీ ఇంతమట్టుకు మేపావు కదా, అంత డబ్బే నన్నుకూడా ముందు ఖర్చుపెట్టనీ, ఆ తర వాత ఆస్తి పంపకాలవిషయం చూసుకుందాం" అన్నాడు ప్రకాష్‌బాబు.

ఓనాడు ప్రకాష్‌బాబు యింట్లో విందు. వండేవాళ్ళు, వడ్డించేవాళ్ళు, ఆహ్వానించబడ్డవారు, అందరూ నిమ్నజాతీయులే. యితడే తురకలు, మాలమాదిగలు, వగైరాల కలగాపులగం.

నిర్మల్‌ని పిల్చి హరిమోహన్ అరిచాడు-"ఏంరా దరిద్రుడా! నీ మాలమాదిగ తంద్రుల్నందర్నీ పిల్చి తినిపిస్తావేమిటి?"

"నాదగ్గర డబ్బుంటే అంతపనీ తప్పకుండా చేసివుండేవాణ్ణి. కాని, ఆ డబ్బే నాదగ్గరలేదు. పెదనాన్నగారే అంతా నిర్వహిస్తున్నారు" అన్నాడు నిర్మల్.

ఇంట్లో కోపంగా చాలా హడావిడిగా పచారుచేస్తూ పురందర్ కేకలు వేస్తున్నాడు. "వీళ్ళంతా ఈ యింటికి వచ్చి ఎలా భోంచేస్తారో నేనూ చూస్తాను" ప్రకాష్‌బాబు దగ్గరకెళ్ళి హరిమోహన్ అటకాయించాడు.

"నువు రోజూ యింట్లో నీ ఠాకూర్‌కి భోగం సమర్పిస్తూంటే నే నెప్పుడన్నా వారించానా? నేనుకూడా నా ఠాకూర్‌కి భోగం సమర్పించుకుంటున్నాను. కాబట్టి ఇందులో నువు జోక్యం కలిగించుకునే అవసరం లేదు" అన్నాడు ప్రకాష్.

"వీళ్లా నీ దేవతలు?"

"అవును."

"అయితే నువు బ్రహ్మసమాజికుడవైపోయావేమిటి?"

"బ్రహ్మసమాజికులు నిరాకారుణ్ణి పూజిస్తారు. వాళ్ళ దేవుడు కంటికి కనిపించడు. మీరంతా సాకారమైన రాళ్ళనారాధిస్తారు. అవి కంటికి కనిపిస్తాయి. వాటికి వినపడదు - మాట్లాడలేవు."

"మా నాస్తికులకు సజీవులే దేవతలు. కంటికి కనిపిస్తాయి - నడుస్తాయి - మాట్లాడతాయి - అన్ని పనులూ చేస్తాయి - వాళ్లు చెప్పింది వినిపిస్తాయి."

"అయితే ఈ నిమ్న జాతీయులే నీ దేవుళ్ళన్నమాట?"

"అవునని మొదటే చెప్పాను. వీళ్ళ అద్భుతమైన శక్తి నువు ప్రత్యక్షంగా చూద్దువుగాని! వాళ్ళెదుట భోజనసామగ్రి పెట్టగానే వాళ్ళెలా తినేస్తారో చూడు. నీ దేవుడలా చెయ్యలేడే. పైపెచ్చు దేవునిపేరు చెప్పి ఉల్ఫారాయుళ్ళంతా మస్తుగా మెక్కుతున్నారు."

పురందర్ కూడా పెత్తండ్రి దగ్గరకువెళ్ళి నోటికి వచ్చినట్లల్లా వాగాడు. కాని, విందుకు ఉపక్రమించారంటే ఏదో అనర్థకం జరుగుతుందని బెదిరించి మరీ అక్కడనుండి కదిలాడు. పురందర్ దంతా ఉత్తరకుమారుని ప్రగల్భాల్లాంటివి. బెదిరించాడేగాని, తురకల్తో దెబ్బలాట మంచిదికాదని ఊహించి ఊరుకున్నాడు. నిర్మల్‌నికూడా బాగా తిట్టాడు. తిట్లన్నీ విని నిర్మల్ దులిపేశాడు. అప్పుడే మర్చిపోయాడు. జవాబివ్వలేదు. ఆనాటి విందు నిర్విఘ్నంగా ముగిసింది.

# 3

ఈ యిద్దరన్నదమ్ముల పాలన పోషణంతా ఇంతవరకు దేవోత్తర సంపత్తివల్ల జరుగుతూవచ్చింది. వాళ్ళ పూర్వీజులు ఆస్తినంతా దేవుడికిసమర్పించి మరీపోయారు. ప్రకాశ్ బాబు ప్రవర్తనను ఎక్కువకాలం సహించలేకపోయాడు హరిమోహన్. ఏదోఒకటి తేల్చెయ్యాలని నడుంకట్టాడు.

ప్రకాష్‌బాబు తనమతం మార్చుకున్నాడనీ, ఆచార భ్రష్టుడనీ ఈ కారణాలచేత అతనికి ఆస్తినుండి ఏదీ లభించదనీ జిల్లాకోర్టులో హరిమోహన్ దావా వేశాడు. సాక్షులకు కరువు

లేకపోయింది. బాగా కాయ, మహాకాయులంతా చుట్టూ సాక్ష్యమివ్వటానికి వచ్చారు. కోర్టుచుట్టూ ఎక్కువకాలం తిరగనవసరం లేకపోయింది. ప్రకాష్‌బాబు కోర్టులో స్పష్టంగా చెప్పేశాడు – తనకు దేవుడులో నమ్మకంలేదనీ, నాస్తికుడనీ.

ఆఖరికి ప్రకాష్‌బాబుకి ఆస్తినుండి ఓ చిల్లిగవ్వైనా లభించలేదు. ఫకీరై పోయాడు. కేసుగెల్చినందుకు హరిమోహన్ ఉత్సవాలు చెయ్యాలనుకున్నాడు. కాని అన్నగారి ఉసురుతగిలి ఏదన్నా అరిష్టం జరుగుతుందేమోనని భయపడ్డాడు; లేక శపిస్తాడేమో! గాని, విందునాడు హరిజనుల్ని తరమలేకపోయి నందుకు పురందర్‌కిమాత్రం లోపల మండుతోనేవుంది.

"సరే, ఇహముందు విందులెలా సాగుతాయో చూస్తానుగా! ఎవరిదేవతలో శక్తివుందో ప్రత్యక్ష్యంగా చూశాం" అనుకుంటూ మేళతాళాన్ని తెప్పించాడు, తండ్రి వద్దంటున్నా. "ఈ బాజాలు దేనికని?" ప్రకాష్‌బాబు మిత్రుని ప్రశ్న. "మంగళవాయిద్యాలతోసహా నా దేవుడు విసర్జనం చెయ్యబడుతున్నాడు;" ప్రకాష్ జవాబు.

రెండురోజులవరకు పురందర్ పెత్తనంలో యింట్లో విందులుసాగాయి. "పురందర్ ఉత్తమ వంశోద్ధారకుడు," అని అందరూ మెచ్చుకున్నారు. మస్తుగా మెక్కారు కదా! ఆమాత్రం అనకపోతే ఎలాచెప్పండి!

కలకత్తాలో వీళ్లున్న యిల్లు రెండుభాగాలుగా విభజించబడింది. మధ్యను గోడలేచిపోయింది. ఇహను, నిర్మల్ తన దగ్గరకు వచ్చేస్తాడనుకున్నాడు హరిమోహన్. గాని, అతని

ఆలోచన వ్యర్థమైంది. ప్రకాష్‌తోనే అతనువున్నాడు. ఆఖరికి ఓ అస్త్రం ప్రయోగించాడు హరిమోహన్ - ప్రకాష్ ఫకీరై పోయాడనీ, నిర్మల్‌ని తనచేతిలో వుంచుకుంటే అన్నవస్త్రాలకు లోటుండదనీ, అందుకే నిర్మల్‌ని తనదగ్గర వుంచుకున్నాడనీ, అందరితో చాటసాగాడు—

ఇది ప్రకాష్ చెవుల్లోకి వెళ్ళింది. వెంటనే "గుడ్‌బై నిర్మల్" అన్నాడు. ఏభావంతో అతనలా అన్నాడో నిర్మల్ బాగా గ్రహించాడు. 18 సంవత్సరాలవరకు అతని సాంగత్యంలో వుండి ఇన్నాళ్ళకు అతనితో విడిపోవల్సి వచ్చిందికదాఅని విచారిస్తూ, మూటముల్లె కట్టుకుని తనమిత్రుని 'లాడ్జి'కి దారి తీశాడు. తండ్రిదగ్గరకు వెళ్ళలేదు. నిర్మల్‌యొక్క ఈ ప్రవర్తనకు హరిమోహన్ చాలా నొచ్చుకున్నాడు - ఏడ్చాడు కూడాను - కాని, ప్రకాష్‌బాబుని తిట్టలేదు.

ఇల్లు విభజించబడగానే, పురందర్ తనకు దొరికిన వాటాలో ఓ చిన్న దేవాలయంలాంటిది కట్టించుకుని మూర్తి స్థాపన చేయించాడు. రోజూ దేవుడికి భోగం - హారతి - శంఖారావం - కరతాళాలు - భజనలు - ఈ గోలవల్ల ప్రకాష్ బాబు నాస్తికత్వానికి దెబ్బ తగులుతుందని, తనలోతను సంబరపడ్డాడు.

నిర్మల్ ఒక 'ట్యూషన్' ఏర్పాటు చేసుకున్నాడు. ప్రకాష్‌బాబు ఒకహైస్కూల్లో 'హెడ్‌మాస్టర్'గా ప్రవేశించాడు. ఇవతల తండ్రీకొడుకులు, అటు హరిమోహన్ పురందరులు, అయినింటిపిల్లల్ని ఈ నాస్తికుల శిక్షణనుండి, దూరంగావుంచాలని ప్రయత్నాలు—

* * *

# 4

కొన్నాళ్ళతరవాత నిర్మల్, ప్రకాశ్ బాబు దగ్గరకు వెళ్లాడు. వీళ్ళిద్దరిమధ్యా పరస్పర గౌరవాలు వేరువిధంగా వుంటాయి. నిర్మల్ రాగానే ప్రకాశ్ బాబు అతన్ని ఆలింగనం చేసుకుని కూర్చోబెట్టి "ఏమిటి సంగతులు?" అని అడిగాడు. ఒక విశేషమైనవార్త—

"అంజలి అనే స్త్రీ తన వితంతుతల్లితో మేనమామ ఆశ్రయంలో వుండేది. తల్లి వున్నంతకాలం ఆమెకు ఏ ఆపదా రాలేదు. ఆమెతల్లి చనిపోయి, కొద్దిరోజులైంది. ఆమె మేన మామకొడుకులు వుత్త జులాయివెధవలు. వాళ్ళల్లో ఒకని మిత్రుడు అంజలికి ఏవో కల్లబొల్లికబుర్లు చెప్పి లేనిపోని ఆశలుకల్పించి, ఆమెను మేనమామ ఇంటినుండి లేవదీసుకు పోయాడు.

"తనదగ్గర కొన్నాళ్లుంచుకున్నాడు. తరవాత ఆమె శీలాన్ని అనుమానించి, అవమానించాడు. నేను ట్యూషన్ చెప్పేచోట ఆమెనువుంచాడు. ఆ దుర్మార్గునిబారినుండి ఆమెను రక్షించాలనుకున్నాను. కాని, నాకు ఇల్లూవాకిలీ లేదు. పేద వాణ్ని. ఇప్పుడామె గర్భిణి. ప్రసవించేరోజులుకూడా దగ్గరకు వచ్చాయి. ఈ విషయంలో నాకు మీసహాకారం అత్యవసరం" అన్నాడు నిర్మల్. అంతావిన్న ప్రకాశ్ బాబు కళ్లు కోపంగా ఎర్రబడ్డాయి. ఆ సమయంలో ఆ దుర్మార్గుడుగానీ అతనెదుట వుంటే ఏం చేసేవాడో!

"సరే నా లైబ్రరీ ఖాళీగావుంది. అందులో ఆమె వుండొచ్చు" అన్నాడు ప్రకాష్‌బాబు. ఓ క్షణంసేపు నిశ్శబ్దం- నిర్మల్ "ఆమెను నాతోనే తీసుకువచ్చాను. క్రింద గదిలో కూర్చునివుంది" అన్నాడు. వెంటనే క్రిందికి వెళ్లాడు ప్రకాష్ బాబు. చూచాడు - ఆమె ఏడుస్తోంది. "రా అమ్మా! నేను బ్రతికుండగా నీకేం భయంలేదు" అంటూ ప్రకాష్ ఆమెను లోపలికి తీసుకువెళ్లాడు.

ఆమె దీనస్థితినిచూచి కోపంకొద్దీ ఏవేవో అనేశాడు. తరవాత-"చూడమ్మా! ఈ యిల్లంతా ఎలా చిందరవందరగా వుందో! అందరూ నన్ను పిచ్చాడంటూారు. నా నిద్రాహారాల విషయంలో నాకే శ్రద్ధలేదు. నా సంరక్షణభారమంతా నీదే తల్లీ!" అన్నాడు ప్రకాష్‌బాబు. వెల్తుర్లో ఆమె మొహం చూచాడు. ఇంకా చిన్నవయస్సే.

వెంటనే ఆమెకోసం ముసలిదాసీని నియోగించాడు. మొట్టమొదట, తను వండిన భోజనసామగ్రిని ప్రకాష్‌బాబు స్వీకరిస్తాడో లేదోనని అనుమానించింది అంజలి. కాని, ఆమె స్వయంగా వండి, వడ్డించి, దగ్గరకూర్చుని మరీ తినిపించక పోతే, తనకు భోజనమే అవసరం లేదని ప్రకాష్‌బాబు భీష్మించాడు.

అంజలి నాదరించినందుకు, తనమీాద పెద్ద నిందవస్తుం దని ప్రకాష్‌బాబు మొదటనే ఊహించాడు. అలాగే జరిగింది కూడాను. కొంతమంది సనాతన సంఘోద్ధారకులు ప్రకాష్ చర్యల్ని నిందించసాగారు. దాసీది, మొదట అంజలిని ప్రకాష్

కూతురనుకుంది. అసలు సంగతి తెలిశాక అసహ్యించుకుని పని మానేసి వెళ్ళిపోయింది.

"మరేం ఫరవాలేదులే తల్లీ! లోకులు కాకులు - అంతే" అన్నాడు ప్రకాష్‌బాబు. అతని దూరపుబంధువు రాలోకరె అంది కదా— "ఏంరా ప్రకాష్! ఈ పాపపుమూటని ఇంట్లో ఎందుకు పెట్టుకున్నావురా? వెంటనే దాన్ని గెంటెయ్."

"మీరంతా ధర్మాత్ములు గాబట్టి ఇలాంటి వెన్నయినా అంటారు. ఇలా గెంటేస్తే ఆమెగతి ఏమయినట్టు?"

"ఈ పిల్లను ఆస్పత్రికి పంపించెయ్యరా బాబూ, నీకు పుణ్యముంటుంది. ఖర్చంతా హరిమోహన్ భరిస్తాట్ట."

"ఈ పిల్ల ఎవరనుకున్నావ్? నా కూతురు - తెలిసిందా? నేను 'అమ్మా!' అని పిల్చాను. డబ్బువిషయమై మీ రెవరూ చింతించ నవసరంలేదు. ఇందులో హరిమోహన్ జోక్యం కలుగజేసుకో నవసరంలేదు."

ఈ మాట హరిమోహన్ చెవులవరకు వెళ్ళింది. కాని- సరే, సరే అనుకున్నాడు. ఈ అపవాదుల్తో పురందర్ చెవులు కూడా చిల్లులు పడ్డయ్. "ఈ పాపిష్టిముండను ఇక్కడనుండి తరమందే నిద్రపోకూడదు" అనుకున్నాడు తనలో.

ఓ నాడు మధ్యాహ్నం పురందర్ నిచ్చిన సహాయంతో ప్రకాష్ ఇంటివైపు దూకాడు. అప్పటికి అంజలి నిద్రబోతోంది. గదితలుపులు తీసే వున్నాయి. అంజలిని వెదుక్కుంటూ ఆమె గదిలోకి ప్రవేశించాడు పురందర్. చూడగానే ఉగ్రుడై పోయాడు—

"ఆసీ, పాపిష్టిముండా నువ్వా ఏటే! ఇంకా ఎవరో అనుకున్నాను" ఆమె గాబరాపడుతూ లేచింది. మొహం వెలవెలబోయింది. నోటమాట లేదు. అక్కడినుండి పారిపోవాలనైనా ఆమెకు స్ఫురించలేదు. "అంజలీ!" కోపంతో అరిచాడు పురందర్. అప్పుడే స్కూలునుండి ఇంటికి వచ్చిన ప్రకాశ్ గర్జనకూడా వినబడింది—"ఛో! అవతలికి" ప్రకాశ్‌ను మింగేస్తాడు అన్నట్టు ఎర్రగా చూశాడు పురందర్.

"వెడతావా? పోలీసుల్ని పిలవమన్నావా?" అన్నాడు ప్రకాష్. కొరకొరా చూస్తూ అక్కడినుండి కదిలాడు పురందర్. అంజలి స్పృహతప్పి పడిపోయింది. అంతా బోధపర్చుకున్నాడు ప్రకాష్‌బాబు. నిర్మల్‌ని పిలిచి సంగతంతా కనుక్కున్నాడు. పురందరే, అంజలిని ఇలా పాడుచేశాడని నిర్మల్‌కి తెలుసు. కాని—

కోపంకొద్దీ ప్రకాష్ ఏమన్నా అనర్థం చేస్తాడేమోననే భయంచేత, ఆ సంగతి అతనితో చెప్పలేదు. కలకత్తాలో అంజలి ఎక్కడున్నా ఆమెను వెదికి మరీ పురందర్ అల్లరిపెట్టగలడు, ఒక్క పెత్తండ్రింట్లో తప్ప. అప్పటినుండీ చాలామట్టుకు భయపడిపోయింది. తరవాత ఆమె ఒక మృతశిశువును కన్నది.

పురందర్ ఓ నాడు అంజలిని తన్నాడు. ఆ తరవాత ఆమెను అర్థరాత్రప్పుడు ఇంటినుండి వెళ్ళగొట్టాడు. ఆమె కోసం ఎంత వెదికినా ఆమె కనబడలేదు. ఆఖరికి హఠాత్తుగా తన పెత్తండ్రింట్లోనే అంజలిని చూడగానే పురందర్‌కి ఎక్కడలేని కోపమూ వచ్చింది. అంజలితో నిర్మల్ కులుకుతూంటే,

తనుచూచి ఈర్ష్యపడాలనే భావంతోనే ఆమెను ప్రకాశ్ యింటికి తీసుకువచ్చాడని అనుకున్నాడు పురందర్. అమ్మో! ఈ అవమానాన్ని సహించి ఊరుకోవటమే...

ఈ సంగతి తండ్రితో (సిగ్గులేకుండా) చెప్పాడు పురందర్. గారాబం కొద్దీ కొడుకు నేమీ అనలేకపోయాడు హరి మోహన్. ఇది శాస్త్రానికి విరుద్ధమన్నాడు హరిమోహన్ - అస్వాభావికమన్నాడు-అన్న వుంచుకున్న స్త్రీని అనుభవించిన వాడికి పుట్టగతులుండవన్నాడు-తప్పకుండా దీనికేదో ఉపాయం చూడాలన్నాడు-అంజలిపై పురందర్ కి వున్న అధికారాన్ని వ్యక్తపర్చి ఆమెను రక్షించాలన్నాడు-అంజలి పురందర్ సొత్తు-గనుక వాడికే లభించాలని హరిమోహన్ కేకలువేశాడు.

అంజలి శరీరస్థితి బాగాలేదు. రోజురోజుకీ ఆమె నీరసించి పోసాగింది. అప్పుడు క్రిస్టమస్ శలవులు. ఆమె నీరసస్థితిలో ఆమెను విడిచి ప్రకాశ్ బాబు ఎక్కడికీ వెళ్లేవాడుకాడు.

ఓ నాడు ప్రకాశ్ బాబు ఏదో ఆంగ్ల గ్రంథాన్ని అను వదించి అంజలికి వినిపిస్తున్నాడు. అప్పుడే మరో యువకునితో పురందర్ ప్రవేశించాడు. ప్రకాశ్ పోలీసుకి ఫోన్ చెయ్య నుద్యుక్తుడయాడు. అతనికి శ్రమకలిగించటానికి కిష్టంలేక "నేను అంజలి అన్నను" అన్నాడా యువకుడు.

ప్రకాష్ ఏమీ జవాబివ్వకుండా ఇద్దర్నీ మెడపట్టుకుని బరబరా ఈడ్చుకుపోయాడు మెట్లుమీంచి. క్రిందంతస్తుకి వచ్చేంతరవాత ప్రకాశ్ అన్నాడు — "దొంగవెధవా! నీకు

సిగ్గులేకపోయిందట్రా? అంజలిని రక్షించేప్పుడు నువ్వు అన్నవు కావేం? ఇప్పుడు దాని సర్వనాశనమప్పుడు నువ్వు అన్నవా?"

ఆ యువకుడు వెడుతూ వెడుతూ కేకలు వేశాడు— "నా చెల్లెల్ని పాడుచేసినవాడు నిర్మల్. నేను పోలీసుల సహాయంతో నా చెల్లెల్ని తీసుకుపోతాను." అంజలి తనలోనే గొణుక్కుంది. "ఓ భూదేవీ! నువ్వు బ్రద్దలైపో తల్లీ! నన్ను నీలో లీనం చేసుకో!"

నిర్మల్‌ని పిలిచి ప్రకాశ్ అన్నాడుకదా – "నిర్మల్ ఇక్కడుంటే మనకేం లాభంలేదు. గనుక బీహారుకి పోదాం. అక్కడయితే ఈ పిల్ల కాస్త సురక్షితంగా వుంటుంది." "అన్నయ్యా వెంటపడ్డాడు కాబట్టి, మనమెక్కడికి వెళ్ళినా ఈ అల్లరి తప్పదు. ఈ గొడవనుండి తప్పించుకోవాలంటే ఒక్కటే ఉపాయం. అంజలిని నేను 'సివిల్ మ్యారేజి' చేసుకుంటాను" అన్నాడు నిర్మల్. అతని సదుద్దేశాన్ని మెచ్చుకుంటూ ఆలింగనం చేసుకున్నాడు ప్రకాశ్ బాబు. అతని కళ్ళంట ఆనందాశ్రువులు.........

# 5

ఇల్లు విభజించబడిన తరవాత యింతవరకూ హరి మోహన్ ఒక్కనాడన్నా ప్రకాశ్ దగ్గరకు రాలేదు. కాని ఈనాడు గాబరాపడుతూ ప్రకాశ్ దగ్గరకువచ్చి అన్నాడు – "ఏమిటన్నయ్యా ఈ సర్వనాశనం?"

"అవును. సర్వనాశనమే అయింది. అందులోనుండి ఇప్పుడు బయటపట్టానికి ఇదే మార్గం."

"అన్నయ్యా! ఒక్కసారి దీర్ఘంగా ఆలోచించు. నిర్మల్ నాకెంతో నీకూ అంతే. ఈ పతితను వాడికి పెళ్లి చెయ్యటం నీకు న్యాయంగా వుందా? ఇది ధర్మమేనా?"

"నిర్మల్‌ని నా కొడుకులాగే భావించి పెంచాను. నా శ్రమకు వాడు తగిన ప్రతిఫల మిస్తున్నాడు. నిజంగా వాడు నిర్మలుడే. సార్థకనామధేయుడు. నా ఆదర్శాల్నీ ఆశయాల్నీ నిర్మల్ దేదీప్యమానం చేస్తున్నాడు. నాకెంతో గర్వంగావుంది. "ఇన్నాళ్ళకు నీతో ఓడిపోయాను. నా ఓటమిని అంగీకరిస్తున్నాను. నా ఆస్తిలో సగం నీపేర రాసేస్తాను. కాని ఈవిధంగా ఇంత భయంకరంగా పగ తీర్చుకోవద్దని మనవి."

బాగుంది—నీ ఎంగిలి మెతుకుల కాశించి, నీ ఉచ్ఛిష్టాన్ని స్వీకరించే కుక్కనయ్యే అవసరం నాకు లేదు. నీకుమల్లే నేను ధర్మాత్ముణ్ణి కాను. నేను నా స్తికుణ్ణి. జ్ఞాపకముంచుకో. నేను అపకారానికి ప్రతీకారం తీర్చుకోను. అనుగ్రహామనే ముష్టిని కూడా స్వీకరించను."

హరిమోహన్ వాదించలేకపోయాడు. వెంటనే నిర్మల్ దగ్గరకు పరుగెత్తాడు. "నే వింటుందంతా ఏమిట్రా నాయనా! వంశాని కీవిధంగా కళంకం తేవటం నీకు ధర్మమేనా?" అన్నాడు.

వంశంయొక్క కంళకాన్ని తుడవటానికే ఈ నా ప్రయత్నమంతాను. లేకపోతే నాకు పెళ్ళిచేసుకోవాలనే కోరికే లేదు" అన్నాడు నిర్మల్.

"నీకు ధర్మదృష్టన్నా లేకపోయిందట్రా? ఈ పిల్ల - పెద్దన్నకి భార్యలాంటిది. దాన్ని నువ్వు........"

మధ్యనందుకున్నాడు నిర్మల్ - "భార్యలాంటిదా ? అలాంటి అపశబ్దాలు పలక్కండి." నోటికి వచ్చిన తిట్లన్నీ తిట్టాడు. హరిమోహన్. చెవిటివాడికిమల్లే జవాబివ్వకుండా ఊరుకున్నాడు నిర్మల్.

హరిమోహన్‌కు వచ్చిన చిక్కేమిటంటే-నిర్మల్‌గానీ, అంజలిని పెళ్ళిచేసుకుంటే తను ఆత్మహత్య చేసుకుంటాడని సిగ్గులేకుండా పురందర్ అందరితోనూ చెప్పుకుతిరుగుతున్నాడు.

ఇంతవరకు అంజలితో నిర్మల్ ముఖాముఖి ఎప్పుడూ మాట్లాడలేదు. ప్రకాశ్ వున్నప్పుడు అతనెదుట ఏవో రెండు ముక్కలు ముక్తసరిగా మాట్లాడివుంటాడేమో! సంబంధం పూర్తిగా స్థిరపడింతరవాత ప్రకాశ్‌బాబు నిర్మల్‌కి అనుమతిచ్చాడు. పెళ్లికిముందు అంజలితో ఏదన్నా మాట్లాడుకోమనీ, ఈ విషయంలో ఆమె ఇష్టాయిష్టాలుకూడా కనుక్కోమనీ, ఇది చాలా అవసరమనీ, ఒప్పుకున్నాడు నిర్మల్.

తరవాత అంజలితో ప్రకాశ్ అన్నాడు - "అమ్మా! నా ముచ్చటతీరేట్టుగా ఈవేళ నువ్వు శృంగారించుకోవాలి." ఆమె సిగ్గుపడిందేమో - అతని పాదాలకు నమస్కరించి పాదధూళిని తీసుకుంది. గబుక్కున కాళ్లు వెనక్కు లాక్కుంటూ అన్నాడు - "ఇన్నాళ్లు నా సాంగత్యంలో వున్నప్పటికీ నీలోని భక్తిని నేను వేరుపర్చలేకపోయాను. వయస్సునుబట్టి నేను పెద్దవాణ్ణేనని ఒప్పుకుంటున్నాను. కాని, నువ్వు నా తల్లివైనందుకు

సొకన్నా పెద్దదానవు;" అంటూ ఆమె నొసలు ముద్దెట్టు కున్నాడు. తను తీసుకువచ్చిన బట్టల్ని ఆమె కందిచ్చాడు. "ఈ వేళ నా మిత్రునింట్లో విందు. రాత్రికి రావటం కాస్త ఆలస్యం కావచ్చు" అన్నాడు ప్రకాశ్.

"నన్నాశీర్వదించండి బాబాయ్" అందామె. "ఈ వృద్ధాప్యంలో, ఈ నాస్తికుణ్ణి ఆస్తికునిగా చేసేట్టున్నావమ్మా. ఆశీర్వాదాల్లో నాకేమీ నమ్మకంలేదు. అయినా నీ ఈ నిష్కళంకమైన మొహాన్ని చూస్తే ఆశీర్వదించాలని బుద్ధిపుడు తోంది" అంటూ ఆమెమొహాన్ని పైకెత్తిచూశాడు. ఆమెను ఆశీర్వదించి, అక్కడినుండి బయల్దేరాడు.

ప్రకాశ్ బాబు తన మిత్రునింట్లో విందులో పాల్గొంటు న్నాడు. అప్పుడే ఒకమనిషి రొప్పుతూవచ్చి 'అంజలి చనిపో యింద'ని కబురుచెప్పాడు. ఇంటికివచ్చి చూచాడు ప్రకాశ్. మంచంమీద అంజలి మృతశరీరం - అతను చెప్పిన ప్రకారం గానే శృంగారించుకుని వుంది. చేతిలో ఉత్తరం, తలవైపు నిర్మల్ వున్నాడు. ఉత్తరం చదివాడు—

బాబాయ్,

మీ కోరికను నేను తీర్చలేకపోయాను. నన్ను క్షమించండి. మీమాటవిని ఇంతవరకూ నేను ప్రయత్నించాను. కాని అతన్ని (పురందర్‌ని) ఇప్పటివరకూ మరవలేకపోయాను. మీ పాదపద్మములకు అనేక నమస్కారములు.

పాపాత్మురాలు - అంజలి.

*　　*　　*　　*

# 6

నా స్తికుడు ప్రకాశ్ బాబు చనిపోయేముందు నిర్మల్‌తో అన్నాడు-"ఇదిగో శ్రాద్ధకర్మలు వగైరాలు చెయ్యాలనే ఉద్దేశముంటే నీ తండ్రిడిది చేసుకోగాని, ఈ పిచ్చివాడికేమీ అవసరం లేదు."

అతని మరణ వృత్తాంత మిది :—

కలకత్తాలో మొట్టమొదట 'ప్లేగు'వచ్చినప్పుడు వీధిలోనున్న నిమ్నజాతులవాళ్ళకే ముందు దెబ్బ తగుల్తుందనుకున్నాడు హరిమోహన్. "అన్నయ్యా! ముర్షిదాబాద్‌లో మనకు ఇల్లు దొరికింది. నువ్వుకూడా వస్తే..." అంటూ నీళ్లు నమిలాడు హరిమోహన్.

"బాగుంది. వీళ్ళనువదలి ఎలా రమ్మన్నావ్ ?"

"ఎవరిని ?"

"మా దేవతలను."

రుసరుసలాడుతూ అక్కడినుండి కదిలాడు హరిమోహన్. నిర్మల్ దగ్గరకువెళ్లి "పద" అన్నాడు.

"నాకు బోలెడు పనుంది" అన్నాడు నిర్మల్.

"మాలమాదిగల శవాల్ని మొయ్యటమేగా గొప్ప పని ?"

"అవును, అవసరమొస్తే అది కూడాను."

"అవునవును, అవసరమొస్తే నీ పితృదేవతల్ని కూడా నరకానికి పంపించటానికయినా వెనుకాడవు. దరిద్రగొట్టు

వెధవా! నా స్తికుడా!" ధుమధుమలాడుతూన్న మొహంతో వచ్చి రెండుగంటలసేపు దుర్గావిగ్రహం ముందు జపంచేశాడు. కలకత్తానుండి హరిమోహన్ వెళ్లిపోయాడు.

వీధిలో ప్లేగు వ్యాపించింది. డాక్టర్లను పిలిస్తే ఆస్పత్రికి తీసుకుపోతారని వాళ్ళను పిలవనేలేదు. ప్రకాశ్‌బాబు, తనఇంట్లో కొంతభాగం ఖాళీచేసి ఆస్పత్రిలా తయారుచేశాడు. మేమంతా నిర్మల్‌తోపాటు రోగుల శుశ్రూషలో నిమగ్నులమయాం.

మాలో ఒక డాక్టర్‌కూడా వున్నాడు. మా ఆస్పత్రికి మొట్టమొదట తురకవాడు వచ్చాడు. వాడు చచ్చిపోయాడు. రెండోరోగి స్వయంగా ప్రకాశ్‌బాబే. అతనుకూడా బ్రతకలేదు. ఆఖరికి అతనన్నాడు – "ఇంతవరకూ నేను ఏ మతాన్నయితే స్వీకరించానో, ఈ వేళ ఆ మతం యొక్క ఆఖరు బహుమానాన్ని నేను పొందాను. మరి నాకే విధమైన కోరికలూ లేవు."

తనజీవితంలో నిర్మల్ ఎప్పుడూ ప్రకాశ్‌బాబుకు నమస్కరించలేదు. గాని, అతని మృత్యువు తరవాత, ఈ వేళ మొట్టమొదటిసారి, ఆఖరుసారి కూడాను అతనికి నమస్కరించి పాదధూళిని తీసుకున్నాడు. తరువాత, ఇంకోనాడు హరిమోహన్, నిర్మల్‌ని కల్సుకుని – 'నాస్తికుని చావు ఇలాగే వుంటుంది' అన్నాడు. నిర్మల్‌కూడా గర్వంగా దీనికి విపరీతమైన భావంతో "అవును" అన్నాడు.

* * *

'ఫూ' అని ఒక్కసారి ఊదగానే దీపం ఆరిపోయినట్టు ప్రకాశ్ బాబు చనిపోయిం తరవాత నిర్మల్ ఎక్కడికో వెళ్లి పోయాడు. అతనిజాడలు మాకేమీ తెలియలేదు. రెండు సంవత్సరాలవరకూ నిర్మల్ దేశదేశాలు పర్యటన సాగిస్తున్నాడని చిన్నగాలివార్తలా తెలిసింది. తరవాత ఏ విధమైన సంగతులూ తెలీదు.

అకస్మాత్తుగా మాకు ఓ నాడు తెలిసింది – నిర్మల్ చిటగాంగ్ పరిసరాల్లో లీలానందస్వామితో కలిసి భజనలు చేస్తున్నాడని.

నిర్మల్ నాస్తికుడంటే నేనోసారి ఎలా నమ్మలేదో, అలాగే లీలానందస్వామి అతనిచేత భజనలు చేయిస్తున్నాడంటే కూడా ఓ పట్టాన నేను నమ్మలేకపోయాను. నేనే కాదు – నా స్థానంలో ఎవరున్నా నమ్మరు. అతను లేనప్పుడు మా పార్టీ నాస్తికత్వాన్ని ప్రచారం చేసింది.

ఈ వార్త వినగానే ప్రజలకు ఎలా మొహం చూపించాలా అనే మీమాంసలో పడ్డాం. సభ్యులందరికీ నిర్మల్ కోప భాజను డయాడు. అతని పేరంటే అందరూ ఏవగించుకో సాగారు. మా దళానికి నిర్మల్ కళంక మాపాదించినప్పటికీ నేను మాత్రం తక్కినవాళ్ళలా ఏవగించుకోలేదు. నా మనస్సులో ఏహ్యభావం కించిత్తన్నా రాలేదు. నిర్మల్ పట్ల నా హృదయంలో నున్న అజ్ఞాత ప్రేమప్రవాహాన్నరికట్టలేక పోయాను.

*　　*　　*

# 7

ఆఖరికి నేను లీలానందస్వామిని వెదకటానికి బయ
ల్దేరాను. నిర్మల్ దగ్గరకు చేరుకున్నాను. నన్ను చూడగానే
ఎంతో ఆప్యాయంతో కావిలించుకున్నాడు. అతని ప్రవర్తన
చూచి ఆశ్చర్యబోయాను.

అప్పటికి లీలానందస్వామి విశ్రాంతి తీసుకుంటున్నాడు.
తలుపు ఓ రెక్క తెరువబడేవుంది. నిర్మల్‌తో నన్ను చూడ
గానే నిర్మల్‌ని పిల్చాడు. "ఎవరది?" అని నన్ను చూసిస్తూ
ప్రశ్నించాడు.

"నా మిత్రుడు శ్రీ విలాస్" అన్నాడు నిర్మల్. నన్ను
నిర్లక్ష్యంగా చూస్తూ నిర్మల్‌ని చిలుము నింపమని ఆజ్ఞా
పించాడు.

వెంటనే అతని ఆజ్ఞ పాలించబడింది. నేను నాలుగు
వైపులా చూశాను. కూర్చోటానికి ఎక్కడా జాగాలేదు.
విధిలేక ద్వారందగ్గరే నిలబడిపోయాను. స్వామీజీ నన్ను
ఎగాదిగా చూశాడు. ఏమనుకున్నాడో ఏమిటో నిర్మల్‌నిచూచి
కాళ్లు చాచాడు.

నిర్మల్ వెంటనే కిందకూర్చుని పాదసేవ ఆరంభించాడు.
నన్ను ఉడికించటానికే స్వామీజీ నిర్మల్‌చేత అదంతా చేయి
స్తున్నాడని వెంటనే గ్రహించాను. అతని దర్శనార్థంవచ్చిన
భక్తులకోసం వసతులు ఏర్పర్చబడ్డాయి. వాళ్ళకోసం పాయసం
తయారైంది.

భోగామెక్కి రాత్రి పదింటివరకూ చెవులు చిల్లులు పడేట్టుగా గొంతుచించుకుని మరీ భజనసాగించారు. రాత్రికి ఏకాంతంలో నిర్మల్‌ని కల్సుకుని అడిగాను – "నిర్మల్ ఏవిఁటిదంతా? చిన్నప్పటినుండీ నువు స్వాతంత్ర్యప్రియుడవు. ఎప్పుడూ ముక్తిమంత్రాన్నే జపిస్తూ వచ్చావు. నువ్వేటువంటి బంధనంలో బంధించబడ్డావో నీకేమన్నా తెలుసా? కాలేజీ (ప్రకాశ్ బాబుని మేం అలాగే పిల్చేవాళ్ళం) మృత్యువుని అంత ఘోరమైన కారణంగా పరిగణించవచ్చా?"

నా పేరు మొదటి రెండక్షరాల్ని తిరగవేసి చనువుతో 'విశ్రీ'అని పిల్చేవాడు నిర్మల్.

అన్నాడుకదా– "ఇదిగో విశ్రీ కాకాజీ, బ్రతికున్నప్పుడు జీవితంయొక్క కార్యక్షేత్రంనుండి నన్ను విముక్తుణ్ణిగాచేశారు; చిన్నపిల్లాణ్ణి స్వాతంత్రంగా ఆడుకోటానికి వదిలేసినట్టుగా. అతను చనిపోయింతరువాత, నన్ను రససాగరంలో ఈదుతూ తేల్తూ సంతోషంగావుండమని స్వతంత్రుణ్ణిగా చేశారు. పగటివేళ ఆ ముక్తి ననుభవించాను. మరి రాత్రివేళ, ఈ ముక్తినుండి నే నెందుకు వంచితుణ్ణికావాలి! ఇదిగో ఈ రెండు కార్యాలూ కాకాజీగారి ప్రేరణయొక్క పరిణామమేనని ఇప్పటికన్నా తెలుసుకో."

"నువ్వేమైనా అను, గాని ఈ చిలుము నింపటం, పాద సేవచెయ్యటం, కాకాజీగారి ఉద్దేశాలుకావు. ముక్తియొక్క రూపం ఇదికాదు;" అన్నాను నేను. నిర్మల్ చెప్పిన జవాబుకి అతన్ని నే నందుకోలేనసే నిర్ణయానికి వచ్చాను. కల్సు

కోగానే, ఏ నిర్మలైతే నన్నాలింగనం చేసుకున్నాడో, ఆ వ్యక్తి రూపమైన శ్రీవిలాస్‌ని నేను కాను. సర్వభూతమయమైన శ్రీవిలాస్.

అతనితో వాదించి లాభంలేదనుకున్నాను. కాని - నిర్మల్‌ని వదిలి వుండలేకపోయాను. తనప్రవర్తనవల్ల నిర్మల్ అందర్నీ ఆకర్షించాడు. భజనలుచేస్తూ తను ఎక్కడెక్కడో తిరగసాగాడు.

మెల్లి మెల్లిగా నాకూ్కడా నిషాఎక్కింది. నేనుకూడా నిర్మల్‌ని అనుకరించాను. గురూజీ పాదసేవ చేశాను. ఇంతే కాదు - ఓనాడు ఆవేశంలోనున్న నిర్మల్ యొక్క అలౌకికమైన రూపాన్ని చూశాను.

ఇంగ్లీషు చదువుకున్న మాలాంటివాళ్ళను తనవశం చేసుకున్న లీలానందస్వామిగారి ప్రజ్ఞ అనండి; లేక మరేవన్నా అనండి, మరింతజోరుగా వెలిసింది. కలకత్తాలోనున్న అతని భక్తులు తమదగ్గరకు,రమ్మని బలవంతం చెయ్యసాగారు. వాళ్ళ కోరికను తృణీకరించలేక స్వామీజీ వెంటనే కలకత్తా చేరు కున్నారు.

కలకత్తాలో 'నితాయి'అనే నామధేయుడు స్వామీజీకి పరమభక్తుడు. ఎప్పుడువెళ్ళినా అతనింట్లోనే మకాం. వాళ్ళకు అక్కడ అన్నివిధాలా ఆదరణ, సౌకర్యాలు సవ్యంగా జరిగేవి. స్వామీజీని సేవించటమే నితాయియొక్క ప్రధానోద్దేశం.

నితాయి, తను చచ్చేముందు, తన అందమైనభార్యకు తిండికీ బట్టకూ వుంటానికీ అంటే తలదాచుకోటానికి మాత్రం

అధికారమిచ్చి తక్కిన సంపత్తినంతా స్వామీజీకి సమర్పించే శాడు. తను బ్రతికున్నప్పుడు తనకోరిక ఫలించినా ఫలించక పోయినా, చచ్చింతరవాతన్నా అతనిల్లు ఓ తీర్థస్థానానికిమల్లే తయారైతే తన ఆత్మకు తృప్తిగావుంటుందనుకునేవాడు. ఆ ఇంట్లోనే మేమంతా తిష్ఠవేశాం.

*　　　*　　　*

# 8

మేమిద్దరం స్వామీజీకి ప్రధానశిష్యులం. మమ్మల్ని వదలి స్వామీజీ ఒక్కనిమిషం వుండలేకపోయేవాడు. రోజంతా మేం వేదాంతచర్చల్లో సమయం గడిపేవాళ్ళం. మధ్యమధ్యను ఇంటి లోపలినుండి మధురమైన నవ్వు వినపడేది. ఒక్కోసారి గట్టిగా ఆమె మాట్లాడుతున్న స్వరం వినిపించేది.

ఇంతకూ, నితాయి భార్యపేరు దామిని. మా ఇద్దరి దగ్గరా దామినికి చాటులేకపోయింది.

(ఆరంభంలో మన్ననచేస్తూ ముసుగువేసేద.) గురూజీ దగ్గర ఆమెకు చాటు అసలే వుండేదికాదు. ఆమె అందకత్తె- ఆమె వృత్తాంత మిది :—

జనపనార వ్యాపారంలో అన్నదా శంకర్ (దామిని తండ్రి) బోలెడు డబ్బు గడించాడు. అప్పుడే దామినికి నితాయితో పెళ్ళయింది. ఆ తరవాత అల్లుడికి వ్యాపారవిషయాలు నేర్పించాలని అన్నదాబాబు చాలామట్టుకు ప్రయత్నించాడు. గాని, చిన్నప్పటినుండీ నితాయికి భగవద్భక్తి వుండేది. అదే కారణంచేత అతనెల్లప్పుడూ విరక్తిభావంతోనే వుండేవాడు.

అన్నదాబాబు ప్రయత్నాలు వ్యర్థమైనాయి. అల్లుడికీ, కూతురికీ చాలాడబ్బు, నగలూ వగైరాలిచ్చాడు. వాళ్ళకోసం ఓపెద్ద భవనంకూడా ఇచ్చాడు. నితాయి ఒకానొకనాడు ఒక విశేషయోగంలో బృహస్పతియొక్క విశేషదృష్టివల్ల జీవన్ముక్తుడవుతాడని ఒక జ్యోతిష్కుడు చెప్పాడు. ఆ క్షణంనుండే జీవన్ముక్తిని పొందటానికి కామినీ కాంచనాలయందు లోభాన్ని త్యజించ నిశ్చయించుకున్నాడు. ఈలోపుగానే లీలానందస్వామి దగ్గర మంత్రదీక్ష కూడా పుచ్చుకున్నాడు.

ఇంతలో అన్నదాబాబు దురదృష్టంవల్ల వ్యాపారంలో దివాలాతీశాడు. తిండీ గుడ్డకూడా కరువైంది. అంతా స్వాహా అయిపోయింది.

ఓనాడు సాయంత్రం దామినితో నితాయి అన్నాడు – "స్వామీజీ వచ్చారు. ఉపదేశించాలని నిన్ను పిలిపించారు. వెళ్లు."

"ఇప్పుడు వెళ్ళటానికి నాకు తీరికలేదు" అని స్పష్టంగా జవాబిచ్చింది దామిని. చీకట్లో దామిని తన నగలన్నీ మూట కట్టి పెట్టెలో పెట్టడం చూశాడు నితాయి. ఆఖరికి అడగనే అడిగాడు – "ఇదంతా ఏంచేస్తున్నావ్?"

"నగల్ని జాగ్రత్త పెడుతున్నా"నని నిర్లక్ష్యంగా జవాబిచ్చింది. "అందుకేనా తీరికలేదన్నావు. సరే" అంటూ కదిలాడు.

రెండోరోజు దామిని పెట్టె తెరిచేసరికి శూన్యం – "నా నగలేమైనవీ?" ప్రశ్నించిందామె.

"నగలన్నీ నువ్వు గురుదేవులకు సమర్పించేశావుగా! అందుకే అతను నిన్ను అదే సమయంలో పిలిపించాడు. అతను అంతర్యామి. నీ మనస్సులోనున్న కాంచనలోభాన్ని గురుదేవులు హరించేశారు."

"అదంతా నాకు తెలీదు. నా నగలు నాకు తెచ్చిపెట్టు." (భర్తను ఆమె 'నువ్వు' అని సంబోధించేది.)

"ఎందుకూ? నగ లేం చేసుకుంటావ్?"

"మా నాన్నగారు నా కిచ్చారు. అతనికిప్పుడు చాలా ఇబ్బందిగా వుంది. గనుక వాటిని అతనికే ఇచ్చేస్తాను."

"నగలు సురక్షితమైన స్థానానికి చేరుకున్నాయి. సంసారుల చేతుల్లో పడకుండా భక్తుల సేవకోసం వినియోగపడతాయి."

ఈవిధంగా భక్త్యావేశంలో చౌర్యం ఆరంభమైంది. దామిని కన్నవారు పిడికెడు అన్నంలేక పిల్లల్తోసహా మలమలా మాడుతూంటే, వాళ్ళింట్లో రోజూ అరవైమంది భక్తులకోసం మృష్టాన్నాలు తయారవుతుండేవి. వంటంతా దామిని స్వయంగానే చేసేది. ఒక్కోసారి కోపంకొద్దీ కూరల్లో ఉప్పు వేసేది కాదు. పొయ్యిమీద పాలు అలాగే వుంచేసేది. అవన్నీ మరిగిపోయేవి.

అప్పటికీ కార్యక్రమంలో మార్పులేదు. అప్పుడే నితాయి చచ్చేప్పుడు ఆమె భక్తిహీనతకు మంచి శిక్ష విధించాడు. ఆస్తినంతట్నీ భార్యతోసహా గురుదేవులకే సమర్పించేశాడు.

* * *

ఇంటో భక్తిప్రవాహం మహాజోరుగా ప్రవహించింది. దామిని ప్రవర్తన చాలా విచిత్రంగా వుండేది; అంటే అంతా విరుద్ధంగా నన్నమాట. ఆమె వేషం విధవకుమల్లే వుండేదికాదు. ఎల్లప్పుడూ ఎవరిమీదనో చిరాకుపడుతూ రుసరుస లాడేది. 'చాలా విచిత్రమైన ఆడదిలా వుందే! ఎంతోమందిని చూశాం గాని, ఇలాంటి దాన్నెప్పుడూ చూడలేదు' అనుకునేవారు కొందరు భక్తులు.

"దేవునికి బలవంతులతోనే దెబ్బలాడాలని సరదాగా వుంటుంది. ఎప్పుడైతే ఈమె ఓడిపోతుందో అప్పుడు ఈమె నోటంట మాటకూడా రాదు" అంటారు స్వామీజీ. గాని—

హఠాత్తుగా ఓనాడు దామిని అవిచలితమైన భక్తి, ఆమె వింతప్రవర్తన మమ్మల్నందర్నీ ఆశ్చర్యసాగరంలో ముంచేసింది. ఆమె మునుపటి దామిని కాదు. ఆమె సేవవల్ల భక్తులందరిలోనూ తృప్తిగోచరించింది. ఈవిధంగా దామిని సౌదామిని అయిపోగానే నిర్మల్ ఆమెశోభను చూడసాగాడు. కాని, దామినిని చూడలేదు – అని నేను గట్టిగా చెప్పగలను.

నిర్మల్ గదిలో లీలానందస్వామి ఫోటో ఒక వుండేది. ఓ నాడు అతను చూచేసరికి ఫోటో ఫ్రేము విరిగిక్రిందపడుంది. తన పెంపుడుపిల్లి టేబిలుమీదినుండి తోసిందేమో నను కున్నాడు. ఈ లోగా మరికొన్ని అల్లరులు జరిగాయి; అతని గదిలో, జరుగుతున్నదంతా చూస్తే నాలో అదోవిధమైన కల్లోలం పుట్టుకువచ్చేది.

ఓ నాడు మధ్యాహ్నం గురూజీ విశ్రమిస్తున్నారు. భక్తులుకూడా అలిసిపోయి వున్నారు. నిర్మల్ ఏదో పనిమీద తనగదిలోకి వెళ్లాడు. ద్వారందగ్గర వుండగానే అతనికి వినిపించింది..."పాషాణం! ఓ రాతిగుండెవాడా! కనికరించు నన్ను. చల్లని చూపు. నన్ను చంపెయ్" నిర్మల్ మంచందగ్గర బుర్ర కొట్టుకుంటూన్న దామినిని చూశాడు. ఎందుకోగాని, నిర్మల్ భయపడ్డాడు. వెంటనే అక్కడినుండి పరుగుతీశాడు.

స్వామీజీ, ప్రతీసంవత్సరం ఏదో దుర్గమమైన ఏకాంత ప్రదేశానికి వెళ్తుండేవారు. ఈ సారికూడా మాఘమాసంలో వెళ్లాలనే నిశ్చయించారు. మేమంతా బయల్దేరాం. దామిని కూడా వస్తానంది. 'సరే' నన్నారు స్వామీజీ.

ఆ వేళ ఆరుగంటలవరకు నడిచి సముద్రతీరానికి చేరుకున్నాం. తీరాన కొబ్బరిచెట్లు, శిథిలాలు అనేకమున్నాయి. ఓ గుహదగ్గర మకాం. స్వామీజీ ఓ చిన్న భావగీతిక నెత్తుకున్నారు—

నే నెటుల కలసితిని ప్రియతమా
నే నెటుల కలసితిని ప్రియతమా
దినకరు డలసె దివాంతమాయె
ఆకస్మికముగ ఆకసముననూ
సంధ్యాగమనం బాయె సఖా ॥నే॥
కటాక్షించెదో కసిరెదవో
పరితపించెదను ప్రాణేశా
చుంబించెద నీ చరణాబ్జములన్

[illegible]
తృప్తిపొందితిని తృణమును నేను
భక్తురాలనో భాగ్యవిధాతా
నే నెటుల కలసితిని ప్రియతమా

పాట వింటున్నంతసేపూ దామిని ఏడుస్తూనేవుంది - పాట అయిపోయింది. అతని పాదాన్ని ఆమె నమస్కరించింది. తరవాత ఏదో భారాన్ని మోస్తున్నట్టుగా అక్కడినుండి కదలింది.

ఆ భావగీతిక పాడిన స్వామీజీ కంఠంలోని విరుపులు పాలతరగలై వెన్నెలతేటలై సర్వత్రా పరివ్యాప్తమైపోయినవి.

* * *

# 10

కొద్దిరోజులతరవాత మాయాత్ర ముగిసింది. అక్కడికి దగ్గరగ్రామంలోనే దేవాలయందగ్గర స్వామీజీగారి, ఒకభక్తు నిల్లుంది. మేమంతా అక్కడకి చేరుకుని పై అంతస్తులో మకాం వేశాం. గుహనుండితిరిగివచ్చాక దామిని మాకు చాలా అరుదుగా కనబడసాగింది. మా అందరికీ సరిగా వేళకు వండిపెట్టేది, గాని అంతగా కనబడేదికాదు. ఈలోగా ఇరుగుపొరుగు ఆడవాళ్ళతో ఆమెకు స్నేహం ఎక్కువైంది.

రోజంతా సాధారణంగా వాళ్ళతోనే సమయం గడిపేది. ఆమె చేసినపనుల్లో చాలామట్టుకు పొరపాట్లు కనబడేవి. గురుదేవులకు అప్పుడప్పుడు కోపంవచ్చేది. గాని శాంతస్వభా

వరంవల్ల బయటికేమీ అనేవారుకారు. ఓనాడు గురుదేవులు సాహసించి అన్నారుకదా - "దామినీ, ఈవేళ మధ్యాహ్నం నీకేవన్నా తీరిగ్గావుంటుందా? వుంటే..." మధ్యనే అందుకుంది దామిని - "ఈవేళ మధ్యాహ్నం లాడూలు చెయ్యటానికి వెళ్లాలి. మన వెనకవీధిలో రతన్‌బాబు చెల్లెలికి పెళ్ళి. నేను మాట ఇచ్చాను కాబట్టి వెళ్ళకతప్పదు;" అంటూ జవాబు కోసమన్నా ఆగకుండా పరుగుతీసింది. అక్కడేవున్న నిర్మల్ ఈ జవాబుకి ఆశ్చర్యబోయాడు. మహామహావాళ్లు ఇతని పాద సేవ చెయ్యటానికి తహతహ లాడుతుంటారు - గాని - ఇదో? ఇదెక్కడరాబాబు! అనుకున్నాడు.

ఓ నాడు గురుదేవులు ఏదో విషయాన్ని తీవ్రంగా చర్చిస్తున్నారు. మేమంతా కూర్చుని ధ్యానంగా వింటున్నాం. దామినికూడా మా వెనక కూర్చుని ఏదో అల్లుకుంటూ కూర్చుంది. ఆమెకూడా వింటుందేమోననుకున్నాం. కాస్సేపు తరవాత మేం వెనక్కి తిరిగి చూచేసరికి అక్కడ దామిని లేదు. స్వామిజీకూడా ఓ విధమైన ఔత్సుక్యం కలిగింది. వెంటనే ఆమెగదికి స్వయంగా వెళ్ళారు.

"ఇక్కడ నువ్వొక్కర్తెవే ఏం చేస్తున్నావ్ దామినీ! అక్కడికి వచ్చి వేదాంత చర్చల్లో పాల్గొనరాదూ!" అన్నారు. "అవసరంలేదు, నాకొక్కపని వుంది" అందామె. గురుదేవులు లోపలికి తొంగిచూశారు - ఆమెకెదురుగా ఓ పంజరంలో ఒక గ్రద్ద. రెండురోజులుముందు టెలిగ్రాఫ్ తీగెల్లో ఇరుక్కుని గాయపడ్డది. దానిచుట్టూ కాకులుచేరి పొడవ

నారంభించాయి. అక్కడినుండి దామిని ఎత్తుకువచ్చింది. అప్పటినుండి గ్రద్దకు సేవ ఆరంభమైంది.

ఇదేకాకుండా ఈ మధ్య నొక కుక్కపిల్లనుకూడా పెంచింది. భజన సాగుతున్నప్పుడు - తాళాలశబ్దం, మా గొంతుకలూ - వినిపించటం తడవుగా, ఒకస్థాయిలో అది కూడా మొరగ నారంభిస్తుంది. ఈ లోగా నిర్మల్ ఓ సారి దామిని నడిగాడు - "ఏం దామినీ! ఈమధ్యనువ్వు గురుదేవుల దగ్గరకు రావడం మానేశావ్ !" "ఏం మీకు నా అవసరమేముందీ ?" రయ్‌మని జవాబిచ్చింది. ఆ జవాబుతో అతను వెలవెలబోయాడు. మళ్ళీ అన్నాడు - "ఏవీఁ లేదు గాని, నీ మొహం చూస్తుంటే నువ్వు అశాంతంగా వున్నట్టుంది. నీకు శాంతి కావాలంటే....."

ఆమె మధ్యనందుకుంది. "మీరంతా నాకు శాంతిని చేకూరుస్తారా? రాత్రింబవళ్లు మనస్సుల్లో తరంగాలు లేవదీస్తూ మీరంతా స్వయంగా పిచ్చెత్తిపోతున్నారు. మీకు శాంతి ఎక్కడుంది ? మీకో నమస్కారం బాబు. నన్నేదో ఇలా వుండనివ్వండి. నే నశాంతంగా లేను. శాంతంగానే వున్నాను, వుంటాను."

"నువ్వు బాహ్యారంగాన్నే చూశావుగాని ఒక్కసారి కొంచెం ఓపికతో ఇంకా లోతుకువెడితే అక్కడేవీ తరంగాలు లేవనీ, అక్కడంతా శాంతంగానే వుందనీ నువ్వు స్వయంగానే గ్రహిస్తావు" అన్నాడు నిర్మల్.

ఆమె చేతుల్ని జోడించి నమస్కరిస్తూ, చిరాకుపడుతూ

జవాబిచ్చింది – "వద్దు బాబయ్యా వద్దు. నన్నింకా లోతుకు దిగమని చెప్పకండి. మీరు నా వెంట పడకుండావుంటే నాకదే చాలు."

గురుదేవులతో దామిని తప్పించుకుని తిరగటం, అతని మీద ఆమెకున్న కోపమే కారణం. నిర్మల్‌తో కూడా కాస్త దూరంగా వుండేది. వాళ్ళిద్దరిలోనున్న భావాల తేడాయే కారణం. పోతే, నేనొక్కణ్ణే మిగిలాను. తన కష్టసుఖాలు, తనెక్కడికి వెళ్ళిందీ, ఏంచేసిందీ, వెనుకటిచరిత్ర, ఇంకా ముందు ఆమె చెయ్యబోయే పనులు, వగైరాలన్నీ నాతో చెబుతుండేది.

నేనుకూడా ఈమధ్య గురుదేవుల సత్సంగంలో పాల్గొనకుండా తప్పించుకు తిరుగుతుండేవాణ్ణి. కారణం నాకే తెలీదు. బహుశః దామినిపట్ల నాకున్న సానుభూతే కారణమనుకుంటూంటా అప్పుడప్పుడు. అయితే నా చర్యల్ని నిర్మల్ గమనిస్తూనే వున్నాడని వేరే చెప్పనక్కరలేదనుకుంటా.

ఓనాడు నేను, దామిని పెంచుతున్న ముంగిస పిల్లకు పాలుపోస్తున్నాను. అప్పుడేవచ్చిన నిర్మల్ నన్ను చూశాడు. నాకు చాలా సిగ్గనిపించింది. అక్కడినుండి మెల్లిగా జారిపోవాలనే ఉద్దేశంతో పాలచెంబు అక్కడేవుంచి కదిలాను. ఇంతలో దామిని స్వరం వినిపించింది.

"ఏం శ్రీ విలాస్‌బాబు! ఎక్కడికి ప్రయాణం?" నా తల గోక్కుంటూ "కొంచెం......" అంటూంటే నా మాట పూర్తికానివ్వకుండా తనే అందుకుంది: "వాళ్ళ కీర్త

నలు, భజనలు పూర్తయాయిగా! ఇప్పుడేమంత పుట్టి మునిగిం దని! కాస్సేపు కూర్చుని మరీ వెడుదురుగాని వుండండి."

ఇనతల నిర్మల్, అవతల దామిని! ఏం చెయ్యాలో తోచింది కాదు. అలా మొద్దులా నిలబడిపోయాను. ఆమె మళ్ళీ అంది:

"ఈ ముంగిస మహా చెడ్డ అల్లరిపెడుతోంది. నిన్నరాత్రి వెళ్ళి ఆ తురకాళ్ళింట్లో కోడిని తినేసింది. దీన్నిలాగే విప్పేసి వుంచేస్తే లాభంలేదు. దీనికోసం ఓ బోను తెమ్మని శ్రీ విలాస్ బాబుతో చెప్పాను." ఈ వాక్యాన్ని ఆమె ఎంతో ఉత్సా హంతో చెప్పింది. అందులో 'గర్వం' ధ్వనించింది. నాడు నిర్మల్‌ని, స్వామీజీ చిలుం నింపమని ఆజ్ఞాపించటం జ్ఞప్తికి వచ్చింది. ఇప్పుడిది. ఏదన్నా ఒకటే అనుకున్నా.

నిర్మల్ ఏమీ జవాబివ్వకుండా అక్కడినుండి చరచరా నడిచిపోయాడు. అతను కనిపించేంతవరకు చూచింది దామిని. ఆమె మొహంలో విజయోల్లాస పూర్వకమైన గర్వం గోచ రించింది.(అందులో క్రూరమైన అట్టహాసంకూడా వుందేమో!)

ఎలాగన్నా నిర్మల్‌ని ఉడికించాలని ఆమె ప్రయత్నిం చేది. ఒక్కోసారి నాకోసం మంచి తినుబండారాలు చేసిపెట్టేది. నేను తింటున్నప్పుడు నిర్మల్ ఒకటి రెండుసార్లు చూశాడు కూడాను. మా ముగ్గురిలోనూ ప్రత్యేకించి నాపరిస్థితిమాత్రం మహా విచిత్రంగా వుంది. కారణం ఏమిటంటే— ఈ నాటకంలో ముఖ్యపాత్రలు రెండు. వాటియొక్క అభినయం — ఆదినుండి అంతంవరకు "స్వగతం". నాది "ప్రకాశం".

* * * *

# 11

కొన్నాళ్ళవరకు నిర్మల్ భక్తిలో సంపూర్ణంగా లీన మయాడు. ఆఖరికి ఓనాడు దామిని విషయమై నాతో చాలా తీవ్రంగా వాదించాడు. ఆమెను మా దళంనుండి వేరుచేయా లన్నాడు. నేను ప్రతీదాన్నీ ఘోరంగా ఖండిస్తూ వచ్చాను. ఆఖరికి కోపంతో నా దగ్గరనుండి వెళ్లిపోయి స్వామీజీ పాద సేవలో నిమగ్నుడయాడు. స్వామీజీకూడా దామిని అంటే ఓ మోస్తరుగా భయపడేవారు. ఎందుకో!

ఓనాడు మందిరంలో భజన మహాజోరుగా రంయ్‌మని సాగుతోంది. ఆరంభమైన కాస్సేపటికి నేను మెల్లిగా తప్పించు కుని దామిని దగ్గరకు చేరుకున్నాను. ఆవేళ దామిని తన హృదయద్వారాన్ని స్పష్టంగా నా ఎదుట విప్పేసింది. ఎన్నో చెప్పింది.

ఈలోగా మా వెనక నిర్మల్ వచ్చి ఎప్పుడు నిలబడ్డాడో మా ఇద్దరికీ తెలిసిందేకాదు. అప్పటికీ దామిని కళ్ళవెంట నీరు కారుతూనే ఉన్నాయ్. నిర్మల్ వచ్చాడేగాని, భజన ఇంకా పూర్తికావటానికి చాలాసేపుందని నాకు తెలుసు.

అతనిరాకను గమనించగానే దామిని – వెంటనే కళ్లు తుడుచుకుని ప్రక్కగదికి వెళ్లబోయింది. ఆమె నాపుతూ నిర్మల్ అన్నాడు. "దామినీ, నీతో ఓమాట చెప్పాలి." దామిని కూర్చుండిపోయింది. నేను మెల్లిగా బయటికి దారి తీయాలనుకున్నాను. కాని, ఆమెచూపులు నన్నక్కడినుండి కదలనివ్వలేదు.

"ఇదిగో, మేం దేనికోసమైతే గురుదేవుల నాశ్రయిం చామో; నువ్వు అందుకోసం ఇక్కడ లేవుగా! మరి అలాం టప్పుడు నువ్వు భక్తులమధ్య ఎందుకున్నావ్?" అన్నాడు నిర్మల్.

ఆమెకళ్లు భగ్గుమన్నట్టు ఎర్రబారినయ్. అంది కదా – "ఎందుకున్నానా? మీ భక్తులంతా ఈ భక్తిహీనురాల్ని 'భక్తి' అనే గోతిలో కాళ్లుచేతులు కట్టి పడేశారుగా! నా కోసం మరేవన్నా దారి వదిలారా?"

"నీ ఆత్మీయులదగ్గ రెక్కడన్నా వుండాలని నీ కిష్టంగా వుంటే నిన్నక్కడికి పంపించెయ్యాలని నిశ్చయించాం" అన్నాడు నిర్మల్.

"మీరంతా నిశ్చయించారా?...కాని నేనేమీ నిశ్చ యించుకోలేదే!" దామిని జవాబు.

"ఇలాచేస్తే నీకేవన్నా అసౌకర్యంగా వుంటుందా?" అన్నాడు నిర్మల్. "ఒక భక్తుడు తన స్వార్థంకోసం ఒకబందో బస్తు చేస్తాడు; మరొకాడు మరో స్వార్థంకోసం మరోవిధంగా చేస్తాడు. ఈ విధంగా మీ మధ్యను నలగటానికి నేనేం పాచిక ననుకున్నారా?" అంటూ ఏడుస్తూ ఆమె ప్రక్కగదికి వెళ్లి పోయింది.

నిర్మల్ ఆశ్చర్యంతో అక్కడినుండి కదిలాడు. కాని భజనకు మాత్రం కాదు.

ఈ కొద్దిరోజుల్లోనే నిర్మల్ అదోలా తయారయాడు. నా విషయమై మాత్రం దామిని ప్రవర్తన మునుపటిలాగే వుంది. ఒక్కోసారి నేను, నిర్మల్, స్వామీజీ ఏదో విషయమై

మాట్లాడుతూంటేకూడా దామిని వచ్చి "శ్రీ విలాస్ బాబూ, ఇలా ఒక్కసారి రండి" అని పిల్చేది. నేను, వెళ్లేదా వద్దా–అనుకునే వెళ్లిపోయేవాణ్ణి. నేను లేనప్పుడు వాళ్లిద్దరూ ఆ చర్చను ముందుకు సాగించాలనుకునేవారు, గాని కాస్సేపటికి ఆగిపోయేది.

ఇంతా ఏదో మహారహస్యమున్నట్టు దామిని నన్ను పిల్చేది, కాని తీరా వెళ్ళేసరికి ఏదో లోకాభిరామాయణం ఆరంభించేది. కాస్సేపటికి మా సంభాషణకూడా పూర్తయేది. ఇలా చేస్తే మిగతావాళ్ళు ఏమన్నా అనుకుంటారనన్నా ఆమెకు అనుమానం, జంకూ లేకపోయేది. కాని, ఈ వింత ప్రవర్తనకు వాళ్లిద్దరూ అంటే నిర్మల్, గురూజీ ఇందులో ఏదో రహస్యముందని అనుమానించసాగారు.

నేనూ, నిర్మల్, లీలానందస్వామిగారి దళానికి రెండు ప్రధాన వాహకులం, అంటే 'ఐరావతం', 'ఉచ్చైశ్రవ' అని చెప్పొచ్చు. కనుక, స్వామీజీ మమ్మల్ని ఏ విధంగానూ వదల్లేదు. అందుకని ఓసారి దామినితో అన్నారు - "దామినీ, ఇక్కడినుండి నీ పినతల్లింటికి నువు వెళ్ళక తప్పదు."

"అలా నేను వెళ్ళలేను. ఆమె నా స్వంత పినతల్లి కాదు. అదీకాకుండా నన్ను తనింట్లో వుంచుకొనేంత అవసరం ఆమెకేం వచ్చిందీ?" అంది దామిని. "నీ కయే ఖర్చులు ఆమె భరించ నవసరంలేదు. దానికోసం నేను..." స్వామీజీ మాట కడ్డు వచ్చిందామె. అంది కదా—

"బాధ్యత ఖర్చులమీదనే ఆధారపడి వుందనుకుంటు

న్నారా? నా సౌకర్యాలు, మంచి చెడ్డలు, ఇంకా తదితరవిష యాల భారమూ ఆమెపై వుండదా?"

"అయితే నిన్నెల్లప్పుడూ నా దగ్గరే వుంచాలా ఏవిఁటి?" స్వామీజీ.

"దీనికి నేనా జవాబివ్వాలి?" దామిని.

"నేను చచ్చాక నువ్వెక్కడికి వెడతావ్?" స్వామీజీ.

"ఈ విషయమై ఆలోచించేంత అవసరం ఎవరికీ కలగ లేదు. 'నా' అనేవారు నాకెవ్వరూ లేరు. నాకు ఇల్లూ, వాకిలీ ఏవీఁలేదు. డబ్బుకూడా లేదు. గనుక – నా భారం గొప్పదని నాకు తెలుసు. అయితే నా భారాన్ని మీరూ భరించలేదు. మరొకర్ని భరించమని నియోగించలేరు కూడాను;" అంటూ దామిని అక్కడినుండి చరచరా వెళ్లిపోయింది.

* * *

## 12

ఓనాడు హిందీ బెంగాలీ పుస్తకాలుకొన్ని మంచివి కొని తెమ్మని దామిని 'హుకుమ్' చలాయించింది. అలాగేనని, నేను కొన్ని ఆధునిక రచయితల పుస్తకాల్ని తీసుకువెళ్లాను. అదృష్ట వశాత్తో దురదృష్టవశాత్తో అవి స్వామీజీచేతుల్లో పడ్డయ్. అవిచూచి ఆయనన్నారుకదా – "ఏం శ్రీవిలాస్, ఈ పుస్తకాలు ఇక్కడికి ఎందుకు వచ్చాయి? ఇందులో ఏవఁన్నా సార ముంద టోయ్?"

అనుకోకుండానే నా నోటంట వచ్చింది – "శాస్త

శ్రద్ధగాచూస్తే అందులోని సత్యాన్ని చూడగలరు.'' అసలు సంగతేమిటంటే నా మనస్సుకూడా మెల్లి మెల్లిగా విద్రోహం చెయ్య నారంభించింది. "సరే, అయితే నేనుకూడా కాస్త శ్రద్ధగానే చూస్తాను," అంటూ తలగడకింద వాట్ని పెట్టుకున్నారు. అవి మరి తిరిగిరావనుకున్నాను. ప్రక్కగదినుండి దామిని అంతా చూస్తూనే వుంది.

ద్వారందగ్గరకు వచ్చి ఆమె అంది—

"మిమ్మల్ని తెమ్మన్న పుస్తకాలు తెచ్చారా?" నే నూరుకున్నాను.

"అవి నువు చదవాల్సినవికాదమ్మా" అన్నారు స్వామీజీ.

"మీకెలా తెలుసు?" దామిని.

"నువు చదవాల్సినవని నువ్వెలా అనుకోగలవు?" స్వామీజీ.

"అంతకుముందు నేనొకసారి చదివాను - కాని మీ రెప్పుడూ చదవలేదనుకుంటా" దామిని.

"పోనీ, ఓసారి చదివావుకదా, మళ్లీ చదవాల్సిన అవసరం ఏం వచ్చింది?" స్వామీజీ.

"మీకొక్కవల్సిన ప్రయోజనాలు ఆగలేదుకదా - పోతే నాకే ఏవస్తువు యొక్క ప్రయోజనమూ వుండదనుకుంటూరా?" దామిని.

"నేను సన్యాసినని నీకు తెలుసు." స్వామీజీ.

"నేను సన్యాసం స్వీకరించలేదని మీకూకూడా

తెలుసు. ఈ పుస్తకాలంటే నా కెంతో సరదా. గనుక - ఆ పుస్తకాల్నిలా ఇవ్వండి." అంది దామిని. చిరాకుపడుతూ పుస్తకాల్ని స్వామీజీ నావైపు విసిరారు. నేను తీసుకుని దామిని కిచ్చేశాను.

ఫలితం—

ఇంతకుముందల్లా ఆమె స్వయంగా తన గదిలో కూర్చుని చదువుకునేది; ఇప్పుడు నన్ను పిల్చి చదవమంటుంది. ఆమె వింటుంది. ఒక్కోసారి నేను చదువుతున్నప్పుడు నిర్మల్ వచ్చేవాడు. కూర్చోవాలని అతని కుండేది - కాని కూర్చోమని చెప్పందే!

ఓనాడు నేను చదువుతున్నాను. హాస్యఘట్టం. దామిని కిలకిలా నవ్వుతోంది. ఆవేళ మందిరంలో పూజ సాగుతోంది. నిర్మల్ కూడా అక్కడే వున్నాడని మాకు తెలుసు. కాని, అకస్మాత్తుగా అతను మా దగ్గరకువచ్చి కూర్చున్నాడు — ఆశ్చర్యం !!

దామిని నవ్వాగిపోయింది. నేనుకూడా ఏదో తప్పు చేసినవాడికిమల్లే అదోలా వుండిపోయాను. నిర్మల్ తో ఏదన్నా మాట్లాడా లనుకున్నాను. ఏమీ తోచిందికాదు. గుప్ చుప్ గా పేజీల్ని తిరగవేయసాగాను.

ఎలాగైతే అకస్మాత్తుగా వచ్చాడో, అలాగే వెళ్లిపోయాడుకూడాను. మరి చదవలేకపోయాను. అయినా మాలో 'పర్దా' లేకపోవటాన్ని అత నేవిధంగా భావించుకున్నాడో, లేక ఈర్ష్యపడుతున్నాడో ఏమిటో తెలిసింది కాదు.

నిర్మల్ స్వామీజీ దగ్గరకు వెళ్ళి-"గురుదేవ్! కొన్నాళ్ళ పాటు నేను సముద్రతీరాన ఏకాంతంగా తిరిగివస్తాను. రమా రమి ఓ వారంలోగా తిరిగి వచ్చేస్తాను" అన్నాడు. 'సరే' నన్నాడు స్వామీజీ. నిర్మల్ వెళ్లిపోయాడు.

ఇహాను దామిని నన్ను చదవటానికి పిలవటం మానే సింది, నా అవసరం ఏమీ లేనట్టు. మునుపటిలా ఆడవాళ్ళతో కలిసిమెలిసి వుండటంకూడా నేను చూడలేదు. ఇంట్లోనే వుంటోంది. ఆమె గదితలుపులు ఎప్పుడూమూసేవుంటున్నాయి. కొద్దిరోజులు గడిచాయి. ఓ నాడు మధ్యాహ్నం స్వామీజీ నిద్రబోతున్నారు. నేనేదో ఉత్తరం రాస్తున్నాను. అప్పుడే అకస్మాత్తుగా నిర్మల్ వచ్చాడు. అతడు నన్ను చూడలేదు కూడాను.

తిన్నగా దామిని గదికి వెళ్లి ఆమెను పిల్చాడు. నిర్మల్‌ని చూచి నా కాశ్చర్యం కలిగింది. బాగా నీరసించిపోయాడు. దామిని తలుపుతీసి చూచింది. ఆమెకూడా నీరైపోయింది. "దామినీ, నిన్ను పొమ్మన్నాను. నాదే పొరపాటు. నన్ను క్షమించు" అన్నాడు నిర్మల్. ఆమె సానుభూతిని కనపర్చే స్వరంతో, రెండుచేతులూ జోడించి "ఇదేమిటి ఇలా అంటు న్నారేం?" అంది. "లేదు. నన్ను క్షమించాలి. నేను బాగా ఆలోచించే చెబుతున్నాను. మా స్వార్థంకోసం, నిన్ను వెళ్ళ మనటానికి, వుండమనటానికి మా కేమీ అధికారంలేదు. అలా అనటం నాదే పొరపాటు. కాని-నాదో ప్రార్థన-మాతోపాటు నువుకూడా కలిసివుండాలి. తప్పించుకుని తిరగవద్దు" నిర్మల్.

"సరే ఇహముందు మరేపీ పొరపాట్లు చెయ్యను" అంటూ అతని పాదాలకు నమస్కరించింది. పాదాలమీద చేతులూ-మనసుమీద మనస్సూ !!

*             *             *

## 13

పాషాణం కరిగింది. దామిని తప్పించుకుని తిరగటం లేదు. భజనల్లో పాల్గొనసాగింది. ఇప్పుడామె సర్వాంతర్యామి. ఆమెకు నా అవసరం లేకపోయింది. ఆమె పెంపుడు గ్రద్ద చని పోయింది. ముంగిస ఎక్కడికో పారిపోయింది. కుక్కపిల్ల బాధపడలేక ఎవరికో ఇచ్చేసింది.

ఓ నాటిరాత్రి నేను డైరీ రాస్తున్నాను. అప్పుడే బైట 'దామినీ' అని నిర్మల్ పిల్చిన స్వరం వినిపించింది. దామిని ఆగిపోయింది. నమస్కరిస్తూ ఆమె ఇలా అంది- "నువ్వే నాకు సర్వస్వమూ మరెవరితోనూ నాకుపనిలేదు; వీటన్నిటికన్నా ఉన్నత మైన ఉత్తమమైన మంత్రదీక్ష నివ్వాలి. నన్ను రక్షించాలి."

నేనంతా చూస్తూనేవున్నాను. నిర్మల్ స్తబ్ధుడైపోయాడు. "సరే అలాగే కానియ్" అన్నాడు.

*             *             *

కొన్నాళ్ళకు ప్రజల్లో గుసగుసలు - నిర్మల్ మళ్ళీ తన మతాన్ని మార్చుకున్నాడని పత్రికలు అతన్ని చెడతిట్టాయి. ఓ నాడు తను మహాజోరుగా ఘోషించాడు - తనజాతి

భేదాలు లేవనీ, తను నా స్తికుడననీ. ఈ లోగా నాకు దామినికి పునర్వివాహమైంది. ఈ వివాహ రహస్యం ఎవరికీ బోధపడలేదు. బోధపర్చే అవసరంకూడా లేదు.

*　　　*　　　*

## 14

కొన్నాళ్ల తరవాత దామిని చచ్చిపోయింది. నేను మళ్లీ ఒంటరిగాణ్ణయాను. ఆమెను నేను మరవలేకపోయాను.

నన్ను పెళ్లిచేసుకోమని ఆమెను నేనే ఒప్పించాను. అంతేగాని, ఆమె స్వయంగా నన్ను పెళ్లిచేసుకోమని ప్రస్తావించలేదు. లీలానందస్వామిని నేను వదలగానే సంసార బాధ్యత నా నెత్తిమీదపడ్డది. అంతవరకు ఈసన్యాసులతో కలిసి మస్తుగా తినటం తిరగటమే నా పనిగా వుండేది ఇప్పుడో - సంసారం చక్కబెట్టుకోవాలి. తలదాచుకోటానికి పంచకావాలి. ఇంకా. ఎన్నో—

నిర్మల్‌కి ప్రకాశ్ బాబు వీలునామాలో రాసిచ్చిన ఇల్లు జ్ఞప్తికి వచ్చింది. అది నిర్మల్ చేతిలోనే వుంటే ఈపాటికి 'భావ ప్రవాహం'లోనూ రసతరంగాల్లోనూ ఎప్పుడో మునిగిపోయి వుండేది. గాని, వీలునామా నా చేతిలోవుంది. నేనే దానికి 'ఎగ్జిక్యూటివ్'ని - అందులో కొన్ని షరతులున్నయ్. వాట్ని సమానంగా పాటించాలి. ఇదంతా చూచేభారం నామీదనే వుంది.

ముఖ్యమైన షరతులు మూడు :—

(1) ఇంట్లో ఎప్పుడూ పూజా పునస్కారాలు జరగ కూడదు.

(2) ఆ వీధిలోనున్న తురకపిల్లల్నీ, మాలపిల్లల్నీ, ఇంకా తదితర నిమ్నజాతులవాళ్ల పిల్లల్నీ పిల్చి ఓ పాఠశాల స్థాపించి వాళ్లకు చదువుచెప్పాలి.

(3) నిర్మల్ చనిపోయిన తరవాత సదరు విల్లు పై నుదహరించిన వాళ్లకోసం, అంటే వాళ్ల శిక్షణకోసం, వాళ్ల చదువులకోసం, వాళ్ల ఔన్నత్యంకోసం దానం చెయ్యాలి.

"కలకత్తాలోనున్న ఆ ఇంటికే తిరిగి వెళ్లిపోదాం పద" అన్నాను నేను నిర్మల్‌తో.

"అక్కడికి వెళ్లటానికి నేనింకా తయారుగా లేను" అన్నాడు నిర్మల్. అతను చెప్పింది నాకర్థం కాలేదు. మళ్లీ నిర్మల్ అన్నాడు-"మీరిద్దరూ వెళ్లండి. నేను కొన్నాళ్లపాటు ఒంటరిగా తిరగదల్చుకున్నాను."

"సరే. ఇప్పుడే కలకత్తా వెళ్లనవసరం లేదులే. నదీ తీరాన వున్న ఈ పాడుపడిన బంగళాలో కొన్నాళ్లుందాం. అందులో దయ్యాలుంటాయని విసకిడి. మనంకూడా దయ్యా ల్లాగే వుందాం" అన్నాను నేను.

నిర్మల్ మళ్లీ యథాప్రకారంగా ఉద్దేశరహితంగా తిరగ నారంభించాడు; వేళకు తిండీ నిద్రాకూడా లేదు. మనిషి చాలా నీరసించిపోయాడు. అతన్ని దారికి తీసుకురావాలని దామిని చాలామట్టుకు ప్రయత్నించింది. ఓనాడు నదిదాటి అవతలి

వద్దు వెళ్లాడు నిర్మల్. మధ్యాహ్నమైపోయినా భోజనానికి రాలేదు. మెల్లిగా సూర్యభగవానుడు పశ్చిమదిశకు ప్రయాణం సాగిస్తున్నాడు. కాని, నిర్మల్ జాడలేదు. దామినికూడా భోంచెయ్యలేదు.

ఆఖరికి భోజనం పళ్లెంలో మూటకట్టి దామిని కూడా నదిదాటి అవతలివైపుకు చేరుకుంది. నిర్మల్‌కోసం వెతగ్గా వెతగ్గా, అతనొక చెట్టుకింద కూర్చునివుంటం చూచింది. ఆమెను చూడగానే, "నువ్విక్కడికి ఎందుకు వచ్చావ్ ?" అన్నాడు నిర్మల్. "చాలా ఆలస్యమైందని భోజనం తీసుకు వచ్చాను" అన్నదామె. "నేను భోంచెయ్యను" అన్నాడు. "ఇప్పుడు కాకపోతే కాస్సేపుండేచెయ్యి" అందామె. "అబ్బబ్బా ! నన్నెందుకు అల్లరి........." వాక్యం పూర్తి కాకుండానే ఆమెకేసి చూశాడు. ఆమె ఏదమైన జవాబూ ఇవ్వకుండా భోజనం పట్టుకుని ఇంటికి తిరిగి వచ్చేసింది. వరండాలో కూర్చుని ఏడ్చింది. నన్ను చూడగానే ఆమె మరీ జోరుగా ఏడ్చింది. ఆమెను చూడగానే నాకదోలా అనిపించింది. ఏమీ తోచక నేనూ చలికిలపడిపోయాను.

ఆమె కాస్త తేరుకోగానే నేనడిగాను – "నిర్మల్ విషయమై నీకంత పట్టుదల ఎందుకు ? మనస్సు ఏదన్నా ఒక విషయంలో కేంద్రీకరించినప్పుడు, వాటంతటవే అన్ని ప్రయోజనాలు లోపించిపోతాయి కూడాను. ఒక్కోసారి అవసరం లేకుండా పోయాయి. అందుకనే మనిషికి–అత్యంత దుఃఖంలో నన్నా లేక అత్యధికమైన ఆనందంలోనన్నా ఆకలిదప్పు

లుండవు. ఇప్పుడు నిర్మల్ స్థితి ఎలా వుందంటే, నువ్వతని సంరక్షణ విషయమై అశ్రద్ధచూపించినా, వాడికివచ్చిన నష్ట మేమీలేదు.

"ఇంతవరకూ నేనెత్తింది ఆడజన్మ. ఎవరన్నా కష్టపడు తుంటే సహజంగా ఆడవాళ్లు చూడలేరు. మా మనస్సు ద్రవించిపోతుంది" అందామె. నేనువూరుకున్నాను.

*　　　*　　　*

# 15

ఆ వేళ నదీతీరాన దామిని మనస్సుని నిర్మల్ చాలా కష్టపెట్టాడు. ఫలితం – ఆమె చూసిన చూపుని ఇంతవరకూ అతను మరవలేకపోయాడు. తరవాత దామినిపట్ల కొన్నాళ్ళ వరకు ఎంతో అన్యోన్యంగా ప్రవర్తించసాగాడు. ఈ విధంగా తన ప్రాయశ్చిత్తవ్రతాన్ని పూర్తిచేశాడు.

నిర్మల్ ఉదాసీనతకు దామిని భయపడేదికాదు. అత నిప్పుడు సఖ్యంగా వున్నాడు కాబట్టి మరీ భయపడసాగింది.

అతని ఈ ప్రవర్తనకు తనెంతో అధికమైన మూల్యా మిచ్చుకోవాలి. నిర్మల్ ఇప్పుడు చాలా మంచివాడైపోయాడు. ఆ సంగతి తల్చుకోగానే ఆమెకు భయంవేసేది–

ఎప్పుడన్నా ఖర్చులమీద నిర్మల్‌గాని ఒక్కసారి దృష్టి సారించాడంటే ఆ వేళ పెద్దగొడవవుతుందన్నమాట. తనలో అనుకునేది – గొణుక్కునివూరుకునేది.

"ఆవేళ నన్ను నీనుండి దూరంచేశావు. మంచిపనే చేశావు. కాని, ఇప్పటి నీ ప్రవర్తనచూస్తే నిన్ను నువ్వే దండించుకుంటున్నావల్లే వుంది. దీన్ని నేనెలా సహించను? సరే, ఇప్పుడవంతా ఎందుకు? లీలానందస్వామి దగ్గరున్నప్పుడు నా ప్రవర్తన ఎలా వుండేదో అలాగే ఇప్పుడుకూడా కాస్త బెట్టు చూపిస్తే సరి-అంతా మామూలుగానే వుంటుంది. ఇదే ఉపాయం."

ఓనాడు రాత్రి రెండుమూడు గంటలకు నిర్మల్ పిలుపు వినిపించింది. "విశ్రీ — దామినీ!" వాడికి సమయా సమయాల్తో నిమిత్తంలేదు. రాత్రప్పుడు వాడేం చేస్తుంటాడో ఏవిటో తెలీదు. గాని, అతని ఉత్పాతంవల్ల ఈ దయ్యాల కొంపలోని దయ్యాలక్కూడా అతనంటే భయంగా వుండేదేమో!

మేమిద్దరం లేచి చూచేసరికి, ఎదురుగుండా వున్న వేప చెట్టుక్రింద నిర్మల్ నిలబడివున్నాడు. మమ్మల్ని చూడగానే అన్నాడు-"నేను బాగా బోధపర్చుకున్నా నచ్చాయ్! నాకేవీఁ సందేహంలేదు" అంటూ ఆ చీకట్లో నదీతీరానికి దారితీశాడు.

ఆ మరసటిరోజు పెద్దగాలివాన వచ్చింది. మేంముగ్గురం వేరువేరు గదుల్లో పడుకుంటాం. వరండాలో ఓ దీపంబుడ్డి వెలుగుతూంది. గాలివిసురు కది ఆరిపోయింది. నదీతరంగాల్లో అల్లకల్లోలం. బయట గాలి బుఁయ్ మంటోంది. నాకునిద్ర రావటంలేదు.

పక్కమీద దొర్లుతూ ఏవేవో ఆలోచిస్తున్నాను.

ఆలోచనలకు అంతేలేదు. అవన్నీ ఇక్కడ రాయటం అనవసరం. అప్పుడే నిర్మల్ తనగదిలోంచి కేకవేశాడు. "ఎవనది?" జవాబు వినిపించింది– "నేను దామినిని, నీ గదికిటికీలు తెరిచి వున్నయ్. ఈదురుగాలి మహాజోరుగా వుంది. వర్షపుచినుకులు గదిలోకే పడుతున్నాయని, కిటికీ తలుపులు మూయటానికి వచ్చాను."

కిటికీతలుపులు మూస్తూ దామిని చూచింది. నిర్మల్, పక్కవదిలి గదినుండి బయ్టన బయటికి దారితీశాడు. ఒక్క మెరుపు మెరిసింది– బయట పిడుగులు, దామిని తనగదికి వెళ్ళి పోయింది. వర్షం ఆగేసూచనకనపడలేదు. పైపెచ్చు ఇంకా జోరుగావుంది. కాని, నిర్మల్ ఇంటికి తిరిగిరాలేదు.

ఆమె సహించలేకపోయింది. ఆమెకూడా నదీ తీరానికి బయలుదేరింది. మనుష్యుల్నితోసేస్తున్నట్టుగావుంది గాలి. వర్షం వంటిమీద పడుతూంటే, బెత్తందెబ్బలు పడుతున్నట్టుగావుంది. ఇంతలో మెరిసింది. ఆ వెలుగులో చూచింది – నర్మల్ నదీ తీరంలో ఒంటరిగా నిల్చున్నాడు. గబగబా పరుగెత్తి నిర్మల్‌ని చేరుకుంది. అతని పాదాల్ని పట్టుకుని గట్టిగా అరిచింది—

"నీపాదాలసాక్షిగా చెబుతున్నా. నేనేమీ అపరాధం చెయ్యలేదు. మరి, నన్నీవిధంగా ఎందుకు శిక్షిస్తున్నావ్?" నిర్మల్ జవాబివ్వలేదు. "నన్ను చంపి ఈ నదిలో పారెయ్య దల్చుకుంటే అలాచెయ్యి. లేకపోతే ఇంటికి పద" అన్నదామె ఏడుస్తూ. నిర్మల్ ఇంటికి తిరిగివచ్చేశాడు. గదిలోకి రాగానే అన్నాడు—

"నే నెవర్ని వెదుకుతున్నానో, వాళ్ళ అవసరం నాకు చాలావుంది. నాకు మరేమీ అవసరంలేదు దామినీ! నన్ను కనికరించు. నన్నువదిలి వెళ్లిపో."

దామిని కాస్సేపు నిశ్శబ్దంగా వుంది. తరవాత నిశ్శబ్దాన్ని భంగంచేస్తూ "సరే నేను వెళ్లిపోతాను" అంది.

* * *

## 16

తరవాత, దామిని వివరాల్తో జరిగిందంతా చెప్పింది. వాళ్ళిద్దరూ తమతమ గదుల్లోకి వెళ్ళిపోయారు. నా బుర్రలో ఎన్నో ఆలోచనలు - ఎవరో నా కళ్ళల్లో వ్రేలుతో పొడుస్తున్నట్టనిపించింది. ఆ రాత్రంతా నాకు నిద్రపట్టలేదు.

మరుసటిరోజు దామిని మొహం చూచాక, నిర్మల్ మీద నాకు మహా చెడ్డకోపం వచ్చింది. నాతో దామిని - "నన్ను కలకత్తాలో దిగబెట్టండి" అంది. ఈ విధంగా ఆమె వెళ్ళటంలో ఆమెకెంత కష్టంగావుందో నాకు బాగా తెలుసు.

నేను మరేమీ ప్రశ్నించలేదు. అపారమైన వేదనలో కూడా నాకు కాస్తవిశ్రాంతి దొరికినట్టనిపించింది. ఇక్కడినుండి దామిని ప్రస్థానమే శ్రేయస్కర మనుకున్నాను. వెళ్ళిపోయేప్పుడు నిర్మల్ పాదాలకు నమస్కరిస్తూ దామిని అంది - "శ్రీచరణాల్లో ఎన్నో తప్పులు చేశాను. క్షమించాలి." ఎదుటనున్న వేపచెట్టునిచూస్తూ-"నేను చేసిన తప్పులుకూడా చాలా

వున్నాయ్. వాటిని పరిష్కారం చేసుకుని మరీ క్షమించమని కోరుకుంటూను" అన్నాడు నిర్మల్.

దామిని హృదయంలో ప్రళయాగ్ని మండిపోతోందని కలకత్తా వెళ్లేదార్లో నేను బాగా గ్రహించాను. కలకత్తా చేరుకున్నాక ఆమెపినతల్లి ంట్లో ఆమెను దిగబెట్టాను. నేను పూర్వ పరిచితమైన ఒక 'మెస్'లో బసచేశాను. నన్ను చూడగానే నా పరిచితులు "ఇదేమిటోయ్ శ్రీవిలాస్, ఈమధ్యను జబ్బు పడ్డావేంటి?" అనడిగారు.

రెండురోజుల తరవాత దామిని రాసిన ఉత్తరం అందుకున్నాను. "నన్ను తీసుకుపొండి. ఇక్కడ నాకు స్థానంలేదు" అని రాసింది. ఈలోగా ఆమె తలిదండ్రులు పరమపదించారు. అన్నదమ్ము లున్నారనే సంగతి తెలుసు. వాళ్లెక్కడున్నారో చెప్పమన్నాను. "వద్దు, అక్కడికి వెళ్ళొద్దు. వాళ్ళు చాలా పేదవాళ్ళు" అంది. అసలు సంగతేమిటంటే, అక్కడ కూడా ఆమెకు స్థానం లేదేమోనని ఆమె అనుమానం.

"అయితే మరెక్కడికి వెడతావ్?" అన్నాను.

"లీలానందస్వామి దగ్గరకు" అందామె. "స్వామీజీ నిన్ను రానిస్తాడా?" అన్నాను సందేహిస్తూ. "సంతోషంతో" అందామె. మనుషుల్ని బాగా పోల్చగలదు దామిని. స్వామీజీ ఆమె నాదరిస్తారు గాని—

నే నన్నాను. "ఒక ఉపాయముంది దామినీ, నువ్వు అంగీకరిస్తానంటే......" వాక్యం పూర్తిచెయ్యకుండా సణిగాను.

"సరే చెప్పండి" అందామె.

"నాలాంటివాణ్ణి పెళ్ళిచేసుకుంటే....."

"మీకు పిచ్చెత్తిందేమిటి ?"

"అలాగే అనుకో."

"పెళ్ళిచేసుకుంటే మీ పరిస్థితులో ?"

"అవి మారిపోతాయి. నేను మనిషినవుతాననే నమ్మకముంది."

ఆఖరికి, ఓ స్నేహితునిల్లు ఖాళీగావుంటే అక్కడికి చేరుకున్నాం. చైత్రమాసంలో ఓ శుభముహూర్తాన మా వివాహం నిశ్చయమైంది. "నిర్మల్‌ని తప్పకుండా తేవాలి"అంది దామిని.

"అయితే నువ్వు స్వయంగా వెళ్ళి పిలవాలి"

"నే నక్కడికి మరెప్పుడూ వెళ్ళనని ప్రతిజ్ఞ చేశాను."

"అవును. కాని భోజనం తీసుకుని వెళ్లావుగా."

మేమిద్దరం నిర్మల్‌ని కలకత్తాకు తీసుకువచ్చాం. మా వివాహం వార్త వినగానే, నిర్మల్ సంతోషంతో ఒక్కగెంతు గెంతి రెండుపల్టీలు కొట్టినంత పనిచేశాడు. గుప్‌చుప్‌గా పెళ్ళి జరిగిపోవాలనుకున్నాను. కాని వీధిలోవాళ్లు మహాఅట్టహాసం చేశారు. దినపత్రికలు బాగా పొగిడాయి.

"విశ్రీ, నువు నా ఇంట్లోవుండు. దాన్ని నీకిచ్చేస్తున్నాను" అన్నాడు నిర్మల్.

"నువ్వుకూడా మాతోవచ్చేస్తే మళ్లీ మన పాతపని ప్రారంభిద్దాం" అన్నాను.

"లేదు. నాకు మరోదగ్గర పనుంది;" అన్నాడు నిర్మల్.

ఇల్లయితే నిర్మల్ ఇచ్చాడుగాని, అందులో వుంటం ఎంతకష్టమో తనకు తెలిసిందికాదు. ఇల్లు ఖాళీగా వుంటం చూసి, హరిమోహన్ ఎవరికో అద్దెకిచ్చేశాడు. తనేస్వయంగా ఉపయోగించాలనుకున్నాడు. కాని, చచ్చింతరవాత పర లోకంలో యమయాతన లనుభవించాల్సి వస్తుందేమోనని భయపడ్డాడు.

ఆ ఇల్లు హరిమోహన్ చేతులనుండి, ఎలా బయటికి వచ్చిందో రాయాలంటే బోలెడవుతుంది. ఇంతవరకూ నా ఖర్చుకోసం ఇంటినుండి డబ్బువస్తుండేది. అది ఆగిపోయింది. మా సంసారం గడవటం కష్టమైపోయింది. నా డిగ్రీలసహాయం వల్ల 'ప్రొఫెసర్'నయాను. కొన్ని స్కూలుపుస్తకాలు, నోట్సులు కూడా రాశాను. దానివల్ల కొంతడబ్బు రాబడివుంది.

"నిర్మల్ ఏవిధంగానూ కష్టపడకుండా చూడటం మన విధి" అంది దామిని. ఈలోగా నేనొక ఇంగ్లీషు దినపత్రికకు సహాయ సంపాదకుడుగా చేరాను. మా సంసారం సాఫీగా నడుస్తోంది.

ఒకఫాల్గుణం గడిచింది. కాని – మరోఫాల్గుణం గడవ లేకపోయింది. సముద్రతీరంనుండి తిరిగివచ్చినప్పటినుండి దామి నికి గుండెల్లోనొప్పి బయల్దేరింది. కాని, ఇంతవరకు ఎవరితోనూ చెప్పలేదు. ఇప్పుడాబాధ ఎక్కువయింది. ఆమె మంచంతో దోస్తీచేసింది. డాక్టర్లు పరీక్షించి – "ఎకోజనా ఎకోర్ట్యాక్" అన్నారు. ఆమెజబ్బులో నా కున్నదంతా 'స్వాహా' అయి పోయింది. ఆమె బ్రతికేసూచనలు కనిపించలేదు.

"నే నెక్కడినుండైతే ఈ బాధను మోసుకువచ్చానో, ఆ సముద్రతీరానికే నన్ను తీసుకువెళ్ళండి. అక్కడ గాలికి కరువులేదు," అంది దామిని క్షీణస్వరంతో. ఆమెకోరిక నెరవేర్చాను.

ఆఖరుసారి నా పాదాలకు నమస్కరిస్తూ అంది—

"నా సాధన పూర్తికాలేదు. వచ్చేజన్మలో నన్నా మిమ్మల్ని పొందగలిగితే పూర్తవుతుందేమో! ఇదే నా అంతిమ వాంఛ."

"జారిందొక నక్షత్రం
నీరవమై నిర్మలమై"

# శిథిల హృదయాలు

డబ్బున్నవాళ్ళకు ఏ విధమైన నౌఖరీ చేయాల్సిన అవసరం వుండదేమో! భూపతికి బోలెడు డబ్బుంది. ఫలితంగా, అతనికి నౌఖరీ చెయ్యాల్సిన అవసరం లేకపోయింది. అయితే, ఇంట్లో పూరక కూర్చోడానికి కిష్టంలేక, కాలక్షేపానికని ఒక ఇంగ్లీషు దినపత్రిక నడపసాగాడు. దానివల్ల భూపతికి బాగా వ్రాసుపోతుంది. మరి కాలం ఎలా గడుస్తుంది, అనే సమస్య అతనికి లేదు.

చిన్నప్పటినుండీ, ఇంగ్లీషుచదవడం, రాయడం, లెక్చర్లివ్వడం అంటే భూపతికి చాలా సరదా. ఏమీ ప్రయోజనం లేకపోయినా, ఇంగ్లీషు దినపత్రికలకి కొన్నాళ్లు "విలేఖరిగిరీ" వెలిగించాడు. అప్పుడప్పుడు సభల్లోకూడా అవసరం లేకపోయినా మధ్యనులేచి, రెండు ఇంగ్లీషు ముక్కలు విసిరేవాడు.

భూపతి ధనికుడు గాబట్టి కొంతమంది "లీడర్లు"కూడా, అతన్ని తమ "పార్టీ"లో కలుపుకోవాలని అతన్ని ప్రశంసిస్తూ ప్రయత్నించారు. ఈ కారణంచేత, తనకి ఆంగ్ల భాషలో బాగా ప్రవేశముందనీ, ఇంకా అధికారంకూడా వుందనే నిశ్చయానికి వచ్చాడు. దీన్నే "ఆత్మగర్వం" అంటారు గాబోలు!

భూపతి కోవమరది, ఉమాపదబాబు కొన్నాళ్లు "వకాల్తా" వెలిగించాడు. తన ప్రాక్టీసు సరిగా సాగనందు వల్ల, ఓ సారి భూపతితో ఇలా అన్నాడు. "బావా, నువ్వొక ఆంగ్ల దినపత్రిక నడపకూడదటోయ్! నీలాంటి అసాధారణ ప్రజ్ఞాధురంధరులు..."

భూపతికి హుషారు కలిగింది. పరాయి పత్రికల్లో తమరచనలు సాగిస్తే తనకి గౌరవమేది, అనేభావం కలిగింది. సొంతపత్రికవుంటే ఇష్టానుసారంగా 'కలంపోటు' చూపించ వచ్చు. వెంటనే కార్యరంగంలోకి దిగాడు. దినపత్రిక ఆరంభిం చాడు. ఉమాపదుని సహాయ సంపాదకునిగా నియ మించి, తను సంపాదకుని స్థాన మలంకరించాడు. సంపాదకీయ, రాజకీయాలనిషా, అల్పవయస్కుల్లోనే వుంటాయని కొంత మంది అంటారు. అతని ఉత్సాహానికితోడు, అతన్ని ఉత్సాహ పర్చేవాళ్లుకూడా చాలామంది వున్నారు.

భూపతిభార్య, "చారులత"కి యింట్లో ఏమీ ఊసు పోయేదికాదు. ఆమెకు ఆ ఇంట్లో ఏ విధమైన లోటు వుండేది కాదు. పనిపాట్లు ఏమీవుండేదికాదు. మరి ఆమె ధనికునిభార్య కదూ!

భూపతి ఎక్కువసమయం, పత్రికా కార్యాయంలోనే గడిపేవాడు. భార్యతో కాస్సేపు హాయిగా కాలంగడుపుదా మనే భావమే లేదతనికి. భర్తను తనవైపాకర్షించాలని ఎంతో ప్రయత్నించేది చారు. గాని, అతనిమీద అధికారం చేయలేక పోయింది.

భార్యనెప్పుడూ కన్నెత్తిచూడడని, ఎల్లప్పుడూ పత్రిక లోనే లీనమైపోతాడనీ, భూపతిదగ్గర బంధువురాలోకర్తె, భూపతిని ఎత్తిపొడిచింది. అయితే చారుకి, ఒక స్నేహితు రాలు అవసరమనేసంగతి భూపతికి అప్పుడు తట్టింది. ఫలితంగా, ఉమాపదునిభార్య "మందాకిని"ని తనింటికి పిల్చుకు వచ్చాడు. దాంతో, తన నెత్తిమీదభారం ఒకటి దిగిపోయిందని భావించి, ఆనందించాడు.

చారుకి ఇంట్లో ఎక్కువ పనివుండేదికాదు. ఏదో పుస్తకం చదవడంలో లీనమై సమయం గడిపేది. తన చదువుకోసం సరంజామా, తనే స్వయంగా చేసుకుంది. భూపతి పినతండ్రి కొడుకు అమల్ బి. ఎ., చదువుతున్నాడు. వాణ్ణి ఇంటికి పిలిపించుకున్నారు. అమల్, చారుకి చదువు చెప్ప నారంభిం చాడు. అమల్ ఏది కోరినా, చారు లేదనేదికాదు. అమల్‌కి హోటలుఖర్చు, (అంటే చిరుతిళ్లకోసం) ఆంగ్ల సాహిత్య గ్రంధాలకోసం, ఎంతడబ్బుకావాలంటే, అంత ఇచ్చేది. అమల్ అప్పుడప్పుడు తన స్నేహితుల్నికూడా ఇంటికి తీసుకువచ్చి 'పార్టీ' నిచ్చేవాడు. ఆ ఖర్చుకూడా చారులతే భరించేది. భూపతి, ఫలానాదికావాలని, చారుని ఎప్పుడూ కోరలేదు. కాని, అమల్‌మాత్రం, ఎప్పటికప్పుడు ఏదోఒకటి, పురమాయించేవాడు.

ఓనాడు అమల్ అన్నాడుకదా—"వదినా, మా కాలేజీలో ఒక రాజాసాహెబుగారి అల్లుడు చదువుతున్నాడు. అతను స్వయంగా రాజకుమారి, అంటే అతనిభార్య తయారు

చేసిన ముఖమల్ జోళ్లు వేసుకుని వస్తూంటాడు. దానిమీద ఎంతో చక్కని పూలున్నాయి. దాంతో వాడికెంత గర్వమనుకున్నావ్. వాడి డాబుచూస్తే, నాకు ఈర్ష్యగా వుందివదినా. నాకూ-డా అలాంటి ముఖమల్ జోడుకావాలి. దానిమీద పూలుండాలి. అదినువ్వే తయారుచెయ్యాలి వదినా! లేకపోతే, నేను వాడెదుట తలెత్తుకుని తిరగలేను. వాడు నన్ను ఎగతాళి చేశాడుకూడా! 'ఇంత డబ్బుగలవాడివి కదా, ఇలాంటిజోడు నీదగ్గరలేక పోయిందికదా!' " అని.

చారు, లేనికోపం తెచ్చుకుని అంది— "అవును, బాగానేవుంది. నువు వూరిమీద తిరగడానికి నేను జోళ్లు కుట్టివ్వాలా? డబ్బిస్తాను. బజారువెళ్లి కొనుక్కో-" 'అలా నాకవసరంలేదు వదినా, నువ్వే తయారుచెయ్యాలి.' అని మారాం చేశాడు చిన్నపిల్లాడికిమల్లే. ఏమిటో ఈ జబర్దస్తీ!

అలాంటి జోళ్లు తయారుచెయ్యడం చారుకేం తెలుసు? గాని, అమల్ కోరిక తీర్చాలనిమాత్రం ఆమెకు మనసారా వుంది. ఎల్లప్పుడూ చిన్నపిల్లాడిలా ప్రవర్తిస్తాడు గాబట్టి అమల్ అంటే చారుకి అదోవిధమైన అభిమానమూ, ప్రేమ భావమున్నూ. అమల్ కాలేజీకి వెళ్ళేసమయంలో, ముఖమల్ మీద పూలుఅల్లడం వగైరాలు అతికష్టంమీద నేర్పుతో సాగింది. ఈ విధంగా కొన్నిరోజులు గడచిపోయాయి. అమల్ జోళ్ళ సంగతి పూర్తిగా మర్చిపోయాడు.

ఓనాటి సాయంత్రం, అమల్‌ని భోజనానికి లేవమంది చారు. వేసవికాలం డాబామీదికి భోజనానికి తీసుకువెళ్లింది.

అమల్ కాలేజీనుండివచ్చి, కాళ్లు-చేతులు కడుక్కొని భోజనానికి, డాబామీదికి వెళ్లాడు. ఈ లోగా ధూళి వర్షం పడు తుందేమోనని పళ్ళెంమీద ఇంకో పెద్దగిన్నె మూత వేసింది చారు. పీటమీద కూర్చుని, పళ్ళెంమీద మూతతియ్యగానే, అమల్‌కి ఓ జత ముఖమల్ జోళ్లు కనిపించింది. ఓ నిముషం సేపు అమల్ ఆశ్చర్యచకితుడయ్యాడు. చారు 'ఫకాలు'న పెద్ద నవ్వు నవ్వింది. అమల్ కూడా అందులో భాగం తీసుకున్నాడు.

జోళ్లు దొరకగానే చారుకి అమల్ "ఫరమాయిష్"లు (పురమాయింపులు) ఎక్కువయాయి. 'ఫూలుమఫ్లర్'కావాలి. రుమాలుమీద చక్కని పూలుకావాలి. అమల్ గదిలో కూర్చునే కుర్చీదిండుకి మంచిగలేబా, దానిమీద చక్కనిఅల్లికలు! ప్రతీ ఫరమాయిష్‌కి చారు చిరాకుగా, కోపంగానటిస్తుంది. కాని, అన్నీ చేసి పెట్టేది. మధ్యన అమల్ అడిగేవాడు. 'ఎంత వరకయింది వదినా?' గమ్మత్తుగా జవాబిస్తుంది చారు. 'ఏమీ లేదు - నే నారంభించలేదు. అసలు, నువ్వు చెప్పినట్టు నాకు జ్ఞాపకము లేదు' అమలుకి తెలీకుండా అతని 'ఆర్డర్సు' పూర్తి చేస్తూ హఠాత్తుగా ఓ నాడు అవి చూపిస్తుంది. వారిద్దరూ నవ్వుకుంటారు. ఇలాగే రోజులు దొర్లుతున్నందున అవతల చారు, అమలు తాలుకు పనులన్నీ చేసిపెడుతూ తనచదువు కూడా సాగిస్తుంది.

భూపతిబాబు బంగళా ఆవరణలో ఒకవైపు ఖాళీగాపడివుంది. ఓ నాడు ఆ ప్రదేశాన్ని ఏవిధంగా ఉపయోగించాలా అనేచర్చ వీళ్లిద్దరూ సాగించారు. 'కమిటీ'కూర్చుంది.

(ఆ కమిటీలో ఇద్దరే వున్నారు లెండి) కొన్నాళ్ళవరకు ఇద్దరూ తీరికగా కూర్చుని, 'డ్రాయింగ్సు' వేసి చాలా ఉత్సాహంతో ఆ ప్రదేశాన్ని చక్కని 'ఉద్యానవనం'లాగ తయారుచెయ్యాలని 'ప్లాను' వేశారు.

'వదినా, ఈ ఉద్యానవనంలో, పూర్వకాలంలో రాజకన్యల్లా నువ్వే స్వయంగా, చెట్లకి నీళ్లుపొయ్యాలి' అన్నాడు అమలురాజకుమారునిపోజులో.'ఈపడమటివైపు ఓ చిన్న కుటీరం నిర్మించాలి. అందులో ఓ చిన్న చెరువు, అంటే సరస్సులాంటిది కూడా తవ్వించాలి. అందులో రాజహంసలు ఈదుతూవుండాలి. ఆ సరస్సులో కమలపూలు వేయించాలి. చాలారోజుల నుండీ, ఈ కోరిక నా మనస్సులో వుంది. సరస్సుమీద ఓచిన్న వంతెనకూడా వుండాలి' అంది.

ఒడ్డున ఒకచిన్న నావకూడా అత్యవసరం. అవును, ఓ ఘాట్ కట్టించాలి. దానిమెట్లు తప్పకుండా చలవరాతివై వుండాలి. పెన్సిలుతో గీతలుగీస్తూ, మహాడంబరంతో ఓ పెద్ద మేపు గీశాడు. రోజూ ఇలాగే గొంతెమ్మ కోరికలు కోరుతూ చాలాసేపువరకు, బాతాఖానీలో సమయం గడిచిపోయేది. రమారమి ఓ పాతిక మేపులు గీసేశారు. ఆఖరికి ఓనాడు సరైనడ్రాయింగు తయారైంది. తోట తయారవడానికి ఎంత ఖర్చు అవుతుందో, అంచనా వేయసాగారు. ప్రతినెలా తన సొంత ఖర్చులకోసం ఇస్తున్న డబ్బుతో తోటపని ఆరంభిస్తే బాగుంటుందేమోనని చారు అంది. అలాగే మెల్లిగా తోట తయారవుతుంది. అసలు వీళ్లు తోట తయారుచేస్తున్నట్లుగా, భూపతి

బ్బాబుకి తెలీదుగా! అతనెప్పుడూ ఇటువంటి విషయాల్లో జోక్యం కలుగజేసుకోడు. అసలు కన్నెత్తి చూడనైనా చూడడు. అతని కెప్పుడూ, పత్రిక గొడవే. తోట తయారైన తరవాత అతనికి అంటే భూపతికి! గార్డెన్‌పార్టీకి ఆహ్వానించాలి. అప్పుడతను ఎంతగా ఆశ్చర్యపోతాడో! శభాస్...వహ్వా... బలేమజాగా వుంటుంది. ఏం! బాగుందికదూ ఈ ప్లాన్? ఇద్దరూ ఏకగ్రీవంగా గొల్లుమని నవ్వేశారు. ఎంత తక్కువ ఖర్చులో తోట తయారుచేద్దామన్నా చారుకి దొరికిన డబ్బుతో తయారుకావడం అసంభవంగా తోచింది ఇద్దరికీ. మళ్ళీ పెన్సిలు కపాలానికి కొట్టుకుంటూ, ఆలోచించసాగారు.

'డ్రాయింగు' మార్చాలంటాడు అమల్. 'వదినా, సరస్సు తీసేద్దాం.' 'దాన్ని తీయడానికి వీల్లేదు. అందులో కమలపూలుంటాయి. అది లేకపోతే, నాకీ తోటే అవసరం లేదు. అయితే ఈ లేడి కుటీరం తీసేద్దాం. అది లేకపోయినా మనకేం నష్టంలేదు.'

"నాకంతకన్నా అవసరంలేదు నాకేమీ వద్దు" కోపం తెచ్చుకుంది చారు. 'మారిషస్' నుండి లవంగాలు, కర్ణాటక దేశంనుండి చందనం, 'సింహాళం'నుండి దాల్చినీ, ఇవంతా తోటలో వేయాలి. ఇవంతా వదిలి, 'మానిక్‌తల్లాస్ట్రీట్' నుండి ఏవో కొన్ని మొక్కలు వేయాలంటాడు అమలు. 'ఇదిగో ఇలాంటి చెత్తతోట నాకవసరం లేదబ్బాయ్,' అంది చారు. కోపం తెచ్చుకుని మరలాగయితే అన్నయ్యతో ఈ ప్రసంగం కదిపితేసరి అతను తప్పకుండా డబ్బిస్తాడు.

'ఆహాఁ! అవసరంలేదు. అతనితో చెబితే మరి మజా ఏదీ? మనిద్దరమే తోట తయారుచేయాలి. అతనితో ఈ సంగతి చెబితే ఏదో ఇంగ్లీషు కంపెనీకి ఆర్డరిచ్చి రెండో ఈడెన్‌గార్డెన్ తయారుచేయించేస్తారు. అలాంటప్పుడు మన ప్లాన్ ఏమయినట్టు?' మామిడిచెట్టుక్రింద కూర్చుని మళ్ళీ బుఱ్ఱల్ని వేడెక్కించసాగారు. ఇంతలోనే మందాకిని కేక వేసింది. "ఏమర్రా, మీరక్కడ కూర్చుని ఏం చేస్తున్నారు?" "మామిడికాయల్ని వేటాడుతున్నాం." అని జవాబిచ్చిందిచారు. మామిడికాయ లనగానే మందాకినికి నోరూరింది. 'మరి నాకేమన్నా దొరుకుతుందా?' దాంతో ఇద్దరికీ నవ్వొచ్చింది. ఏంచేసినా వీళ్లిద్దరే చేసేవారు. పాపం! "మందాకిని"ని వీళ్లు తమ "కమిటీ"లో చేరనిచ్చేవారుకారు. వీళ్లు చేస్తున్న తతంగాలన్నీ "మందాకిని" కసలు తెలీనే తెలీదు. తనకు తగ్గ ఆలోచనలుగావు కాబట్టి, వీళ్ళప్రయత్నాలు పూర్తి కాలేక పోతున్నాయ్. రోజూ, ఇలాగే కాలం గడిచిపోయేది. తోటలో సరస్సు ఎక్కడ తయారుచేయాలో, లేడికుటీరం ఎక్కడుండాలో చలువరాతి "ఘాట్" ఎక్కడవుంటుందో, ఆ ఆ స్థానాల్లో అమల్ చాకుతో నిశానీలు వుంచేశాడు.

*  *  *

భావితోటకి చలువరాతి "ఘాట్" ఎక్కడ తయారవాలో, ఆ ప్రదేశాలలో పారపట్టుకుని అమల్ త్రవ్వ నారంభించాడు. "ఘాట్"కి సరిపడేంత "లైను" త్రవ్వాడు. చారు, మామిడిచెట్టుకింద కూర్చుని, అంతా చూస్తుంది. ఏదో ఆలో

చిస్తూ ఇద్దరూ మౌనంగా నేవున్నారు. మౌనాన్ని భంగంచేస్తూ చారు అంది. "అమల్! నువు కథారచయితవైతే ఎంత బాగుణ్ణు." "ఎందుకు" త్రవ్వడం ఆపుతూ, అమలు ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

"నువు రచయితవైతే, నీ చేత ఓ కథ రాయిద్దును. అందులో మనతోటయొక్క వర్ణన వుణ్ణు. ఈ సరస్సు, లేడి కుటీరం, ఈ మామిడిచెట్టు, ఈ పరిసర ప్రాంతాల ప్రాకృతిక దృశ్యాలు, ఒకటేమిటి, అన్నీనూ రాయిద్దును. మనిద్దరికీ తప్ప ఇంకొకరికి బోధపడకూడదట ఆ కథ. అప్పుడెంత మజాగా వుంటుంది! చాలా గమ్మత్తుగా వుంటుందికదూ! అమల్! నువ్వోసారి రాయడానికి ప్రయత్నించకూడదూ! నువు తప్పకుండా రాయగలవని నాకు గట్టి నమ్మకముంది". "సరే, నేను రాయగలిగితే నువు నాకేమిస్తావు?". "ఏంకావాలి నీకు?" "నా దోమతెర అంచులకు ఓ 'లత' రాస్తాను. దానిమీద నువు సిల్కుదారంతో అల్లాలి." "నువు ప్రతిపనీ అతిగా చేస్తావు అమలు! దోమతెర అంచుమీదకూడా అల్లిక సంభవమవుతుందా?" ఈ జవాబుతో అమలుమొహం చిన్నబుచ్చుకున్నాడు. చారుకి మనస్సు చివుక్కుమంది. "సరే, అలాగే. కాని, నువు కథ వ్రాయి."

"ఏం, నేను రాయలేనా?"

హాస్యధోరణిలో అమలు అన్నాడు. "అయితే నువ్వేదో కథ రాసేవుంటావు. ఆ కథ నాకు చూపించు."

"ఈవేళ వద్దు వదినా!"

"అదంతా పనికిరాదు. ఈవేళ చూపించాలి. ఇదిగో ఒట్టు వేస్తున్నా. నీకథ తీసుకురా." చారుకి తన కథ వినిపించే దానికి అమల్‌కుకూడా ఔత్సుక్యంగానే వుంది. కాని, చారు దాన్ని బోధపర్చుకోగలదో లేదో, లేక ఆమె కిష్టపడుతుందో లేదో! ఈ సందేహమే అతని మనస్సులోవుంది. చారు బలవంతంమీద, తన పుస్తకం అమలు తీసుకువచ్చి, చెట్టుకింద కూర్చున్నారు. ఆమెకు వినిపించాలనీ – ఆమె స్వయంగా కోరి నప్పుడు ఇక సందేహించనవసరం లేదనుకున్నాడు. గొంతు సవరించుకుని అమలు చదవనారంభించాడు. కథయొక్క శీర్షిక "నా పుస్తకం."

"ఓ పుస్తకమా, నా కల్పన నిన్ను యింతవరకూ తాక లేదు. సౌరమండలంలో భాగ్యపురుషుడు ప్రవేశించేముందు శిశువుయొక్క కపాలం, అంటే నుదురు, ఎంత నిర్మలంగా, రహస్యంగా వుంటుందో, ఆవిధంగానే నువుకూడా నిర్మలంగా, అంటే పవిత్రంగా, రహస్యమయంగా వున్నావు. ఏ రోజయితే నీ ఆఖరు పేజీలో, ఆఖరుపంక్తిలో ఉపసంహారం రాస్తానో, ఈవేళ ఆరోజేదీ ? నీ శుభ్రమైన, ధవళమైన కాగితం....." వగైరాలు ఇంకా చాలా రాశాడు.

చెట్టునీడలో. చారు నిశ్శబ్దంగా తన్మయావస్థలో అమలు చదివింది విన్నది. అమలు చదవటం ఆపినతరువాత క్షణంసేపు వూరుకొని అందికదా : "మరి రాయలేదని ఎందుకంటావ్?" ఆవేళ, ఆ చెట్టుకింద, అమలు మొట్టమొదటిసారి సాహిత్యం యొక్క మత్తెక్కించే రసాన్ని గ్రోలాడు. ఆమాత్రం రచనతో

ఇద్దరూ తృప్తిపొందారు. "అమలు, కొన్ని మామిడికాయలు తీసుకెళ్లాలి. మందాకిని తెమ్మని చెప్పిందిగా! ఈవేళ మామిడి కాయ పచ్చడి చేయిద్దాం."

## 2

తోట తయారుచేస్తామనే కోరిక, తక్కినకోరికల్తోపాటు కల్పనా లోకంలో ఎప్పుడు విలీనమైపోయిందో ఏమిటో, అమలుకీ చారుకీ ఆ ధ్యానమే మరి లేకపోయింది. అమలుకీసమయమంతా రచనా వ్యాసంగంలోనే గడిచిపోయింది. "వదినా, ఈవేళ మంచి భావాలు వచ్చాయి. మంచి కథ రాశాను. నా భావాల్ని నీకు బోధపర్చలేకపోతున్నాను" అంటాడు అమలు.

"ఫరవాలేదులే, నాకంతా బోధపడుతుంది. దీన్ని పూర్తిగా రాసెయ్, మరెక్కువాలస్యంచెయ్యకు" అంటుంది చారు.

"ఎంతవరకు రాశావ్ అమల్?" అని ప్రశ్నించింది చారు మధ్యాహ్నంవేళ. "నన్ను కొంచెం ఆలోచించనీయ్." "పోనీలే, నువ్వు రాయనవసరంలేదు"అంటుంది రుసరుసలాడుతూ. ఆ కోపం కొంతసేపటివరకూ నడుస్తుంది. అప్పుడు జేబునుండి రుమాలు తీసే నెపంతో, కాగితంయొక్క ఒక కొస చూపిస్తాడు. "ఏదో రాశావు. నాకు చూపిస్తావా లేదా?" అంటుంది చారు. "యింకా పూర్తికాలేదు. అయింతరువాత చదివి విని పిస్తా" నంటాడు అమల్.

ఆ కాగితంకోసం యిద్దరూ పోట్లాడుకుంటారు. అంటే కొట్టుకోరు సుమండీ! ఎలాగయితేనేం, ఓ చిన్న తమాషా

జరిగింతరువాత అమల్, తన రచన్ని డాబుగా చదివి వినిపించేశాడు. అమల్ ఎప్పుడేదిరాసినా చారుకి చదివి వినిపించాలి. పూర్తికాకపోయినా ఫరవాలేదంటుంది. తరువాత మిగిలిన 'ప్లాట్'కోసం, యిద్దరూ మహాఘోరంగా బుర్రల్ని ఉపయోగిస్తారు. ఇంతవరకూ ఆకాశకుసుమాల్ని తెంపటానికి ప్రయత్నించారు. ఇహాను కావ్యకుసుమాల్ని సంగ్రహిస్తూ తక్కిన విషయాల్ని మరిచిపోయారు.

ఓ నాడు మధ్యాహ్నం అమలు కాలేజీనుండి యింటికొచ్చాడు. అతని షర్టుజేబు కొంచెం ఎత్తుగానున్నట్టు, అంటే ఏదో కాగితాలకట్ట వున్నట్టు కిటికీలోనుండి చారు చూసింది. ఇంతకుముందు అమల్ కాలేజీనుండి ఎప్పుడొచ్చినా ఇంట్లోకి వెళ్ళేవాడు తిన్నగా. కాని, ఈవేళమాత్రం వరండాలోనున్న గదికివెళ్ళి బయటికి రావడమేలేదు. చారు చప్పట్లుకొట్టింది. కాని అమల్ వినిపించుకోలేదు. కొంచెం కోపంవచ్చింది చారుకి.

సోఫాలో కూర్చుని 'మన్మథదత్తు'ని పుస్తకం తీసి చదవనారంభించింది. మన్మథదత్తు వో కొత్త నవలాకారుడు. అతని శైలికూడా ఇంచుమించు అమల్‌లానే వుంటుంది. కాని అమల్ అతనిరచనల్ని కటువుగా విమర్శిస్తుంటాడు. ఒక్కోసారి అతని పుస్తకాల్ని వికృతంగా, అంటే వెక్కిరించినట్టు చదివేవాడు. చారుకి కోపంవచ్చి ఆ పుస్తకాన్ని దూరంగా విసిరేది.

అమల్ మెల్లిగా శబ్దంలేకుండా వచ్చి కుర్చీవెనుక నిలబడ్డాడు. చూశాడు— మన్మథదత్తుని 'కలకంఠం' చదువుతోంది. "ఏం వదినా! చాలా ధ్యానంగా చదువుతున్నావల్లే వుంది!"

చారు జవాబివ్వలేదు. "ఓహో మనమదదట్టునిగలగండమా?" "అల్లరిబెట్టుకు. నన్ను చదువుకోనీ" అంది చారు. అమల్ వెక్కిరిస్తూ చదవనారంభించాడు. "నేను గడ్డిపరకని, క్షుద్ర మైన గడ్డిపరకని! ఓయ్ ఎర్రబట్టలధారీ గాడిదా, అయామ్ సారీ సోదరా! నేను కేవలం క్షుద్రగడ్డిపరకని. నాకుపూలులేవు. నీడలేదు. 'నాతిలత్తుని' [శిరస్సుని] ఆకాశంవరకూ ఎత్తలేను. పైకి లేవలేను.

"వసంత తోతిల[కోకిల] నా సహాయంతో తను పంచమ స్వరంతో రాగాలాపనచేసి ప్రపంచాన్ని సంతోషపర్చలేదు. అప్పటికీ వికసించిన పూలనుచూసి నీ విశాలమైన...బొమ్మల్ని, కాదు కొమల్నిచూసి—వో అశోకవృక్షమా, సోదరా, నన్ను neglect చేయకు brother నీ కాళ్ళదగ్గర పడివున్న క్షుద్ర మైన గడ్డిపరకని నేను. అలాగని నన్ను తుచ్ఛుడనుకొని అవ మానించబోకు. యయ్యాయ్యాయో!" వెక్కిరించాడు అమల్.

"ఏయ్ అమల్, నీకు పెంకితనం ఎక్కువవుతుంది. నీ రచనతప్ప ఇంకెవరి రచన నీ కిష్టపడదుగాబోలు." "ఆఁ!ఎందు క్కాదు? మరీ ప్రతి లాకాయిలూకాయివాడి రచన నువ్వెంతో కష్టపడి చదువుతావ్, వాణ్ణి తెగపొగుడుతావ్. మరంతేగా!" "చిదం చిదం, ఈ అనవసరం కబుర్లు చాలించండి. జేబులో ఏముందో చటాపట్ తీయండి బాబుగారూ!" "ఏముందో నువ్వే చెప్పుకోవాలి." కాస్సేపు చారుని బాగా ఏడిపించిన తరువాత జేబునుండి 'సరోరుహం' అనే మాసపత్రిక బయటికి తీశాడు. అందులో అమల్ రాసిన "నా పుస్తకం" అనే రచన

ప్రచురించబడింది. చారు చూసి సంతోషిస్తుందనుకున్నాడు. కాని అటువంటిదేమీ లేకపోయింది. " 'సరోరుహం' చాలా ఉత్తమపత్రిక. అందులో Third Class రచయితలకు స్థానందొరకదు" అన్నాడు అమల్. నిజంగా 'సరోరుహం' చెత్తపత్రిక. కాని దాన్ని బాగా "తైరు" కొట్టాడు. అసలు, ఏరచయితకీ, పారితోషికమైనా యిచ్చే సంపాదకుడు కాడు. ఉల్భాగా ఏ రచన దొరికితే దాన్ని ప్రచురించే పత్రికల్లో అదొకటి. ఆ సంపాదకుడు గొప్ప సాహిత్యకోవిదుడనీ, వందలకొద్దీ రచనల్లోనుండి ఉత్తమమైన రచన్ని అంటే తనది, ఎంచుకొని ప్రచురిస్తాడనీ డబ్బాకొట్టాడు అమల్. చారు సంతోషించడానికి ప్రయత్నించింది గాని, అలా అవలేదు. తగినంత కారణంకూడా ఆమెకు అవగాహన కాలేదు.

అమల్ రచన అమల్-చారుల సొత్తు, దానిపై వాళ్ళకే అధికారముంది. అమల్ రచయిత; చారు శ్రోత, పాఠకురాలు. దాన్ని ప్రజానీకం చదివి, ఆనందించి, ప్రశంసిస్తారనే సంగతి తల్చుకుని, చారు మనస్సులో ఎందుకోసం బాధగా వుందో, ఎంత ఆలోచించినప్పటికీ ఆ రహస్యం ఆమెకు బోధపడలేదు. కాని రచయిత ఒకేఒక పాఠకునితోనే తృప్తిపొందడు. అమల్ తన రచనల్ని పత్రికలకి పంపించ నారంభించాడు.

అప్పుడప్పుడు పారితోషికాలుకూడా దొరుకుతున్నాయి. పాఠకులనుండి ప్రశంసా పత్రాలుకూడా వస్తున్నాయి. ఆ ఉత్తరాల్ని చారుకి చూపించేవాడు. అవిచూసి కొంత సంతోషించేది. కొంచెం కష్టంకూడా కలిగేది. తన రచనలకి చారు

యొక్క ప్రోత్సాహమే కావాలి అనే ఆవశ్యకత అమలుకి లేకపోయింది. అప్పుడప్పుడు నారీ పాఠకలోకంనుండి కూడా అమల్‌కి ఉత్తరాలు వచ్చేవి. అందులో వాళ్ళపేర్లుమాత్రం వుండేవికావు, వున్నా మారుపేర్లుతో రాసేవారు. అవిపట్టుకుని చారు చర్చిస్తూ అమల్‌ని వేళాకోళం చేసేది. గాని సంతోషించలేకపోయేది. ఆఖరికి వీళ్ళు తీవ్రంగా ఏదోవిషయమై వాదించుకుంటుండగా కొంతమంది పాఠకులసమూహం ఆ గది లోకి చొరబడి అమల్ రచల్ని తెగపొగడుతూ అభినందించి వెళ్ళిపోయారు. ఓనాడు తీరికచూసుకుని భూపతికూడా అన్నాడు "చారు, మనఅమలు ఇంత బాగారాస్తాడని త్వర లోనే ఉత్తమ రచయితల శ్రేణిలో చేరిపోతాడనీ, నేనెప్పుడూ అనుకోలేదు." భూపతి మాటలువిని చారు చాలా సంతోషించింది.

"మీరు చదివారా?' అంది చారు. "ఆ! లేదు చదవ లేదు. అసలు తీరికేదీ? కాని 'మా నిశికాంతుడు' చదివాడు. అమల్ రాసిన కథల్ని చదివి బాగాశ్లాఘించాడు." భూపతి మనస్సులో అమల్ ప్రత్యేకస్థాన మలంకరించుకున్నందుకు చారు లోలోన తృప్తిపడింది.

* * *

# 3

ఉమాపదబాబు భూపతిని బోధ పర్చాడు, పత్రికా చందాదారులకు తదితర ప్రముఖ రచయితలకు ప్రత్యేకంగా

కొన్ని పారితోషికాలిస్తే బాగుంటుందేమోనని. మరి ఈ విధంగా బహుమానాలిస్తే నష్టం పూర్తయి, లాభం ఎలా వస్తుందో తనకేమీ బోధపడలేదు. భూపతిగదిలో ప్రవేశించ గానే చారు ఉమాపదుని చూసింది. వెంటనే తిరిగి వెళ్లిపో యింది. కాసేపు ఇటూఅటూ తిరిగి మళ్ళీ ప్రవేశించింది. ఇద్దరూ ఏదోవిషయాన్ని తీవ్రంగా ఆలోచిస్తున్నారు. భూపతితో చారు ఏకాంతంలో మాట్లాడగోర్తుందని ఉమాపదుడు గ్రహించి యేదో సాకుచెప్పి మెల్లిగా బయటికి నడిచాడు.

భూపతి ఇంకాయేదో లెక్కపెడుతూనే వున్నాడు. చారు లోపలికి ప్రవేశించగానే టకీమని ప్రశ్న వేసింది. 'ఇప్పటివర కూడా మీపని పూర్తికాలేదల్లేవుంది. రోజంతా పత్రికల్లో బుర్రవేడెక్కించు కుంటూంటే మీకెలా వుంటుందా! అని నాకు సందేహం బాధ పెడుతూంది.'

భూపతి లెక్కపెట్టటం ఆపి వోచిరునవ్వు విసిరాడు. అవును నిజమే తను ఈపనిలో మునిగి చారుయొక్కస్థితి ఎలా వుందో ఎప్పుడూచూడడు. ఇదిఅన్యాయమే. చారుకు కాల క్షేపానికి యేమీ సాధననేలేదు అనుకున్నాడు తనలో. స్నేహ పూర్వకంగాఅన్నాడు "ఈ వేళ నీకు చదువులేదా? మీ మేష్టారు ఎక్కడికో పారిపోయారల్లేవుంది. మీస్కూలు నియమాలన్నీ గమ్మత్తుగావున్నాయే. విద్యార్థిని పుస్తకాలు పట్టుకుని చదవ డానికి తయారుగావుంటే మేష్టారి 'హత్తాఫికర్' లేదు. యిన్నాళ్ల లాగ అమల్ నీకుశ్రద్ధగా యేమీ చెప్పలేదనుకుంటా."

"నా చదువుకోసం, తనసమయం నష్టపర్చడం అదేమంత

న్యాయం? అమల్‌ని మీరు మామూలు Private Tutor అనుకున్నారా ఏం?" "ఇది మామూలు Private ట్యూషన్ అని నేనన్నానా? నీలాంటి వదినకి నేను చదువుచెబితేనా..." అంటూ వాక్యం పూర్తిచేయకుండా చారుని తనవైపు లాక్కున్నాడు భూపతి! "చిత్తం చాలించండి నాకు భర్తఅయి ఇంత చేసేశారు. ఇంకా ఏమన్నా అయితే మరేమవునో" అంది చారు వెటకారంగా. భూపతికి నోచిన్న 'షాక్'లా తగిలింది. దాంతో అన్నాడు: "సరే రేపటినుండి నేనే నీకు చదువుచెప్తాను. నీ పుస్తకాలు తీసుకురా చూస్తాను - నువ్వేమిటి చదువుతావో" "మీరంత కష్టపడ నవసరంలేదు. కాస్సేపు మీ లెక్కా డొక్కా ఆపగలరా?"

"తప్పకుండా. ఇప్పుడు నువ్వేంచెప్పినా అదిచేస్తాను!" అన్నాడు నవ్వుతో. "ఇదిగో అమల్ రాసిన ఈ వ్యాసం చదవండి ఎంతబాగా రాశాడో! దీన్ని తన పత్రికలో ప్రచురించి, సంపాదకుడు ఎంత ప్రశంసించాడో! దీన్ని చదివి ప్రఖ్యాత సమాలోచకుడు 'నవగోపాలు బాబు' అమల్‌ని 'బెంగాలీ రస్కిన్'అన్నాడు" భూపతి వ్యాసాన్ని తీసుకున్నాడు. వ్యాసంయొక్క శీర్షిక 'ఆషాఢచంద్రుడు'. గత రెండు వారాల నుండీ భూపతి భారత ప్రభుత్వపు బడ్జెట్ లెక్కల ఎస్టిమేటు తయారుచేస్తున్నాడు. తన సమాలోచనకోసం ఆ సంఖ్యలే అతని బుర్రలో పరుగులెడ్తున్నాయి.

ఇటువంటి సమయంలో 'ఆషాఢచంద్రుడు' చదవడానికి అతనికి మనసొప్పలేదు. వ్యాసంకూడా ఏమంత చిన్నదికాదు.

చారుకి కోపం వస్తుందేమోనని యేవో నాలుగు పంక్తులుచదివి "చాలాబాగా రాశాడు, కాని నన్నెందుకు చదవమంటావ్ ? యిదంతా కవిత్వధోరణిలో వుంది. యిది నాకేం బోధపడు తుంది ?" అన్నాడు. భూపతి చేతుల్నుంచి వ్యాసం లాక్కుని "అయితే మీకేం బోధపడుతుంది ?" అంది చారు.

"నేను దినపత్రిక సంపాదకుణ్ణి. ప్రపంచం ఎలా సాగు తుందో ఆలాంటి విషయాలు నాకు బోధపడతాయ్. మను షుల్ని స్టడీచేస్తాను. అర్థంచేసుకోగలను కూడా." "అయితే, సాహిత్యంలో మనుషుల విషయం రాదా ? దాంట్లో రాసిం దంతా అబద్ధం. అదికాకుండా మనిషి స్వయంగా, సశరీరంతో నున్నప్పుడు కల్పనాజగత్తులో వెదికే అవసర మేమొచ్చింది ? ఉదాహరణకు నువ్వే వున్నావు. నిన్ను నేను స్వయంగా చూస్తున్నా. మరి నిన్ను వెదకడానికి కావ్యాలు, సాహిత్య గ్రంథాలు తిరగెయ్యాలా ?"

"నాకు కావ్యాలు బోధపడవు" అని భూపతి ఓవిధమైన ఇది ప్రకటించేవాడు. అమల్ వ్యాసాన్ని పూర్తిగా చదవలే పోయినా, అమల్‌పట్ల భూపతి హృదయంలో స్నేహం, ప్రేమ, ఆదరాభిమానాలు, అన్నీ కలిసి స్థానంచేసుకున్నాయ్. భూపతి తన పత్రికలోకూడా కళకూ, సాహిత్యానికీ, అగ్రస్థాన మిచ్చేవాడు. ఎవరయినాబీదరచయితవచ్చి, పుస్తకాన్ని ముద్రిత రూపంలో కావాలని కోరితే, తన సొంతఖర్చుతో దాన్ని ముద్రింపజేసేవాడు. కాని, తనకి సమర్పణచేయమని చెప్పే వాడు కాదు.

అమల్ ఇంగ్లీషువ్యాసాలు ప్రూఫ్ చదివి దిద్దడంలో భూపతికి బాగా సహాయంచేసేవాడు. ఓ వ్యాసంలోని హస్త లిపి బోధపడక అమల్ భూపతి సలహాకోసం అతనిగదిలోకి ప్రవేశించాడు కాగితాలకట్టతో. అమల్ రాగానే, భూపతి చిరునవ్వుతో అన్నాడు "అమల్, నువ్వు ఆషాడచంద్రుడు రాసినా, వర్షధారరాసినా, లేక భగ్నవీణాతంత్రులు రాసినా, నాకేం అభ్యంతరంలేదు. ఒకరి స్వాతంత్ర్యాన్ని భంగపర్చడం కూడా నాకిష్టంలేదు. గాని, నాస్వాతంత్ర్యరథాన్ని ఎందుకాపు తున్నారో, నాకు బోధపట్టంలేదు. చూడు, మీ వదిన నామీద ఎలా అత్యాచారం చేస్తుందో! నీ వ్యాసం నేను చదవందే ఒకంతట నన్ను వదలదట."

"అవును, నిజమేవదినా! నా వ్యాసం చదివించడానికి అన్నయ్యానింతగా జబర్దస్తీ చేస్తావని తెలిస్తే నేనసలు రాయనే రాయకపోదును" అన్నాడు అమల్ చిరునవ్వుతో.

సాహిత్యరసాన్ని గ్రోలడాని కిష్టపడని భూపతికి తన ప్రియమైన రచన్ని చారు తీసుకవచ్చినందుకు అమల్ లోలోన కొంచెం బాధపడ్డాడు. వెంటనే విషయం మార్చాలని భూపతి తో చారు అంది—"అమల్ కి పెళ్ళిచేసెయ్యరాదూ! ఈ వ్యాసాలగొడవలు వుండనే వుండవు."

"ఆ! ఇప్పటికుర్రాళ్లు మనలాంటి మూర్ఖులుకారు. వాళ్ళకి ఈ రచనా వ్యాసంగం ఓ గొప్ప నిషాలాంటిది. వాళ్ళధ్యాసమంతా అందులోనే కేంద్రీకరించి వుంటుంది. నీ మరిదినే చూడకూడదూ, ఎన్నోసార్లు చెప్పాను పెళ్ళిచేసుకో మని, కాని నా మాటలు వ్యర్థమయ్యాయి" అన్నాడు భూపతి.

చిరాకుపడుతూ చారు అక్కడినుండి కదిలింది చారు వెళ్ళిపోగానే భూపతి అన్నాడు: "అమల్ నువ్వు చూస్తున్నావుగా, ఈ పత్రిక గొడవొకటి కొనుక్కున్నాను. దీంతో నాకు శెలవుదొరక్కుండావుంది. పాపం! చారు ఒక్కర్తె ఐపోయింది. ఏమీ పనీ, పాటా కూడాలేదు. అప్పుడప్పుడు నా గదిలోకి తొంగిచూచిపోతుంది. ఏం చెయ్యమన్నావు? అప్పుడప్పుడు నువ్వు చారుకి మంచి యింగ్లీషు, బెంగాలీలుకథ చదివి వినిపించు. ఇలాగైనా ఆమెకు కాస్త పొద్దుపోతుందేమో! చారుకి సాహిత్యమంటే చాలసరదా."

"అవునన్నయ్యా, అదే నేనూ గమనించా. ఇంకొంచెం కృషిచేస్తే వదినకూడా బాగా కథలు రాయగలదని నాకు నమ్మకముంది." "అది నేను చెప్పలేనుగానీ, చారు చాలా చురుకైందనిమాత్రం నే చెప్పగలను. నేను చెప్పినపనులుచేస్తే నీకు మంచి బహుమానాలిస్తాను." "ఏమిస్తావేం?" "మీావదిన లాంటి మంచిపిల్లను వెదికి నీకు వెళ్లిచేస్తాను." అమల్ సిగ్గుపడుతూ ఆడపిల్లలా తలవంచుకొని గదినుండి బయటికి నడిచాడు.

*  *  *

## 4

పాఠకుల మన్ననలనంది, అమల్ గొప్ప రచయితై పోయాడు. ఉత్తమ రచయితల శ్రేణిలోకి చేరిపోయాడు. అంతకుముందు అమల్ మామూలు విద్యార్థిలా వుండేవాడు. ఇప్పుడు సంఘంలో ఓ ప్రముఖవ్యక్తిలా పరిగణింపబడు

తున్నాడు. అప్పుడప్పుడు సాహిత్యసమ్మేళనల్లోకూడా పాల్గొనే వాడు. అతనిచుట్టూ పత్రికావిలేఖరులు తిరగ నారంభించారు. సంపాదకులు అమల్‌ని తమఇళ్ళకు విందుల కాహ్వానించ సాగారు. అతనితో స్నేహం చేసుకోవాలని చాలామంది ప్రయత్నించేవారు. కొన్నిసభలకు సభాపతిగాకూడా ఎన్నుకోబడ్డాడు.

అమల్‌కి కిళ్ళీలు బాగా అలవాటయిపోయింది. ఎల్లప్పుడూ బుగ్గలు పొంగేవుండేవి. కిళ్లీలుకట్టే డ్యూటీ మందాకినిదే. అమల్, చారు, వీళ్లిద్దరూ మందాకిని చూడకుండా 'పాన్ దాన్'లోని ఆకులన్నీ తెగ నమిలేవారు. ఇది రోజూ వాళ్ళ కలవాటైపోయింది. అటువంటి మోటుహాస్యం మందాకినికి నచ్చేదికాదు. అసలు సంగతేమిటంటే, ఒక ధనికునింట్లో ఒక ఆశ్రితవ్యక్తి మరో ఆశ్రితవ్యక్తిని సదుద్దేశంతో చూట్టం అసంభవమేనేమో! అమల్ ఒకఆశ్రితుడు. అతనికోసం ప్రత్యేకంగా పనిచెయ్యటం మందాకిని కిష్టంలేదు. తన కవమానం అనుకునేది. చారు, అమల్ తరఫున వాదించేది. అందుకని, మందాకిని ఏమీ అనలేకపోయేది. అవకాశం దొరికినప్పుడల్లా అమల్‌మీాద నౌఖర్లతో ఏవో లేనిపోనివి వాగుతుండేది. వాళ్లుకూడా లోలోన చిరాకు పడుతుండేవారు. అయితే చారుదగ్గర భయంవల్ల బయటికేమీ అనేవారుకారు.

ఈలోగా అమల్ బాగా పేరు సంపాయించాడని వినగానే మందాకిని ఆశ్చర్యచకితురాలైంది. ఈ అమల్, మునుపటి అమల్ కాడనేభావం ఆమె మనస్సులో ఏర్పడింది. అమల్‌పట్ల

సాధారణ ప్రజానీకంకూడా ఆదరాభిమానాలు చూపిస్తున్న ప్పుడు మందాకినికూడా ప్రజల్తోపాటు 'ప్లేటు' మార్చింది. మందాకినికూడా మునుపటి సంకుచితభావాలు లేకుండా ఎంతో గౌరవంగా ప్రవర్తించ నారంభించింది.

*　　　　*　　　　*

ఇహాను కిళ్లీలు దొంగిలించే అవసరంలేకపోయింది. కట్టిన కిళ్లీలు అమల్ దగ్గరకు చేరిపోతుండేవి. అయితే కిళ్లీలు దొంగి లించేప్పుడు పొందే ఆనందం, 'థ్రిల్' (Thrill) ఇప్పుడు లేక పోయింది చారుకి. ఈ కారణంచేత మందాకినిపట్ల చారుకి లోలోన కోపంగానేవుండేది. ఇన్నాళ్లు ఆమెను మహా ఆడించే వారు. అవిప్పుడు దూరమైపోయాయి. ఆమెను దూరంగా వుంచలేకపోయారు. ఒక్క చారుతోనే స్నేహంగావుంటం మందాకిని చూడలేకపోయింది. ఫలితంగా ముందు అమల్ని ఎంతగా చీదరించుకునేదో ఇప్పుడంత ఆదరాభిమానాలు ప్రద ర్శించ నారంభించింది. ఇదే సమయమనుకుని వీళ్ళిద్దరి 'కమిటీ' ఎప్పుడు కూర్చునేదో అప్పుడే మందాకినికూడా పానకంలో పుడక్కిమల్లే ప్రవేశించేది. ఆమెను ఏమన్నా అనటానికి చారుకి అవకాశంకూడా దొరక్కుండా పోయేది.

పిలవని పేరంటానికిమల్లే మందాకిని ఎప్పుడైతే ప్రవేశిం చేదో చారు చాలా విసుక్కునేది. అమల్ మాత్రం ఏమీ ఆటంకపర్చేవాడు కాడు. తనతో దూరంగావుండే ఓ వ్యక్తి, తనదగ్గరకు రావటానికి ప్రయత్నిస్తూండే అమల్ కాదనలేక పోయేవాడు. మందాకిని వస్తున్నప్పుడల్లా అదో వింత ధోరణిలో

చారు అనేది - "అదిగో వారు ప్రవేశిస్తున్నారు." ఆమెను సంతోషపర్చాలనే భావంతో అమల్ అనేవాడు - "అవును వదినా! ఈమె మనవెంట పడిందేం?" మందాకిని రాగానే అమల్ నవ్వుతూ ప్రశ్నించేవాడు. "ఏం వదినా, నీ పాన్‌దాన్ నుండి దొంగతనమైన సూచన లేమన్నా అవుపించాయా ఏమిటి?"

"అడగ్గానే కిళ్లీలు దొరుకుతున్నప్పుడు దొంగిలించే అవసరం ఏం వచ్చిపడింది?" అంటూ చారుని ఓరచూపుతో గమనించేది.

"కాని, దొంగతనంలో నున్న మజా అడగటంలో ఏముంది?"

"పోన్లెద్దూ, ఇప్పుడెందుకా గొడవ? మీరేదో చదువు తున్నారల్లేవుంది. మరి ఆగిపోయారెందుకు? నాకు కథలంటే మహా చెడ్డ సరదా."

సాహిత్య జ్ఞానంలేని మందాకిని, అమల్ కథలు వినటం చారుకి ససేమిరా ఇష్టంలేదు. కాని మందాకినికూడా తన కథలు విని, ఆమెనుండికూడా పొగడ్తలు పొందాలని అమల్‌కి కుతూ హలంగావుండేది. చివరికి మందాకిని మాటకు చారే జవా బిచ్చింది: "బంకింబాబు యొక్క 'కమలాకాంతుని కార్యాల యం'పై విమర్శ రాశాడు అమల్. నీకేమన్నా బోధపడు తుందా మందాకినీ?"

"నేను చదువురాని మొద్దునైతేమట్టుకు, విని కాస్తయినా బోధపర్చుకోలేనా?" మందాకిని అన్నది.

అమల్‌కి ఓనాడు జరిగిన ఘట్టం గుర్తుకు వచ్చింది. మందా, చారు యిద్దరూ చదరంగమాడుతున్నారు. అంతలో అమల్ తన రచనతో అక్కడ ప్రత్యక్షమయ్యాడు. చారుకి చదివి వినిపించాలని ఎంతో ఉత్సాహంతో వచ్చాడుగాని, వీళ్లాట ఎప్పటికీ తెగకుండా వుంది. అసలు ఇద్దరు మంత్రులూ తీవ్రంగా పనిచేస్తున్నారు. పైగా ఏనుగులు కూడా బాగా సహాయం చేస్తున్నయ్. చారు రాజు హాయిగా కోటలో విశ్రాంతి తీసుకుంటున్నాడు అమల్‌కి విసుగెత్తింది. "సరే వదినా. నువ్వాడుతూ వుండు. ఈ వ్యాసం అఖిల్‌బాబుకి విని పించి వస్తాను" అన్నాడు.

"ఉండవయ్యా, అంత తొందరెందుకూ? ఆకాస్త నేనే వినకూడదా ఏం?" అంటూ ఆట కలిపేసింది చారు. "ఇహాను మీ సాహిత్యగోష్ఠి ప్రారంభమవుతుంది గాబోలు. సరే, నే పోతా"నంటూ మందాకిని లేచింది. ఏదో మాటవరసకోసం చారు అంది–"నువుకూడా వినరాదూ? అలా వెళ్లిపోతావేం?" "ఆఁ మీ కథలూ, వ్యాసాలు నాకేం బుర్రకెక్కాలా ఏడ వాలా?" అంటూ చరచరా నడిచిపోయింది.

ఆ మందాకినే ఈ వేళ "కమలాంతేర్ దఫ్తర్" యొక్క విమర్శ వినటానికి ఔత్సుక్యం చూపిస్తోంది. "సరే వదినా, ఈ వేళ నువు వినటం నాకు పరమసౌభాగ్యం" అంటూ చారుని చూశాడు.

చారు మనస్సులోని భావాలని లెక్కచెయ్యకుండా కాగితాల కట్ట తీశాడు చదవటానికి. అయితే చారుకి మాత్రం

హృదయంలో ఈర్ష్య అగ్నిపర్వతంలా విస్ఫోటమవుతోంది. ఎలాగైనా అతని చదువు నాపాలనే ఉద్దేశంతో చారు అంది కదా—"అమల్, లైబ్రరీనుండి 'చంద్రశేఖర్' తెస్తానని చెప్పావు కదా, మరి తీసుకురావేమిటి?"

"రేపు తెస్తానని చెప్పాను. ఈవేళ కాదు" అన్నాడు అమల్.

"కాదు, ఈ వేళే తెస్తానన్నావు. నువ్వు మర్చిపోయి వుంటావు, బాగా జ్ఞాపకం తెచ్చుకో. నువ్వు అబద్ధాలుకూడా నేర్చావల్లే వుంది."

"ఎలా మర్చిపోతాను?"

"పోనీలే, నువు తీసుకురానవసరంలేదు. నేను నరేశ్‌ని పంపించి తెప్పించుకుంటా"నంటూ కోపంతో లేచి నిలబడింది.

అమల్ ఇద్దరిమధ్యా బాగానే ఇరికిపోయాడు. చదువు నాపలేకపోతున్నాడు. వేడుతున్న చారు నాపటంకూడా అసంభవంగానే వుంది. మరి మందాకినీ? చారుభావాన్ని మందాకిని పసికట్టేసింది. క్షణంసేపు చారుపట్ల ఆమెహృదయం విషణ్ణమైంది. చారు వెళ్లిపోయింతరవాత మందాఅంది: "వెళ్లుబాబూ చారుకు కోపంవచ్చింది. ఆమెను బ్రతిమాలి ఆమెకే చదివి వినిపించు. నాకు చదివి వినిపిస్తే నువు విషమపరిస్థితిలో చిక్కుకుంటావు." దీంతో అమల్‌కికూడా కోపం వచ్చింది. "విషమ పరిస్థితి దేనికి?" అంటూ చదవ నారంభించాడు. "నువు చదవ నవసరం లేదు లేవోయ్" అంటూ పుస్తకం మూసి అక్కడి నుండి కదిలింది మందాకిని.

* * *

# 5

చారు ఎవరింటికో విందుకు వెళ్లింది. మందాకిని ఇంట్లో కూర్చుని బియ్యంలోని రాళ్లు ఏరుతోంది. ఇంతలోనే అమల్ ప్రవేశించి 'వదినా' అని పలకరించాడు. చారు విందుకు వెళ్లిందనీ, ఆ సంగతి అమల్‌కి తెలుసుననీ మందాకక్కూడా తెలుసు. "ఓ, అమల్ బాబుగారా! ఎవర్ని వెతకటానికి వచ్చారు? ఎవరు దొరికారు? ఇంతకూ నీ అదృష్టం" అంది మందాకిని వ్యంగ్యంగా.

"ఆఁ దానికేంలే గాని, వదినా మీ ఊరు సంగతు లేవన్నా చెబుదూ" అన్నాడు అమల్. తన కథలకు ప్రోత్సాహం దొరుకుతుందని ప్రతీవాళ్ల మాటలూ శ్రద్ధతో వినేవాడు. అందుకే ఇన్నాళ్ళకు మళ్లే మందాని ఉపేక్షించేవాడు కాడు. ఇప్పుడు మందాకిని చరిత్ర, ఆమె గ్రామంలోని సంగతులు తెల్సుకోవాలని అంతగా ఉబలాటపడుతున్నాడు. మందాకిని చెబుతుంటే అమల్ అన్నిటికీ "ఊఁ" కొడుతున్నాడు. ఇంతలోనే చారు విందునుండి తిరిగివచ్చింది. మందాకిని కథ మందగించింది.

"ఏం వదినా, ఇంత త్వరగా వచ్చేశావ్?" అని ప్రశ్నించాడు అమల్, ఆమెను పలకరించటం తన కర్తవ్యమనుకుని. "ఆఁ ఏమీ లేదు" అంటూ చారు వెళ్లటానికి ఉపక్రమించింది. "మంచిపని చేశావ్! నా కథలు ఏమీ ఊసుపోలేదు. మన్మథదత్తుని 'ఊహారేఖలు' అనే కొత్తపుస్తకం వెలువడంది. అది చదివి వినిపించాలని వుంది. వింటావా?"

"వద్దు. చాలా పనులున్నాయి."

"ఆ పనేదో నాతో చెప్పరాదూ, నాకు చేతనైతే చిటికెలో చేసిపారేస్తాను."

చారుకి తెలుసు, అమల్ ఊహారేఖలు తెస్తాడనీ, తనని ఉడికించటానికి వెక్కిరిస్తూ చదువుతాడనీ. ఇదంతా ఆలోచిస్తూ, అనవసరంగా విందునుండి ఇంత తొందరపడి వచ్చినందుకు తనమీద తనకే కోపం కలిగింది. మందా కేం సిగ్గులేకపోయిందీ? అమల్‌తో ఒంటరిగా గదిలో కూర్చుని పకాపకా నవ్వుతోంది. ఎవరన్నా చూస్తే ఏమంటారు అనే జ్ఞానమన్నా లేదేం? అయితే, ఈ విషయంలో మందాని మందలించటం కూడా కష్టమే. మందా ఏమన్నా నోటికి వచ్చినమాట విసిర్తే! తనైతే అమల్‌ని సాహిత్యవిషయాల్లో ప్రోత్సహిస్తుంది.

మరి మందా ఏం చేస్తుందీ? మందబుద్ధి. దానికేం తెలుసు? దానిబొంద. యవ్వనంలో నున్న అమల్‌ని తన వలలో వేసుకోటానికి ప్రయత్నిస్తుందేమో! ఈ అపాయం నుండి అమల్‌ని తప్పించటం తన ప్రథమ కర్తవ్యం. కాని, ఈ మాయావిని పన్నిన పన్నాగం ఏ విధంగా విఫలీకరించాలి! ఒకప్పుడు చెబితే తత్ఫలితం చెడుగా పరిణమిస్తుందేమో!

పాపం! ఉమాపదుని చూస్తే జాలివేస్తుంది. రాత్రింబవళ్లు పత్రికకోసం కష్టపడుతుంటాడు. ఇవతల అతని ధర్మపత్ని శ్రీమతి మందాకినీదేవిగారు, ఇలా చేస్తున్నారు. అతను మాత్రం నిశ్చింతగా వున్నాడు. మందాయొక్క సౌశీల్యం మీద ఉమాపదుని కెంతమాత్రమూ అనుమానంలేదు,

అవిశ్వాసంలేదు. ఎంత మంచివాడు! ఈ అక్రమచర్యల్ని చూస్తూచూస్తూ చారు ఎలా ఊరుకుంటుంది! ఇది అన్యాయం.

అయితే, అమల్ తనపట్ల ఇంత అశ్రద్ధ చూపించటానికి కారణం? అవునవును...ఎందుకాకూడదుమరీ...ఇంత పేరు సంపాయించాడు. అమల్‌ని రచనా వ్యాసంగంలో ప్రోత్సహించింది కూడా తనే. తను ఇంతవరకు పైకిరావటానికి ఆమే ముఖ్య కారణం. ఆ విశ్వాసమైనా లేకపోయిందే అమల్‌కి. ఇప్పుడు అమల్ ఒక ప్రఖ్యాత రచయిత. చారు కేవలం ఒక పాఠకురాలు.

* * *

## 6

కిటికీదగ్గర కూర్చుని చారు ఏదో రాస్తోంది. టేబిల్ మీద అమల్ రచనలు రెండుమూడు పడివున్నాయి. అవే చారుకి దారి చూపిస్తున్నాయి. ఆమెకు తెలీకుండా అమల్ గుప్‌చుప్‌గా వచ్చి నిలబడి ఆమె రాస్తుందల్లా చూస్తున్నాడు. "మరి నేను రాయలేదని చెబుతావేం?" అన్నాడు అమల్. హఠాత్తుగా అమల్ కంఠస్వరంవిన్న చారు తొట్రుపాటుతో గబగబా రాస్తున్న పుస్తకాన్ని దాచేస్తూ "ఇది చాలా అన్యాయం సుమా" అంది.

"నేనేం అన్యాయంచేశాను?"

"ఇలా దొంగలా వచ్చి రహస్యంగా చూస్తున్నావెందుకు?"

"ప్రత్యక్షంగా నేను చూడలేను గాబట్టి."

చారు ఓవిధంగా సంకోచిస్తూ పుస్తకాన్ని చింపబోయింది. అమల్ మెరుపులా లాక్కున్నాడు పుస్తకాన్ని. "నువు దాన్ని చదివితే మరెప్పుడూ నీతో మాట్లాడను" అంది చారు కోపాన్నభినయిస్తూ.

"నువు చదవటానికి నన్నాటంకపరిస్తే నేనుకూడా నీతో ఈ జన్మలో మాట్లాడను" అన్నాడు అమల్ కొంచెం సీరియస్‌గా.

"అమల్, నువ్వు చదవకు. ఇదిగో ఒట్టు వేస్తున్నా!"

ఆఖరికి చారు ఓడిపోయింది. నిజానికి, తన రచన అమల్‌కి చూపించాలని ఆమె తహతహ లాడింది. కాని, తీరా చూపించే సమయానికి సిగ్గు తెర లడ్డం వస్తాయని ఆమె ఊహించనైనాలేదు. అమల్ చదువుతుంటే ఆమె కక్కడ వుండటానికష్టంలేక "కాఫీ తెచ్చేదా?" అంటూ తుర్రున పరుగుతీసింది.

"చాలా బాగా రాశావు" అన్నాడు అమల్.

"పొగడ్తలు చాలించి, ఆ పుస్తకాన్నిలా తే."

"ఊహూఁ, ఇప్పుడివ్వను. దీన్ని Fair చేసి ఓ పత్రికక్కంపిస్తా."

"మా కేం పనిలేకపోతే సరి. నా కవసరంలేదు. ఇలా తే."

ఈ వాగ్వివాదంలో అమల్ గెల్చాడు. "అబ్బా, నీతో గొప్ప చిక్కే వచ్చింది" అంది చారు విసుగుతో చెక. "అయితే దీన్నొకసారి అన్నయ్యకి చూపించాలి" అన్నాడు అమల్. వెంటనే నాగుపాములా కస్సుబుస్సుమంటూ లేచింది. అమల్ చేతినుండి ఆ పుస్తకం లాక్కోటానికి ప్రయత్నిస్తూ "దీన్ని

మీ అన్నయ్యకి చూపించావంటే, మరెప్పుడూ ఓ అక్షరమన్నా రాయను" అంది.

"అదే పొరపాటు వదినా. అన్నయ్య దీన్ని చూస్తే నిన్నేం, మింగడులే. పైగా చాలా సంతోషిస్తాడు."

"మరేం ఫరవాలేదు. ఆయన సంతోషా సంతోషాల్తో నాకు నిమిత్తంలేదు."

చారు తనలో ప్రతిజ్ఞ చేసింది; అమల్‌కి తెలీకుండా తనుకూడా రచనలు సాగిస్తుందనీ, అతన్నాశ్చర్యపరుస్తుందనీ, తనకూ మందాకినికీ వున్న తేడా నిరూపిస్తుందనీ, దాంతో అమల్ కళ్ళకున్న తెర తొలగిపోతుందనీ. ఈ కొద్దిరోజుల్లోనే చారు చాలాపట్టుకు రాసింది. అందులో కొన్ని ఆమెకు నచ్చక పోయినందువల్ల చింపేసింది కూడాను. ఆమె రాసిన ప్రతీ రచనా అమల్ రాసినట్టుగానే వుంటుంది. ప్లాటంతా అమల్‌దే. భాషమాత్రం వేరు. కొత్తగా ఆరంభించిన రచనకుమల్లే వుంటుంది.

ఆమె రాసిందంతా అమల్ పూర్తిగా చదివి—"ఏదెల్లా వున్నా నీ ప్రథమ ప్రయత్నాన్ని ప్రశంసించకుండా వుండలేక పోతున్నాను వదినా! నీలాంటివాళ్ళను ప్రోత్సహించాల్సిందే" అన్నాడు. "చాలించవోయ్. సరేగాని, మనం ఒక పత్రిక నడుపుదామా? నీ ఉద్దేశమేమిటి?" అంది చారు. "దానికి చాలా డబ్బుకావాలి. లేకపోతే పత్రిక నడవదు." "మన పత్రికకి డబ్బు అవసరంలేదు. మనది హస్తలిఖిత పత్రిక. అందులో మనిద్దరి రచనలే వుండాలి. నువ్వూ నేనూ ఇద్దరే

పాఠకులు. మరెవరూ దాన్ని చదవకూడదు. రెండే కాపీలు వెలువడాలి. ఒకటి నీకోసం, రెండోది నాకోసం."

కొద్దిరోజులు ముందు ఈ ప్రస్తావన వస్తే అమల్ అంగీకరించునేమో! ఇప్పుడు అమల్‌కి ఒక్క చారు ప్రశంసల్తోనే తృప్తిలేదు. వేలకొలదీ పాఠకుల ప్రశంసలు కావాలి. వాళ్ళ కోసమే తను రాస్తాడు. వాళ్ళదృష్టిలో తనొక ఉత్తమ రచయితగా పరిగణించబడాలి. అయినా చారుని తృప్తిపర్చాలని, "చాలా బాగుంది నీ ప్లాన్" అన్నాడు. "మన పత్రికకు తప్ప మరి దేనికీ నీ రచనల్ని పంపించనని వాగ్దానం చెయ్యాలి" అంది చారు. "మరలాగైతే సంపాదకులు నన్ను పీక్కుతినేస్తారు." "నేనే ఊరుకుంటానని గాబోలు నీ ఉద్దేశం." ఫలితం తేలింది—పత్రిక్కి సంపాదకు లిద్దరు; రచయిత లిద్దరు; పాఠకులు కూడా ఇద్దరే!

కమిటీ కూర్చుంది. "పత్రిక పేరు 'చారు పాఠము' అని వుండాలి" అన్నాడు అమల్. "అక్కర్లేదు 'అమలా' అంటే చాలా బాగుంటుంది" అంది చారు. హస్తలిఖిత పత్రిక నడవ నారంభించింది. ఈ గొడవల్లో చారు తన మనస్సులో నున్న క్షోభ, దుఃఖమూ అంతా మర్చిపోగలిగింది. 'అమలా'లో మందాకిని కే విధమైన స్థానమూ లేదు. బయటివాళ్ళకు ప్రవేశించే అర్హత అసలే లేదు.

* * *

## 7

ఓ నాడు భూపతి చారుతో అన్నాడు కదా – "నువ్వు రచయిత్రి వవుతావని నేను కలలోకూడా అనుకోలేదు చారు."

ఆమె త్రుళ్ళిపడింది. సిగ్గుతో ఆమె మొహం ఎర్రబడింది. "నేను రచయిత్రినా? మీతో ఎవరన్నారు? అంతా అబద్ధం" అందామె. "దాచినందువల్ల ప్రయోజనంలేదు. ప్రత్యక్షంగా సాక్ష్యం ఇక్కడేవుంది" అంటూ 'సరోరుహం' ఆమె చేతికం దిచ్చాడు. చూచింది. దేన్నయితే తనొక గుప్తమైన సంప త్తిగా తలుస్తూవచ్చిందో, దేన్నయితే తన 'అమలా'లో చూస్తుండేదో, అదే ఇప్పుడు 'సరోరుహం'లో ప్రచురింప బడింది.

ఎన్నాళ్ళనుండో ప్రేమతో పెంచుకుంటూ వచ్చిన చిలక, పంజరంనుండి ఎగిరిపోయినట్టనిపించింది చారుకి. భూపతి దగ్గర తన దొంగతనం బయటపడిపోయినందుకు సిగ్గుపడటం మర్చి, తనతో విశ్వాసఘాతం చేసిన అమల్ మీద ఎక్కడలేని కోపమూ వచ్చింది. "దీన్నికూడాచూడు" అంటూ భూపతి 'విశ్వబంధు' అనే మరోపత్రిక చారు కిచ్చాడు. అందులో 'ఆధునిక వంగభాష' అనే శీర్షికతో ఓ వ్యాసముంది. "ఇదెం దుకు?" అంది చారు. "చదువు, నీకే తెలుస్తుంది" అన్నాడు భూపతి.

అతనిమాటను కాదనలేక చదివింది. అందులో కొంత మంది ఆధునిక రచయితల్ని విమర్శకుడు తీవ్రంగా విమర్శిం చాడు. అమల్, మన్మథదత్తులను మరీ ఘోరంగా విమర్శిం చాడు. వీళ్ళ రచనాశైలినీ, చారు శైలినీ త్రాసులో నుంచాడు. చారుయొక్క కృత్రిమంలేని భాషనీ, సరళత్వాన్నీ, సహజంగా చిత్రించే ఘట్టాల్నీ కథలోని టెంపోనీ బాగా

ప్రశంసించాడు. ఇంకా అమల్, మన్మథదత్తులాంటి రచయితలు, చారువంటి రచయిత్రి అడుగుజాడల్లో వెడితే, వాళ్లు సాహిత్యరంగంలో కొంచెం ముందుకు వచ్చే సూచనలున్నాయనీ, లేకపోతే ఇహ కలంనుండి సన్యాసం పుచ్చుకుంటే చాలా మంచిదన్నాడు విమర్శకుడు.

"నువ్వు గురువునే మించావు చారు! చాలా సంతోషం. ఇంకా రాస్తూండు" అన్నాడు భూపతి ఆమెను ప్రోత్సహించాలనే ఉద్దేశంతో. భర్త తన రచనల్ని పొగుడుతూంటే అతన్ని తృప్తిపర్చటానికన్నా, సంతోషం తెచ్చుకోవాలని ప్రయత్నించిందిగాని, అలా చెయ్యలేకపోయింది.

తనకు తెలీకుండా తన రచన ప్రచురింపజేసి, గుప్‌చుప్‌గా తనకు చూపిస్తాడని అమల్ అనుకున్నాడేమో! మళ్ళీ దానిమీద బయల్దేరిన విమర్శ, ఈ రెండూ ఒక్కసారి హఠాత్తుగా తనకి చూపించి ఆశ్చర్యసాగరంలో ముంచేద్దామని అమల్ ఊహించివుంటాడు. ఆమె రచన పత్రికలో పడితే ఆమెకు కోపం వస్తుందని అమల్‌కి తెలుసు. కాని, ఆ రెండూ ఒకేసారి చూపిస్తే ఆమె శాంతిస్తుందని అనుకున్నాడు గాబోలు. మరి, అమల్ మనస్సులో ఇవే భావాలుంటే తను స్వయంగా వచ్చి ఎందుకు చూపించకూడదూ!

తన విషయమై రాసిన విమర్శ చూసివుంటాడు. దాంతో అమల్ హృదయం గాయపడిందేమో! ఆ కారణంచేత వాట్ని తనకి చూపించటానికి కష్టంతోచేమో! అందుకే అమల్ మొహం ఇంతవరకు కనబడలేదేమో! ఆత్మసంతృప్తికోసం, చారు

ఏకాంతంలో నిర్మిస్తూన్న సాహిత్యమందిరం 'ప్రశంస' అనే వడగళ్లు - కాదు - పిడుగులుపడి దాన్ని ధ్వంసంచేశాయి. ఈ ఘటన చారుకి ఏమాత్రమూ తృప్తిపర్చలేకపోయింది.

  

భూపతి వెళ్ళిపోయింతర్వాత, చారు తన గదిలోకివెళ్లి కూర్చుంది. ఎదుట 'సరోరుహాం' 'విశ్వబంధు'లోని వ్యాసాలు తనని వెక్కిరిస్తున్నాయి. పుస్తకంపట్టుకుని అమల్ మెల్లిగా చారువెనక నిలబడ్డాడు. చిన్నగమ్మత్తు చెయ్యాలనుకున్నాడు. కాని, ఎదుటనున్న 'విశ్వబంధు' అమల్ని వెక్కిరించినట్లని పించింది. మళ్లీ గుప్చుప్గా వెనక్కితిరిగి వెళ్ళిపోయాడు.

విమర్శకుడు తనని ఘోరంగా విమర్శించి, చారుని గొప్పగా పొగిడాడు. అందుకే చారు తన్మయంచెందిందేమో ననుకున్నాడు. మరుక్షణంలోనే అతనిలోని భావాలు విపాక్తమైనయ్. ఒకమూర్ఖుని విమర్శనుచూసి గురువునే మించిపోయి నట్లు భావించి చారు పొంగిపోతోంది. ఛీ! ఛీ! అమల్కి కోపం వచ్చింది.

న్యాయంగా చారు ఆ విమర్శను కాల్చిపారెయ్యాల్సింది. మందాకిని గదికివెళ్లాడు. "రావోయ్ అమల్, ఈవేళ ఇలా దయచేశావేం?" అంటూ ద్వారందగ్గరకు వచ్చింది మందాకిని. "నీకు తీరిగ్గావుంటే ఒకటిరెండు కథల్ని చదివి విని పిస్తా"నంటూ చదవసాగాడు. అతను చదివిందంతా మందాకినికి ఓ విదేశీయభాషలా తోచినా, అతన్ని తృప్తిపర్చటానికి మాత్రం మొహంలో సంతోషం కనబరుస్తూ వింటోంది.

ఈలోగా ద్వారందగ్గర మందాకినికి నీడలా కనిపించింది. పోల్చింది. కాని మందాకిని అటుచూడకుండా మళ్ళీ విన సాగింది. వెంటనే చారు అక్కడనుండి కదలింది. అమల్ వస్తే 'విశ్వబంధు' విమర్శకుని నాలుగుతిట్టి తనరచన 'సరోరుహం'లో ప్రచురింపించినందుకు, అమల్ ని బాగా చీవాట్లు పెట్టాలనుకుంది చారు. ఇంతవరకు అతనిరాకకోసం ఎదురుచూచింది. ఓ కథ కూడా రాసింది. చదివి వినిపించాలనుకుంది. కాని, ఈ దృశ్యం చూడగానే ఆమెమనస్సు చివుక్కుమంది. కోపంతోవచ్చి గది తలుపులు మూసేసింది.

చారు వచ్చినట్టు మందాకిని చెప్పింది. "ఏమిటి పెంకి తనం? నేనామెకు గులామునా ఏమిటి? ఆమెకుతప్ప మరెవ్వరికీ నేను కథలు వినిపించకూడదా" అనుకుంటూ మళ్ళీ చదవ సాగాడు. చదవటం పూర్తికాగానే చారుగదికి ఎదురుగుండానే నడిచివెళ్లాడు. ఆమె గదితలుపులు మూయబడివుంటం గమ నించాడు. అమల్ వెళ్ళిపోవటం చారుకూడా గమనించింది; అతనిజోళ్ళ 'టక టక'వల్ల. ఓ నిమిషమన్నా తనకోసం ఆగ లేదు. చారుకు కోపం, దుఃఖం రెండూవచ్చాయి. ఆ కోపంతో పుస్తకంతీసి ఒక్కొక్క పేజీ తీసి ముక్కముక్కలుగా చింపిపారే సింది. ఛీ! ఎటువంటి పాడుముహూర్తంలో తను రాయనారం భించిందో!

* * *

## 8

సంధ్యాసమయం. **Night queen** సువాసన నాసికా రంధ్రాల్లోనుండి మస్తిష్కంలోకే ప్రవేశించి, మత్తుని కలిగి

స్తోంది. ఆకాశంలో నక్షత్రాలు, మేఘాల్తో దోబూచు లాడు తున్నయ్. చారు తలదువ్వుకోకుండా, బట్టలైనా మార్చుకో కుండా, కిటికీ దగ్గర అలానే కూర్చుంది. ఆమె కళ్లు మెరు స్తున్నయ్. కారణం ఆమెకే తెలీకుండావున్నది. ఇదేసమయం లో భూపతి ఖిన్నవదనంతో అక్కడికి ప్రవేశించాడు. గదిలో యేవిధమైన వెల్తురూలేదు. అలికిడిలేకుండా చారు వెనక్కెళ్ళి భూపతి నిలబడ్డాడు. తనొచ్చాడని తెలిసినా, చారు అటువైపు మొహం తిప్పలేదు. భూపతి కొంచెం ఆశ్చర్యముతో— 'చారు' అని పిల్చాడు. భూపతి స్వరంవిని తొట్రుపాటుతో వెనక్కి తిరిగిచూచింది. అమల్ వచ్చాడేమో ననుకొంది. అందుకే భూపతిని చూడగానే ఆశ్చర్యపోయింది.

"ఈ చీకటిలో కూర్చుని ఏం చేస్తున్నావు చారు?" అన్నాడు భూపతి చారుముఖంలోనికి చూస్తూ.

చారు తయారుచేసిన 'ప్రోగ్రాం'లో ఒక్కటయినా పూర్తికాలేదు. అమల్‌వచ్చి క్షమించమని కోరుతాడేమోనని అనుకుంది. భూపతి ప్రశ్నకు ఏవిధంగా జవాబివ్వాలో ఆమె కేమీ తోచిందికాదు. ఆఖరికి అతని భుజంమీదపడి బావురుమంది.

"ఏం చారు! యేమయిందేం?" భూపతి గాభరాపడుతూ అడిగాడు. జవాబుకోసం చారు తడుముకుంది.

ఊఁ హూఁ!...అసలు కారణముంటేగా!

"చారూ, చెప్పవేం? నేను నీ కేమన్నా అన్యాయం చేశానా?" మళ్ళీ అమాయకంగా ప్రశ్నించాడు.

చారుకి జవాబు తోచక ఊరుకొంది గాని, ఏడుపు మాత్రం ఆగలేదు.

"సరే, ఈసారి పత్రికకోసం తక్కువ సమయం విని యోగించి, తక్కిన సమయమంతా నీతోనే గడుపుతా. ఇహ నుండి నీకోరికలన్నీ పూర్తవుతాయి."

ఏడుపు ఆపకుండానే—"అందుకోసం కాదండి" అంది చారు.

"మరి దేనికోసం?" అంటూ మంచంపై కూర్చున్నాడు.

"ఇప్పుడు చెప్పలేనండి, రాత్రికి చెపుతా."

"సరే" నంటూ భూపతి గది విడిచాడు.

*　　　*　　　*

రాత్రి సమయం. భూపతికి చారు స్వయంగానే వడ్డిం చింది. అతను భోంచేస్తుంటే చారు విసురుతోంది.

ఇంతలో "బిర్జూ, బిర్జూ" అంటూ నౌకరు కుర్రాణ్ణి మందాకిని పిలుస్తున్న స్వరం వినిపించింది.

"అమల్ బాబు భోంచేశాడా?"

అవునని జవాబిచ్చాడు బిర్జూ.

"భోంచేస్తే కిళ్ళీలు తీసుకెళ్ళి ఇవ్వడం తెలీదట్రా?" అంతటితో మందాకిని ఆగిపోయింది.

అంతా వింది చారు. భూపతి ఎదుట తను సంతోషంగా వుంటుందనీ, అతనితో సర్దాగా కబుర్లాడుతుందనీ, అనుకుంది చారు. అసలు ఏమిటేమిటి మాటాడాలో అని ముందే ఆలో

చించుకోంది కాని, మందాకిని మాటల్ని విన్నతర్వాత ఆమె స్కీమంతా ఎగిరిపోయింది.

భూపతి ఎదుట ఆమె యేవిధంగానూ సంతోషంగా వుండలేకపోయింది. భూపతికూడ అదోలా వున్నాడు.

"మీరేం తిన్నట్లు కనపడలేదు." అంది చారు.

"ఆఁ! తింటున్నాగా!" అన్నాడు భూపతి అన్యమనస్కంగా.

భోజనం అయిపోగానే, భూపతి తన పడకగదిలోనికి ప్రవేశించాడు.

"రాత్రికేదో చెప్తానన్నావు గదూ!" అంటూ భూపతి చారుకి జ్ఞాపకం చేశాడు.

"ఆఁ! ఏమీలేదు. కొన్నాళ్ళనుండి మందాకిని ప్రవర్తన నాకేమి నచ్చలేదు. ఆమెనిక్కడ వుంచడానికి మనస్కరించకుండా వుంది" అంది చారు.

"ఏమయిందేం?"

అమల్‌తో ఆమె ప్రవర్తనచూస్తే నాకే సిగ్గుగావుంది.

"చారు! నీకు పిచ్చెత్తిం దనుకుంటా. అమల్ యింకా కుర్రాడు. పసితనం. వట్టి అమాయకుడు."

"మీ కసలు యింటిమీద ధ్యానముంటేగా! మీ కెప్పుడూ పత్రికగొడవే. పాపం ఉమాపదబాబుని చూస్తే నాకు జాలివేస్తుంది. అతనెప్పుడు భోంచేస్తున్నాడో లేదో; యేం చేస్తున్నాడో యేమిటో మందాకిని కవసరమే లేదు. అమల్ విషయమైమాత్రం ప్రత్యేకశ్రద్ధ చూపిస్తుంది. అతన్ని వెనకేసుకొని నౌకర్లనుకూడా బాగా దులిపేస్తుంది.

"అబ్బా! ఆడజాతికి మహా అనుమానం సుమీ."

"సరేనండి – మీరు చెప్పింది బాగానేవుంది గాని నా యింట్లో యిటువంటి సిగ్గుమాలిన పనికి నేనొప్పుకోను." అంది చారు కోపంగా. చారుయొక్క అమాయకత్వానికి భూపతి లోలోన నవ్వుకున్నాడు. ఇల్లు పవిత్రంగా వుండాలి. అవినీతి కరమైన పనులు యింట్లో జరక్కూడదు. ఇవన్నివిని, తనలో సంతోషించాడు.

"ఈ విషయంలో మరేమీ గడబిడ చేయనవసరంలేదు. మైమన్‌సింగులో వకాల్తా వెలిగించడానికి ఉమాపదుడు వెళ్తానంటున్నాడు. మందాకినినికూడా తనతో తీసుకెళ్తాట." అంటూ భూపతి చారుని ముద్దెట్టుకున్నాడు. క్షణంసేపు గదంతా నిశ్శబ్దం. టేబిల్‌మీదినుండి భూపతి పుస్తకంతీసుకొని—"చారు! నీకథ చదివి వినిపించకూడదూ!" అన్నాడు.

భూపతి చేతినుండి పుస్తకం లాక్కుంటూ "మీకు నచ్చదేమో లేక, విని నవ్వుతారేమో"నంది చారు. భూపతికి కొంచెం ఇదయింది. "నేను నవ్వనులే, శ్రద్ధగా వింటాను," అన్నాడు. చారు ఒప్పుకోలేదు. చూస్తూండగానే పుస్తకం మాయమయింది.

* * *

## 9

భూపతి తన సంగతంతా చారుతో చెప్పలేక పోయాడు. ఉమాపదుడు పత్రికకు, మేనేజరు కూడానూ.

చందాలు వసూలు చేయడు. ప్రెస్‌లోని సూపర్‌వైజింగు, బజారులో చిల్లరపనులు, 'స్టాఫ్'కి జీతాలు యివ్వడు, ఇవన్నీ అతనిమీాదే భారంవుంది. ఈలోగా భూపతికి కాగితాలవర్తకుని యొక్క వకీలు దగ్గరనుండి వచ్చిన నోటీసు చూడగానే ఆశ్చర్య పోయాడు. అందులో కాగితాల బాపతు 2,700 రూ॥లు బాకీ కనబడుతోంది. ఉమాపదునిపిలిచి భూపతి అడిగాడు–"ఇదేమిటి గొడవ? ఈడబ్బు నీకు ఇచ్చేశానుగా! ఒకవేళ బాకీవున్నా నాలుగయిదు వందలకన్నా ఎక్కువుండకూడదు." "వాళ్లేదో పొరపాటు చేసివుంటారు" అన్నాడు ఉమాపదుడు.

దొంగతనం దాచినా దాగదు. కొన్నాళ్లు ఉమాపదుడు యిలాగే భూపతిని మోసగిస్తూవచ్చాడు. కాగితాల విషయమే కాకుండా, బజార్లోకూడా భూపతిపేర్న చాలావరకు బాకీలు పెంచాడు. తన ఊళ్లో తనకోసం ఓ స్వంతయిల్లు కట్టించు కున్నాడు. దానికి కావల్సిన సామగ్రంతా భూపతి పేరునే తెప్పిం చాడు. తక్కింది కాగితాల బాపతునుండి 'మేకప్' చేశాడు.

దొంగతనం పట్టుబడింతరువాత, బిత్తరిచూపుల్తో ఉమా పదుడు జవాబిచ్చాడు. "నేనేం పారిపోలేదుగా. మెల్లిగా నీ బాకీ తీర్చేస్తానులే. నీది ఒక్కదమ్మిడీ అయినా, నామీాద ఉండిపోతే నాపేరు ఉమాపదుడు కాదు." తనకి డబ్బు నష్ట మైందికదా అని భూపతి విచారించలేదు గాని, ఉమాపదుడు తనతో విశ్వాసఘాతం చేశాడుకదా అనే సంగతి, అతని హృద యాన్ని గాయపర్చింది. అతనికేమీా పాలుపోక, అలా కుర్చీలో కూలబడి పోయాడు.

* * * *

ఆవేళే చారుదగ్గరకు భూపతి వెళ్లాడు. ఏమీ ఊసుపోక చారుకూడా అన్యమనస్కంగా, కిటికీదగ్గర చీకటి గదిలో కూర్చుంది. ఉమాపదుడు రెండోరోజునే మైమన్‌సింగ్ వెళ్లిపోడానికి తయారుగా వున్నాడు. బజారులో ఎవరికయితే బాకీలివ్వాలో, ఆవార్త తెలీగానే, వాళ్ళకి డబ్బు జమకట్టేముందే అక్కడినుండి జారిపోవాలనుకున్నాడు. ఉమాపదుడంటే, భూపతికి ఓ విధమైన ఏహ్యాభావం కలిగింది. అందుకే అతనితో ఏమీ అనలేదు. అసలతనితో మాట్లాట్టానికే యిష్టంలేకపోయింది. అతని మౌనం, ఉమాపదునికి సంతోష కారణమైంది.

ఇంతలోనే అమల్ మందాకిని నడిగాడు–"ఏం వదినా, యిదంతా ఏమిటి? సామానంతా కట్టేస్తున్నావేం?"

"వెళ్లాలబ్బా! వెళ్లక తప్పదు. పరాయి యింట్లో ఎంత కాలమని వుండమన్నావ్?"

"ఎక్కడికి వెళ్తారేమిటి?"

"మా స్వగ్రామానికి".

"ఏం?"

"ఇక్కడేమన్నా అసౌకర్యంగా వుందా?"

"లేదే, అలాంటిదేమీ లేదుగాని తక్కిన వాళ్ళకి అసౌకర్యంగా వుంది" యేమీ జవాబివ్వలేదు ఆమె.

ఛీ! ఛీ! ఎంతసిగ్గు! భూపతిబాబు యేమనుకున్నాడో! ఈ సంభాషణతో, వీళ్లు వెళ్ళడానికి చారే కారణమని అమల్ గ్రహించాడు. అమల్ బయట రోడ్డుమీద పచార్లుచేయనారంభించాడు.

మరి యింటికి తిరిగి వెళ్ళకూడదనుకున్నాడు. భూపతి బాబు, చారుమాటల్ని విశ్వసించి, మందాకినిని ఎలా వెళ్ళగొట్టారో, అలాగే తనుకూడా వెళ్ళగొట్టబడకముందే, తనే స్వయంగా తప్పుకుంటే మంచిది.

ఆమాత్రం చాలు. అమల్ తన కర్తవ్యాన్ని నిశ్చయించుకున్నాడు. భూపతి తనగదిలో, తన స్థితంతా తల్చుకొని ముందుకర్తవ్యం తీవ్రంగా ఆలోచించసాగాడు. అప్పుడే అమల్ గదిలోకి ప్రవేశించాడు. రాగానే భూపతి పలకరించాడు.

"ఏం అమల్! సంగతేమిటి?" అమల్ అలా తొందరగా రాగానే యేదన్నా, అనిష్టం జరిగిందేమోనని, భూపతి, అనుమానించాడు.

"అన్నయ్యా! యే కారణంచేతనైనా నామీద మీకు సందేహం కలిగిందా?" అని ఆత్రుతతో అమల్ ప్రశ్నించాడు.

"నిన్ను సందేహించడమా!" ఆశ్చర్యపోయాడు భూపతి. కాని, ఓ నిముసం తరువాత భూపతి అనుకున్నాడు. 'ప్రపంచం యొక్క కాలగతినిబట్టి, అమల్నికూడా ఒకానొకనాడు, అనుమానించడంలో అతిశయోక్తిలేదు.'

"నామీద వదిన యేమన్నా నేరారోపణ చేసిందా?"

"నీకు పిచ్చిగాని పట్టలేదుకదా?" అన్నాడు పెదాల మీద చిరునవ్వు తెచ్చుకుంటూ.

"ఉద్యోగ ప్రయత్నంమీద నేనెక్కడికైనా వెళ్ళాలి."

"రోజురోజుకీ చిన్నపిల్లవాడిలా మాట్లాడుతావేం అమల్? ఇంకా చదువుకో. ఉద్యోగం సంగతి తర్వాత చూద్దాము" అమల్ గదివిడిచాడు. భూపతి నిట్టూర్చాడు.

# 10

చారుతో గట్టిగా ఓసారి దెబ్బలాడా లనుకున్నాడు అమల్. ఈ విషయంలో ఏదో ఒకటి తెలిస్తే నేగాని, లాభం లేదనుకున్నాడు. మందాకిని వెళ్ళిపోయింతరవాత అమల్ ని పిలిపించి అతనికోపాన్ని శాంతింపజేయాలనుకుంది చారు. ఓ కథరాసి దాన్ని చూపించే నెపాన అమల్ ని పిలిపించాలనుకుంది! అమల్ రాసిన కథకు ఆధారంగా ఇంకోకథ "అమావాస్య" అనే శీర్షికతో రాయ నారంభించింది. అవతల భూపతి, తన అప్పులనుండి విముక్తి పొందడానికి తనమిత్రుడు మోతీలాలు దగ్గరకు వెళ్ళాడు. మోతీలాలుదగ్గరకు భూపతి అప్పుకోసం వెళ్ళ లేదు. మోతీలాలుకి కష్టసమయంలో, భూపతి ఓసారి కొన్ని వేలు అప్పిచ్చాడు. భూపతి వెళ్ళేసరికి మోతీలాలు అప్పుడే స్నానంచేసి పంకాకింద కూర్చున్నాడు! ఆవేళ వేడి చాలా జోరుగావుంది.

భూపతిని చూడగానే మోతీలాలు — "రానోయ్! మిత్రమా, బహుకాల దర్శనంబు, ఈ మధ్య ఎక్కడా కని పించడం మానేశావ్. ఏమిటిలా దారిమర్చిపోయి వచ్చావల్లే వుంది," అన్నాడు ఎంతో అప్యాయముగా. భూపతి తను వచ్చినసంగతి చెబుతూ, డబ్బుసంగతి జ్ఞాపకం చేశాడు. కొంతసేపు బాగా ఆలోచించి మోతిలాల్ "ఏంరూపాయలు? ఈ మధ్యను నేనెప్పుడూ నీదగ్గరేమీ తీసుకోలేదు!" అన్నాడు. భూపతి, సంవత్సరం తేదీఅంతా చెప్పాడు. ఓ, చాలారోజు

లయింది. దాని గడువుకూడా తీరిపోయింది. మరి...అంటూ సణగడం ఆరంభించాడు.

భూపతిదృష్టిలో ప్రపంచమంతా మారిపోయినట్టనిపించింది. ప్రపంచంయొక్క ఏ అంగంనుండి ముసుగు జారిపోయిందో, అటువైపు చూడగానే భూపతికి శరీరం గగుర్పొడిచింది. వర్షాకాలపు నదిలో స్నానం చేయడానికి ఏ వ్యక్తి దిగుతాడు. హఠాత్తుగా పెద్దకెరటాలు రాగానే, ఎటువేపయితే ఎత్తయిన ప్రదేశం వుంటుందో, అటువైపే పరుగెడతాడు. అలాగే భూపతికూడా, మోతీలాలు మాటవినగానే త్వరగా అడుగులు వేసుకుంటూ చారుదగ్గరకు చేరుకున్నాడు. 'తక్కిన వాళ్లు ఎలావున్నా లేకపోయినా, చారుమాత్రం తనని మోసగించదు అనుకున్నాడు తనలో.

భూపతి గదిలో ప్రవేశించేసరికి చారు ఏకాగ్రచిత్తంతో 'అమావాస్య' రాయడంలో లీనమైవుంది. భూపతి తనవెనక నిలబడివున్నాడనేసంగతి ఆమెకు తెలీనేలేదు. అతని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఆమె మెడను తాకగానే తెలివివచ్చింది. వెంటనే రాస్తున్న పుస్తకాన్ని తలగడకింద దాచేసింది. మనస్సులో యేదన్నా బాధగా వున్నప్పుడు, ఇంకోదెబ్బ తగిలితే బాధ ద్విగుణీకృత మవుతుంది. అదేవిధంగా, చారు పుస్తకాన్ని దాచగానే భూపతికి మరింత కష్టమనిపించింది. మెల్లిగా చారు ప్రక్కన మంచంమీాద కూర్చున్నాడు. హఠాత్తుగా తన రచనా ప్రవాహానికి అడ్డుతగిలినందుకు, చారుకి యేం మాట్లాడ్డానికి తోచిందికాదు.

మనస్సులో ఇంత బాధగా వున్నప్పుడు, కనీసం, "ఏం, అలావున్నారు? మీకేమన్నా కష్టంగా వుందా? మొహమలా వాడిపోయి వుందేం? సంగతేమిటి?" అని చారు అడిగి కాస్త సానుభూతి చూపిస్తే ఎంత బావుణ్ణు! ఉష్. ఈవేళ గృహలక్ష్మి తన హృదయవేదన తగ్గించలేకపోయింది. గదంతా నిశ్శబ్దంగా వుంది. కాలం ఇంత ఆలస్యంగా ఎందుకు వెడుతోందా, అన్నట్టుగా వుంది. ఇదేసమయంలో అమల్ కొన్ని ఘాటైన శబ్దాల భండారంతో, చారు గదివైపు చరచరా వస్తున్నాడు. భూపతి ఏవిధమైన, మాటామంతీలేకుండా, నిశ్శబ్దంగా వస్తుండే దారిలో అమల్‌ని కలుసుకున్నాడు. అతని ఖిన్నవదనాన్ని చూసి, గాభరాపడుతూ అమల్ ప్రశ్నించాడు—"ఏం, అన్నయ్యా! అలావున్నారేం? ఒంట్లో బాగాలేదా?"

ఇంతసేపటికి, భూపతికి కాస్త సానుభూతి దొరికింది. హృదయంలోని భారం కొంచెం తేలికైనట్టనిపించింది. నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ కొన్ని సెకండ్ల తరవాత భూపతిగొంతు వినిపించింది, "లేదబ్బాయ్! బాగానేవున్నాను. ఈనెల నీ కథేం రాలేదా?" చారుకి వినిపించడానికి తయారుచేసిన ఘాటైన శబ్దబాణాలు, అమల్ మస్తిష్కంనుండి, ఎప్పుడు మాయ మయాయో తెలీదు. వెంటనే చారు దగ్గరకువెళ్ళి, గట్టిగా అడిగాడు—"వదినా. అన్నయ్యకేమయిందో త్వరగాచెప్పు."

"నాకూ్కడా ఏమీ బోధపడకుండా వుంది. బహుశః ఏదన్నాపత్రిక, ఇతని పత్రికని విమర్శించిందేమో?"

అమల్ తల ఊపాడు, 'అలాగా' అన్నట్టుగా. పిలవ

కుండానే అమల్ స్వయంగా, తనదగ్గరకువచ్చి మామూలు ధోరణిలోనే సంభాషణ సాగించినందుకు, చారుమనస్సు కొంచెం కుదుటబడింది. వెంటనే తనురాస్తున్న 'అమావాస్య' చూపిస్తూ—"ఇదిగో, ఇప్పుడే 'అమావాస్య' రాస్తుంటే, మీ అన్నయ్య, వచ్చారు. వెంటనే నేను దాచేశాను. లేకపోతే వారు చూసేవారే," అంది. తనకథపట్ల అమల్ ఎంతో ఔత్సుక్యం చూపిస్తాడేమో ననుకుంది. కొన్ని సెకండ్లవరకూ చారుని అమల్ తీవ్రంగా చూశాడు. ఏమనుకున్నాడో ఏమిటో తెలియదు. మరేమీ జవాబివ్వకుండా – బయటికి నడిచాడు. అమల్ ప్రవర్తన చారుకేమీ బోధపడలేదు. పాపం! చారు!

*　　　*　　　*

# 11

రెండోరోజు భూపతి, తనగదికి చారుని పిలిపించాడు. చారు రాగానే భూపతి అన్నాడు—"అమల్‌కోసం ఓ పెళ్ళి సంబంధం వచ్చింది." చారు కసలు ఇటువైపు ధ్యానమేలేదు. అతనిమాటలు వినిపించుకోకుండా, "ఏమిటి వచ్చింది." అని అడిగింది. "పెళ్ళి సంబంధం వచ్చింది" అన్నాడు భూపతి... "ఏం? నేను మీకు నచ్చలేదా? నేను మరి మీకు పనికిరానా? అయినా ఇప్పుడు మీరు మళ్ళీ పెళ్ళిచేసుకునేంత అవసర మేమొచ్చింది?" "పిచ్చిపిల్లా! నాపెళ్ళి కాదోయి, నా పెళ్ళ యితే నీ కిలా చెప్పడానికి వస్తానా? అమల్‌కోసం పెళ్ళి సంబంధం వచ్చిందంటున్నా" "మ రలాచెప్ప రేం? అయితే

మరి ఆలస్యం దేనికి? "బర్ధవాన్‌లోనున్న వకీలు రఘునాథబాబు, తనకూతుర్ని అమల్‌కిచ్చి ఇంకా చదువు కోవడానికి ఇంగ్లండు పంపిస్తాట్ట."

"ఓ! అలాగా? అమల్ని కనుక్కున్నారా?" "ఓసారి, నువ్వేఅడిగి తెల్సుకోరాదూ?" "నేను వెయ్యిసార్లు చెప్పాను పెళ్ళి చేసుకోమని; మరి నామాట వింటేగా! అందుకే నేను మరేమీ చెప్పదలుచుకోలేదు." "ఈసారిమాత్రం యీ సంబంధం పోకూడదు. నాకు అప్పులబత్తిడి చాలా జోరుగా వుంది. అందుకని మరి మునుపటిలాగ, అమల్‌కు నేనేవిధం గానూ, సహాయము చేయలేను."

అమల్‌ని పిలిపించాడు భూపతి. అతనురాగానే అన్నాడు—"అమల్, బర్ధవాన్ కాపురస్తులైన, రఘునాథ బాబు తనకూతుర్ని నీతో వివాహం చేయడానికి సిద్ధంగా నున్నాడు. పెళ్ళయిన తరువాత, నిన్ను ఇంకా చదువుకో డానికి ఇంగ్లండుపంపిస్తాట్ట. నీఉద్దేశమేమిటి?" "మీకిష్టమయితే నా తరఫునుండి ఆటంక మేమీలేదు" అన్నాడు అమల్. అమల్ జవాబు వినగానే భూపతి, చారూ ఇద్దరూ ఆశ్చర్య పోయారు. ఈవిధంగా పెళ్ళికి ఒప్పుకుంటాడని వాళ్లు కలలో నయినా అనుకోలేదు. "అయితే ఈ సంబంధం స్థిరపర్చ మన్నావా?" అన్నాడు భూపతి. "అవు"నన్నట్టుగా అమల్ తలఊపాడు.

"పిల్లని చూడాలనిగాని నీకు ఉద్దేశం వుంటే, దాని క్కూడా బందోబస్తు చేశాను. కాని, పిల్ల అందంగానే వుంటుం

దని నేను తెలుసుకున్నాను" అన్నాడు భూపతి. "లేదులెండి, నేను చూడనవసరం లేదు." "అదంతా పనికిరాదండోయ్! పిల్లను చూడకుండానే పెళ్ళి ఎలా అవుతుంది? ఇదిగో అమల్ చెబుతున్నాను. నీకు చూట్టాని కిష్టంలేకపోతే నేను చూస్తాను. తెలిసిందా?" అంది చారు. "అన్నయ్యా, అలావద్దు. ఈ మాత్రం స్వల్పవిషయం కోసం, ఆలస్యం చేయడం అనవసర మని నా ఉద్దేశం."

"అవునులే, అదీ నిజమే. మరి త్వరగా వెళ్ళి పెళ్ళిచేసుకుని రా. లేకపోతే ఇంకెవరైనా ఎత్తుకొనిపోగలరు!" అంది చారు వ్యంగ్యంగా. చారుయొక్క వ్యంగ్యోక్తులు అమల్‌ని ఏమాత్రం చకితుణ్ణి చేయలేకపోయినయ్. "ఓ, త్వరగా ఇంగ్లండు వెళ్ళిపోవాలని తొందరగా వుంది. అంతేకదూ? ఏమయ్యా, మేంఇక్కడ నిన్ను కొట్టామా, ఖైదులోపెట్టామా, హాట్ కోటు వేసుకొని, దొరవేషం వేయందిగాని ఇప్పటి కుర్రాళ్ళకు నిమిషం గడవదు. బాబూ, ఇంగ్లండునుండి తిరిగి వచ్చింతరవాత మాలాంటి నల్లమనుష్యుల్ని పోలుస్తావో లేదో!" అంది చారు.

"ఇంగ్లండు నేనేం చేయడానికి వెళ్ళాలి?" అన్నాడు అమల్. "అవునుమరి, నల్లనిరూపంపోవాలనే ఏడుసముద్రాలు దాటివెళ్ళారు. కాని భయమెందుకు చారు? మన మున్నాంగా! మరి నల్లని రూపాలకు భక్తుల లోటు వుండదు" అన్నాడు భూపతి నవ్వుకుంటూ. సంతోషంతో భూపతి వెంటనే బర్ద

వాన్‌కి పెళ్ళిసంబంధం నిశ్చయించుకుని వుత్తరం రాశాడు. వివాహ ముహూర్తంకూడా నిర్ణయమయిపోయింది.

*     *     *     *

# 12

ఈ లోగా భూపతికి పత్రికను ఆపు చేయాల్సిన పరిస్థితులు ఏర్పడ్డాయి. పత్రిక్కి. అయే ఖర్చులకు భూపతి తాళుకోలేక పోతున్నాడు. మనస్సులో అనేకవిధమైనభావాల్తో, భూపతి పిచ్చెత్తినట్టయిపోయాడు. సానుభూతిని వెదుకుతూ చారుదగ్గరకు వెళ్ళాడు. ఆ సమయానికి చారు ఆలోచిస్తూ కూర్చుంది. ఎంత ఆశ్చర్యం! అమల్‌కి పెళ్ళవుతుంది. సరే బాగానేవుంది. కాని ఇన్నాళ్లు వాళ్ళతోవుండి, పరాయింటి పిల్లలను పెళ్ళిచేసుకొని, ఇంగ్లండు వెళ్ళిపోతాడు. ఇంత స్వార్థమా! ఇన్నాళ్లు తనఇంట్లోవుంచి, ఆదరించి, ఆశ్రయమిచ్చారు. అదైనా జ్ఞాపకంరాలేదో! కాని ఈవేళ కాస్త సందు దొరికిందో లేదో వెళ్ళిపోడానికి తయారైపోయాడు. నడుం కట్టుకుని మరీనూ! ఇదే అవకాశంకోసం తను వేచివున్నట్టు. అబ్బా! ఎంత తీయగా మాట్లాడేవాడు! ఎంతప్రేమ చూపించేవాడు! అవునవును, మానవ మనస్తత్వాన్ని పోల్చుకోవడం కష్టం. ఇంత చక్కగా కథలు రాస్తున్న వాడికి హృదయంలేదని ఎవరైనా అనుకుంటారా!

అమల్ రేపు వెళ్ళిపోతాడు, కాని ఈ మధ్యను ఎక్కడా కనబడలేదు. మనస్సుల్లో వున్న వైషమ్యాలు దూరమవడానికి

అవకాశమే దొరకలేదు. ప్రతీ నిమిషం అనుకుంటుంది. ఇకను అమలు వచ్చి తనని కల్సుకుంటాడనీ, క్షమాపణ వేడుకుంటాడనీ. గాని, లాభం లేకపోయింది. ఆఖరికి అమల్ వెళ్ళిపోయే సమయం దగ్గిరికి వచ్చేసరికి, అమల్‌ని రమ్మని పిలిపించింది. కాస్సేపట్లో వస్తానని అమల్ జవాబు పంపించాడు.

అమల్ వస్తాడని, చారు చాలా సేపటివరకు చూసింది. కాని రాలేదు. ఆమెహృదయంలో అనేక రకమైన భావాలు స్థానమేర్పరచుకున్నాయ్.

దూరాన చర్చిగంటలు పదకొండు కొట్టాయ్. మరో అరగంటకూడా చూసింది. మరి కాస్సేపటికి భూపతి ప్రసన్న వదనంతో భోజనానికి వచ్చాడు. అమల్‌కూడా వున్నాడు తనతో. అమల్‌ని చారు చూడనైనాలేదు. అమల్ పలుకరించాడు—'వదినా, పిలిపించావా?' 'లేదు, ఇప్పుడవసరంలేదు' అంది. 'అయితే నేను వెళ్ళవచ్చా? ఇంకా నేను చాలామట్టుకు సామాన్లు సర్దుకోవాలి.' 'సరే' అంది చారు. ఒక్కసారి చారు మొహాన్ని ఎగాదిగా చూసి చరచరా నడిచిపోయాడు. భోంచేసిం తరువాత, భూపతికి చారుతో కాస్త పిచ్చాపాటీ మాట్లాడుతూ కూర్చోడం అలవాటు.

ఈవేళ తన మనస్సు బాగులేనందుకు, ఎక్కువసేపు చారుదగ్గర కూర్చోలేకపోయాడు 'చారు, ఈవేళ ఎక్కువసేపు నేను దగ్గర కూర్చోలేను. చాలా పనుంది' అన్నాడు భూపతి. చారు జవాబివ్వలేదు. ఆమెను మాట్లాడించాలనే ఉద్దేశంతో భూపతి 'అమల్ రేపు వెళ్లిపోతున్నాడు. నీకు మరివ్వూసుపోవడం

కష్టం' అన్నాడు. చారు యేమీ జవాబివ్వకుండా యేదో తెచ్చే నెపంతో ఇంకో గదిలోకి వెళ్ళింది.

ఆమె తిరిగివస్తుందేమోనని, భూపతి చూశాడు. కాని, ఆమె రాకపోవడం గమనించి, తనుకూడా అక్కడనుండి కదిలాడు. ఈ కొద్దిరోజుల్లోనే అమల్ చాలామట్టుకు చిక్కిపోయాడని చారు గ్రహించింది. అతని మొహంలో ముందు కళ ఇప్పుడు లేదు. దీంతో చారుకి కొంత సంతోషం, కొంత అసంతోషంకూడా కలిగింది. లోగడ అమల్ యొక్క ప్రవర్తన చారుకేమీ బోధపడలేదు. తనంటే అలా దూరంగా ఎందుకుంటున్నాడో తెలీకుండా వుంది. తను వెళ్ళిపోయే సమయం దగ్గరికి వచ్చినా, కాస్త కలిసిమెలిసి ఎందుకు తిరగకుండా వున్నాడో యేమిటో!

ఆమె లేచికూర్చుంది. హఠాత్తుగా మందాకిని జ్ఞప్తికి వచ్చింది. మందాకినిని అమల్ ప్రేమిస్తున్నాడేమో! అందుకే ఆమె వెళ్ళిపోయిన తరువాతనుండే అమల్ ఈ విధంగా నున్నాడు. ఛీ! ఛీ! అమల్ ఇంత నీచత్వానికి, ఒడిగట్టుకుంటాడా? ఇంత నీచుడా! వివాహితురాల్నా అమల్ కోరాడు! అసంభవం! చారు తన మనస్సులోని సందేహాన్ని నివృత్తి చేసుకోవాలనుకుంది. కాని, మరింతజోరుగా ఆమెహృదయంలో సందేహం పీడించసాగింది. ఇలాగే అమల్ వెళ్ళిపోయే సమయం దగ్గరకు వచ్చింది. అమల్ "వదినా, ఇహ నేను వెళ్ళాలి. టైమయిపోతోంది. అన్నయ్యని కాస్త కనిపెట్టుకొనివుండాలి. అతని మనస్సు యేమీ బాగాలేదు. నువు తప్ప అతనికి సానుభూతి కనబర్చే వా రెవరూ లేరు" అన్నాడు.

భూపతియొక్క విచారగ్రస్తమైన మొహంచూసి, అతను చికాకుల్లో నున్నాడని గ్రహించడానికి అమల్‌కి ఎక్కువ సమయం పట్టలేదు. ఇటువంటి పరిస్థితుల్లో ఎవరిని యేమన డానికైనా, అమల్ కిష్టం లేకపోయింది. చారు రాసిన కథలు జ్ఞప్తికివచ్చాయి! 'ఆషాఢ చంద్రుడు' 'అమావాస్య' గోదా వరిలో కలిసిపోతే నాకేం? అనుకున్నాడు అమల్ తనలో.

"నేను బారిష్టరయింతరవాత అన్నయ్యకి యేమన్నా సహాయం చేయగలిగితేనే నేను మగవాణ్ణి" అనుకున్నాడు అమల్. అమల్ వెళ్ళిపోయేప్పుడు, చాలామట్టుకు బాగా వడ్డించాలని ఆలోచించుకుంది చారు కాని అమల్ కనిపించ గానే అవంతా ఎక్కడికి మాయమైపోయాయో తెలీదు.

"అమల్, వుత్తరాలు రాస్తుంటావు కదూ?" అని మాత్రం అనగలిగింది. అమల్ ఇద్దర్నీ నమస్కరించాడు. చారు అక్కడ నిలబడక, తన గదివైపు పరుగుతీసింది. భడా లున తలుపులు వేసుకుంది.

*                *                *

# 13

అమల్ పెళ్ళికి భూపతి బర్ద్వాన్ వెళ్ళాడు. పెళ్ళయిం తరవాత అమల్‌ని ఇంగ్లండు పంపించి, ఇంటికి తిరిగి వచ్చే సాడు. అన్నికోణాలనుండి దెబ్బతిన్న భూపతికి ప్రపంచమంటే ఓ విధమైన విరక్తిభావం కలిగింది. ఆకారణంచేత మునుపులా సభల్లోనూ, పార్టీల్లోనూ, పాల్గొనడంలేదు.

పోనీ వెధవ పత్రిక పోతేపోయింది. మంచిపనే అయింది. తనకికను - శలవే అనుకున్నాడు భూపతి. సాయంత్ర మవ గానే, ఊరంతా తిరిగి పక్షులు తమతమ గూళ్ళకి ఎలా అయితే వెడతాయో అలాగే భూపతి పత్రికనుండి శలవు దొరకగానే చారు దగ్గరకు వెళ్లాడు. ఇన్నాళ్ళవరకూ తను ఓ కాగితపు నావతో ఆడుకున్నాడు. అది ఇప్పుడు మునిగి పోయింది. ఆఖరికి "పునర్మూషికో భవ" అన్నట్టుగా భూపతికి చారుయొక్క సాంగత్యం అంటే ఇల్లే శరణ్యమైంది. ఇంటికి వెళ్ళి గబగబా రెండుముద్దలు మ్రింగి, తన పడకగదికి వెళ్ళి హుక్కా సేవిస్తూ అంతులేని ఆలోచనాప్రపంచంలో విహ రించ సాగాడు.

అమల్ పెళ్ళిసంగతులు తరువాత జరిగిన ఘటనలు వినడానికి చారు చాలామట్టుకు ఔత్సుక్యం చూపిస్తుందను కున్నాడు భూపతి. కాని, ఆమె రాగానే ప్రశ్నించాడు, "ఏం చారు ఇంత ఆలస్యం చేశావేం?"

"అవును, కొంచెం ఆలస్యమైంది" అంది చారు. భూపతి నిరీక్షించాడు. చారు ఏమన్నా అమల్ సంగతులు అడుగుతుందేమోనని. కాని, ఆమె ఊరుకుంది. ఏమీ అడగ లేదు. వీళ్ళిద్దరి చిలిపిచేష్టలూ చూసి భూపతి చాలా ఆనం దించేవాడు. అయితే అమల్ పట్ల చారు ఇంత నిరసన చూపి స్తుందా? అదంతా బయటి డాబేనా? భూపతి, చారుని అర్థం చేసుకోలేకపోయాడు. మెల్లిగా ఆమెను పరీక్షించాలనే ఉద్దే శంతో "చారు, నువు బాగున్నావా? నీ ఒంట్లో కులాసాగానే వుందా?" అన్నాడు.

"బాగానే వున్నాను" అని సంక్షేపంగా జవాబిచ్చింది. "అమల్ కి పెళ్ళి కులాసాగా జరిగిపోయింది" అని మెల్లిగా విషయాన్ని కదిపాడు. అప్పటికి ఆమె అడగలేదు. శిలా ప్రతిమలా కూర్చుంది. "పిల్లకూడా చూట్టానికి బాగానేవుంది; వింటున్నావా? అరే...నిద్రబోతున్నావా ఏమిటి చారు ?" "లేదు" "పాపం! అమల్ ఒంటరిగానే వెళ్ళిపోయాడు కంపార్టుమెంట్లో కూర్చుని, చిన్నపిల్లవాడిలా యేడవ నారంభించాడు. నేనుకూడా కన్నీళ్ళు—నాపుకోలేక పోయాను" దీపం ఆరి పోయింది. గదిబయట చీకటి వ్యాపించింది.

చారు మంచందిగి బయటికి నడిచింది. భూపతి ఆశ్చర్యబోతూ—"యేం చారు, అలా వెళ్ళిపోతున్నావేం? ఒంట్లో బాగాలేదా?" ప్రశ్నించాడు. ఆమె జవాబివ్వకపోవడం గమనించి, భూపతికూడా ఆమెను వెంబడించాడు. ఆమె భూమిమీద బోర్లపడి యేడవ నారంభించింది. భూపతి నిశ్చేష్టుడయి పోయాడు చారు హృదయంలో యింత ప్రేమవుందని భూపతి యిప్పుడు గ్రహించాడు తనేదో ఘోరమైన నేరం చేశానేమో ననుకొన్నాడు. ఆమెపట్ల తనెటువంటి నీచమైన అంతే తప్పుడభిప్రాయం యేర్పరచుకున్నాడు. ఇప్పుడతని సందేహం దూరమైంది. ఆమెదగ్గర కూర్చుని, ఆమెముంగురుల్లో వేళ్లుదూర్చి ప్రేమతో చూశాడు. సానుభూతి యే విధంగా కనబర్చాలో తెలీక.

* * *

# 14

భూపతికి దినపత్రిక గొడవ వదలిపోయింది. హృదయంలో తన భవిష్యత్ యొక్క మానవచిత్రాన్ని రాసుకొన్నాడు. ఇహనుండి మనస్సులో యేవిధమైన దురాశకు స్థానమివ్వనని ప్రతిజ్ఞ చేశాడు. అనవసరమైన పని యేదీ చెయ్యడు. చారుతోనే కాలం గడుపుతాడు. సరాగాలాడతాడు ఆమె కష్టసుఖాల్లో, ఇహనుండి తనుకూడా భాగస్వామి అవుతాడు. దైనిక కార్యక్రమాల్లోకూడా ఆమెకు సహాయంగా వుంటాడు.

కాని, తీరావని పడేప్పుడుమాత్రం, ఆ సహజ సుఖం కోసం ఆశించడం వ్యర్థమనుకొన్నాడు. ఆ విధంగా సుఖించడం, అంతసులభం కాదనుకున్నాడు. భూపతిబాబు చారుని యేవిధంగానూ సంతోష పర్చలేకపోయాడు. దీనికి తనేకారణమనుకున్నాడు. "పన్నెండు సంవత్సరాలవరకూ పత్రికల్లో రాస్తూవచ్చాను. కాని ఆడదానితో మాట్లాడే 'కళ'మాత్రం నా కబ్బిందికాదు" అనుకున్నాడు.

ఒకొక్కసారి ఏమీ తోచదుగానీ, సంభాషణ పొడిగించాలనే వుద్దేశంతో - "పేక ఆడదామా చారు?" అనేవాడు. అదోమాదిరిగా ఆమె "సరే" అనేది. అన్యమనస్కంగా రెండు 'సెట్లు' ఆడగానే ఆటయందు ధ్యానం కేంద్రీకరించక పోవడంవల్ల ఆట ఓడిపోయేది. భూపతికి ఈవిధంగా సమయం గడవడంలో తృప్తిగా వుండలేకపోయింది. కొన్నాళ్ళ తరవాత చారు నడిగాడు - "యేం చారు, మనం మందాకినిని పిలి

పిద్దామా? నువ్వొక్క_ర్తె వే వున్నందుకు కా_స్త నీకు ఊసుపో తుందేమోనని నా వూహ." 'మందాకిని' పేరు వినగానే చారుకి ఒళ్లు భగ్గునమండి వెంటనే "వద్దు వద్దు. మందాకిని ఇక్కడికి రానవసరంలేదు" అంది.

భూపతికి ఏమీతోచక ఆఖరికి సాహిత్యంవైపు మన స్సుని మరలించాడు. మిత్రులువచ్చి చూసేవారు-భూపతిబాబు టెనిసన్, బైరన్, చెఖోవ్, గోర్కీ, ఛార్లస్ డికెన్సు గ్రంథాల్ని తిరిగేస్తున్నాడు. ఎగతాళి చేశారుకూడా. నవ్వుతూ భూపతి అనేవాడు-"బాబూ, వెదురులో పూలు పుడతాయ్. కాని, అది ఎప్పుడు పుష్పిందో ఎవరికీ తెలీదు."

ఓనాడు సాయంత్రం, భూపతి ఓ పు_స్తకం పేజీ తిరగేస్తూ చారుతో-"ఏదన్నా చదివి వినిపించేదా?"అన్నాడు. "హుం!" అంది చారు ము_క్తసరిగా. "ఏ కథ కావాలి?" అన్నాడు ఆమెను మాట్లాడించాలనే వుద్దేశంతో. "మీ కిష్టమైంది." ప్రతిదానికీ ఆమె సంక్షేపంగానే జవాబిచ్చింది. "టెనిసన్ పద్యాల్ని అనువదించి చదవమన్నావా?" "ఆఁ!"

అతని ప్రయత్నం వ్యర్థమైంది. అసలు చదవడానికి ఇష్ట ముంటేగా! అతని భావాలు వేరు. సమయానికి సరైనపదాలు జ్ఞ_ప్తికికూడా రాలేదు. చారు వింటుందో లేదో అని ఆమె మొహం చూశాడు. ఆమె సరిగా వినలేదని గ్రహించడానికి అట్టేసమయం పట్టలేదు. ఇంతకూ, ఆ ప్రశాంతమైన సంధ్యాసమయం వీళ్ళకు ఆనందాన్నివ్వలేకపోయింది. సాహిత్య గోష్టికి బ్రేక్ పడి పోయింది.

* * *

# 15

గట్టిగా దెబ్బతగిల్తే ఒళ్ళంతా 'జిమ్' అన్నట్టుగా వుంటుంది, అంటే తిమ్మిరిపట్టినట్టుగా. కాని బాధ అనిపించదు. ఆవిధంగానే మొట్టమొదట అమల్ యొక్క అనుపస్థితి చారుకంత కష్టమనిపించలేదు.

రోజులు దొర్లుతున్నకొద్దీ అమల్ యొక్క అనుపస్థితి వల్ల చారుకి యిల్లంతా శూన్యంగా కనుపించసాగింది. ఆమెకు సమయం గడవడం కష్టమైపోయింది. రోజూ భోజనం తరువాత కిళ్ళీలుకట్టేప్పుడు వెనకనుండి అమల్ వచ్చి కిళ్ళీ అడుగుతాడేమో ననిపించేది. పరాకున చారు ఓడజను కిళ్ళీలు కట్టేసేది. కాని, హఠాత్తుగా జ్ఞప్తికి వచ్చేది. 'మేక'లాగ కిళ్ళీలు నమిలేవాడు లేడుకదా అని.

'స్కూల్'నుండి కుర్రాళ్ళు తిరిగివస్తుంటే చారు కిటికీలోనుండి చూసేది. హఠాత్తుగా ఎవరో కుర్రాడు పుస్తకాలు పట్టుకుని వస్తుంటే కాలేజీనుండి అమల్ వస్తున్నాడేమో ననుకొనేది. పత్రికలంటే, పుస్తకాలంటే ఆమెకు అసహ్యమనిపించింది. ఇన్నాళ్ళు ఏదో అల్లుకుని కూర్చునేది; ఇప్పుడెవరికోసం తను అల్లుతుంది ?

అల్లిక పనికూడా ఆమె మానివేసింది. తన ఈ పరివర్తన ఒక్కొక్కసారి తనకే ఆశ్చర్యాన్ని కలుగజేసేది తనలో ఆమె ఎన్నోసార్లు ప్రశ్నించుకుంది. తన మనోవేదన...ఇది మనోవేదనేనా?...అవును...అయితే దీనికి కారణం? జవాబు దొరికేదేకాదు. ఆమెకు అదోలా గింజుకున్నట్టుగా వుండేది.

ఇటువంటి సమయంలో భూపతి, ఆమె మనస్సును ఇంకోవైపు తిప్పితే ఎంతో బావుణ్ను అనుకునేవాడు. కాని, చారుముందు ఎప్పుడూ అమల్ సంగతులే జ్ఞప్తికి తెస్తూ చర్చించేవాడు. ఆమెబాధ, మరికొంచెం ఎక్కువవుతుందంటారా? లేదా?

*　　　　*　　　　*

ఆఖరికి అమల్‌ని చారు మరవలేపోకయింది. అతని స్మృతిమాత్రం ఆమె హృదయంలో వుండిపోయింది. ఇంటి పనుల్లో తీరిక దొరకగానే తనగదికివెళ్ళి పూర్వపు సంఘటనలన్నీ జ్ఞప్తికి తెచ్చుకునేది. ఆమెకు తెలీకుండానే ఆమె పెదవులు 'అమల్' అని ఉచ్ఛరించేవి. 'వదినా'అని అమల్ ఇంగ్లండునుండి ఆమె పిలుపుకి జవాబిచ్చినట్టుగా భావించేది.

## 16

మెల్లిగా అమల్‌ని మర్చిపోడానికి చారుప్రయత్నించేది. అందుకని, రోజూ నియమం తప్పకుండా పతిసేవలో లీనమైంది. భూపతి పడుకొన్న తరువాత, మెల్లిగా అతని నిద్రకి భంగం రాకుండా అతని పాదాలపై శిరస్సునుంచి నమస్కరించేది. అతని పాదధూళి తీసుకొని బొట్టుపెట్టుకునేది. భర్తవిషయంలో అంటే అతనికి సంబంధించిన ప్రతిపనిలో ప్రత్యేకశ్రద్ధచూపించ నారంభించింది.

భూపతికూడా ఎక్కువ సమయం చారుతోనే గడిపేవాడు. ఇన్నాళ్ళకంటే ఎక్కువ ఆనందంగా వుండేవాడు. ఎప్పుడో పోగొట్టుకున్న నిధి, ఇన్నాళ్ళకు దొరికినందుకు నేడు

చారుకి అప్రియమైన పనిఏదీ చెయ్యడానికి అతని మనసొప్పేదీ కాదు. ఆఖరికి ఆమెకు తెలీకుండా సాహిత్యంలో లీనమయ్యాడు. దినపత్రిక పోగొట్టుకున్నాడు. ఎన్నో దుఃఖాల్ని ఎదురుకు న్నాడు. ఇవన్నీ పోగొట్టుకుని, ఇన్నాళ్ళకు తనభార్యతో ఆనం దంగా కాలంగడుపుతున్నాడు. ఇదే అతనికితృప్తి. ఓనాడు అవ కాశంచూసుకొని "చారు, నువురాయడం మానేశావెందుకు?" అన్నాడు, భూపతి.

"ఏంరాసేదాన్ని, నాబొంద? అది ఒకరాత అనిపించు కుంటుందా?"

"లేదు, చారు నిజం చెబుతున్నా. ఇప్పటి రచయితల్లో నీలాగ రాసేవాళ్ళని నేనింతవరకూ చూడలేదు. నా అభి ప్రాయం. విశ్వబంధు అభిప్రాయం ఒక్కటే."

"చాల్లెండి ఈ పొగడ్తలు."

"ఇదిగో ఇలాచూడు," అంటూ 'సరోరుహాం' తీసి చదవ నారంభించాడు. అమల్ రచనకూడా, ఈమె రచనతో సరిపోల్చ—నారంభించాడు. చారు మొహం సిగ్గుతో ఎర్ర బారింది. భూపతి చేతినుండి పత్రికలాక్కొని, తలగడక్రింద దాచేసింది.

రచనా వ్యాసంగానికి ఎవరైనా ఉత్సాహపర్చేమిత్రులు లేకపోతే రాయడంకష్టం. కలం ముందుకు నడవదు అను కున్నాడు భూపతి. ఇహ తనుకూడా అభ్యాసం చెయ్యాలి. అలాగయితేనే చారు మనస్సులోకూడా ఉత్సాహం కలుగు తుంది. అప్పుడు ఇద్దరూకలసి రాయవచ్చు. దుఃఖభారంలో నున్న ఆమెమనస్సు కొంచెం తేలికపడుతుందనుకున్నాడు.

ఆమెకు తెలీకుండా, అంటే రహస్యంగా భూపతి రాయ నారంభించాడు. కొంచెంరాసి చింపేసేవాడు. అది తనకిష్ట పడక, మళ్ళీ రెండుమూడు పేజీలు రాసేవాడు. ఒక్కసారి చదివి చారుకి నచ్చుతుందో లేదో అనుకుని చింపేసేవాడు. ఇంతవరకూ తను దినపత్రికకు సంపాదకుడు. కాలమంతా రాజ కీయాల్లోనూ, తత్సంబంధమైన వ్యాసాల్లోనూ గడిచింది. ఘాటుగా రాజకీయ వ్యాసాలు రాయడంలో భూపతిది అందె వేసిన చెయ్యేగాని, ఓ కథ రాయలేకపోతున్నాడు.

ఆశ్చర్యం...కాదుమరీ! తనభార్య కథలు రాయగలుగు తుంది. మరితనో?...పాపం! భూపతి! తను రాసినకథలు, ప్రజా నీకానికి నచ్చుతుందో లేదో! మరి చారు? ఆడదానిదగ్గర, అందులో ముఖ్యంగా తనభార్యఎదుట తను లోకువ అవాల్సిం దేనా? లేదు...ఎంతమాత్రం అలా కాకూడదు. తనురాస్తాడు. రాసిచూపిస్తాడు. ఏమనుకున్నారో ఏమిటో! హుఁః

ఇలాంటి ఆలోచనలతో ఒక్కసారి ఏకాగ్ర చిత్తంతో రాయడానికి కూర్చునేవాడు. చదివాడు చింపెయ్యాలను కున్నాడు. కాని తన రచనలపట్ల తనకే ఓ విధమైన వ్యా మోహం కలిగింది.

చింపలేకపోయాడు. వాట్ని జాగ్రత్తగా సేకరించాడు. తన ఇంకో మిత్రునిచేత కథరాయించి, చారుకి చూపించాడు.

"ఇదుగో నా మిత్రుడొకడు, కొత్తగా రాయ నారం భించాడు. దీన్నోసారి చూడు. ఈ విషయంలో నీకు బాగా తెలుసును గాబట్టి నీ సలహాకోసం తీసుకువచ్చాను. అసలు

నాకేమీ బోధపడలేదు దీనిమీద నీ అభిప్రాయం చెప్పాలి"
అన్నాడు భూపతి.

ఆమెచేతికి పుస్తకాన్నిచ్చి, మెల్లిగా బయటికి దారి తీశాడు భూపతి! భర్తయొక్క 'చలాకీ' గ్రహించడానికి చారుకి ఎక్కువ సమయం పట్టలేదు. రచనని చదివింది. ఆ మూలాగ్రంగా చదివినతరువాత, ఆమె పెదవులపై ఓ చిరునవ్వు 'తళుకు' లాడింది.

తను ఇంతగా సేవచేస్తున్నా, ఇంత పూజచేస్తున్నా ఇదంతా గ్రహించకుండా పూజా పుష్పాల్ని స్వీకరించకుండా తనభర్త తనను తృప్తిపర్చాలనీ, తనకి 'ఖుషామతు' చేయాలనీ తనదగ్గరనుండి మెప్పుపొందాలని, అతనికంత ఔత్సుక్యం ఎందుకుందో తనకే తెలీకుండా వుంది.

తనభర్త తనకన్నా తక్కువ వాడని, ఎందు కను కుంటున్నాడో! ఆమెకేమీ బోధపడలేదు. పైగా ఇదే ఆమెకు చింత అనండి లేక "విచారం" అనండి. పట్టుకుంది! పుస్తకాన్ని తలగడకిందవుంచి, అతీతమైన ఘట్టాల్ని జ్ఞప్తికి తెచ్చుకో సాగింది!

అమల్ కూడా తను రాసిన రచనల్ని ఆమెకు చూపిస్తుండేవాడు! సాయంత్రం భూపతి ప్రకృతిని చూస్తూ యేదో ఆలోచించసాగాడు! రచన విషయమై అడగడానికి ధైర్యం లేకపోయింది!

చారు స్వయంగానే అడిగింది—"ఇది మీ మిత్రుని ప్రథమ రచనా యేమిటి?" 'అవును' అంటూ సంక్షేపంగా

ప్రత్యుత్తరమిచ్చాడు. "చాలా బాగుంది! చదువరులు దీన్ని 'ప్రథమరచన' అనుకోలేరు!" దీంతో భూపతి చాలా సంతోషించాడు! ఇది తను రాసిందేనని చారుతో ఎలా చెప్పేదా అని ఆలోచించసాగాడు! ఆ ప్రోత్సాహంతోనే ఇంకా రాయనారంభించాడు! ఎన్ని రాశాడో తనకే తెలీదు! ఆఖరికి భూపతిపేరు! బయటికి రానే వచ్చింది! అసలు ఎక్కువకాలం వరకూ అజ్ఞాతంగా వుండలేక పోయాడు!

*　　*　　*　　*

# 17

ఇంగ్లండునుండి వచ్చే పోస్టుకోసం ఎదురు చూట్టం చారు కలవాటయిపోయింది! ముందు 'ఏడెన్' నుండి భూపతి పేర్న ఓ వుత్తరం అందింది! అందులో వదినకు నమస్కారాలు అని రాశాడు అమల్! 'కెయిరో' నుండి వచ్చిన వుత్తరంలో కూడా అలాగేవుంది! 'మల్టా'నుండి కూడా అదేసంగతి వ్రాయబడింది.

చారుకి తనపేర్న యే వుత్తరం లేదు అన్ని వుత్తరాలు బాగా చదివింది!

"వదినకు నమస్కారాలు, తప్ప ఇంకో విషయం అసలు లేనేలేదు! అమల్ మనస్సులో వున్న మలినం ఈపాటికి దూరమైపోయి వుంటుందనుకుంది చారు! మళ్లీ ఆమెహృదయంలో అమల్‌పట్ల వున్న ప్రేమంతా పటాపంచలైపోయింది!

ఇంటిపనుల్లో ఆమె కాస్త మందగించింది మునుపటి శ్రద్ధలేక పోయింది!

ఈ కొద్దిరోజుల్లో భూపతికి రాత్రులు సమానంగా నిద్ర పట్టడంలేదు! ఒక్కోసారి అర్ధరాత్రప్పుడు మెలకువ రాగానే చారు మంచం ఖాళీగా వుండటం గమనించేవాడు.

లేచి ఆమెకోసం వెదికేవాడు. ఆమె దక్షిణంవైపు కిటికీదగ్గర కూర్చుని, ఆకాశంలో చుక్కల్ని లెక్కబెడుతూండేది. భూపతి రావడం గమనించి—"అబ్బా! చాలా వుక్కగా వుందండీ! కాస్త గాలికోసం, ఇలావచ్చి కూర్చున్నాను" అనేది చారు.

ఆ తరువాత గదిలో ఎలక్ట్రిక్ ఫాన్ వేయించాడు. ఆమె నీరసమైన మొహాన్ని చూసి "ఒంట్లో బాగాలేదా? డాక్టర్ని పిలిపించాలా?" అనేవాడు భూపతి. "బాగానేవున్నాను నాకేం జబ్బులేదే! మీరెందుకలా గాభరాపడతారు?" అనేది చారు. నవ్వడానికి ప్రయత్నిస్తూ ఆమాత్రం చిరునవ్వు పెదాలపై తెచ్చుకోడానికి ఆమె ఎంతో కష్టపడి ప్రయత్నించేది.

అమల్, ఇంగ్లండు వెళ్ళిపోయాడు. బహుశః తనకి వేరేగా, రాయడానికి దార్లో తీరిక దొరకలేదేమో ననుకుంది. ఇంగ్లండు వెళ్ళింతరువాత ఓ పెద్ద భారతంలాంటి వుత్తరం రాస్తాడేమో! కాని, ఆ పెద్ద వుత్తరం రాలేదు. అయినా ఇంగ్లండునుండి వచ్చే పోస్టుకోసం నిరీక్షించడం మాత్రం మానలేదు.

ఓ రోజు అంటే ఇంగ్లండునుండి పోస్టు వచ్చేనాడు భూపతి చిరునవ్వుతో చారుదగ్గరకు వచ్చి—"ఓ వస్తువు చూస్తావా?" అన్నాడు. "ఏదీ చూపించండి?" అంది చారు ఔత్సుక్యంతో.

భూపతి చూపించకుండా హాస్యాలాడ నారంభించాడు. చారు మరి సహించిలేకపోయింది. అతని జేబులోనుండి తీసుకోడానికి జబర్దస్తీ చెయ్య నారంభించింది. ఈవేళ తప్పకుండా తనపేర్న అమల్ దగ్గరనుండి ఉత్తరం వస్తుందనుకుంది చారు. కనుక, తను అనుకున్నది అబద్ధం కాకూడదు. అదేదో చూపించమని చారు ప్రాధేయపడింది.

మంచంచుట్టూ భూపతి "చక్కర్" కొట్ట సాగాడు. అతని వెనక ఆమెకూడా పరుగెత్తింది భూపతికిమాత్రం చాలా సంతోషంగా ఉంది. మరెక్కువ ఏడిపిస్తే బాగోదని జేబు నుండి తనురాసిన కథలపుస్తకాన్ని చారు చేతికిస్తూ, "ఇదిగో కోపగించకు" అన్నాడు.

*　　　　*　　　　*

# 18

తను చదువుకునే పుస్తకాలనుంచి తీరిక దొరకనందు వల్ల ఉత్తరాలు రాయలేదని భూపతికి అమల్ రాశాడు. అప్పటికీ ఏదన్నా ఉత్తరం వస్తుం దేమోననే ఆశతో **Postman** కోసం నిరీక్షించేది. చారుకి సమయం గడపడం చాలాకష్టమై

పోయింది. ఇప్పు డేపని చేసినా చిరాకు పడుతుంది. నౌఖర్లను కసుర్తుంది. పెద్దగా కేకలు వేస్తూ సాయంత్రం తనతో భూపతి మాట్లాడేప్పుడు చారు అంది—"ఏమండీ అమల్ ఎలావున్నాడో ఓ Telegram ఇచ్చి కనుక్కోకూడదూ?" "మొన్న నేగా వాడి దగ్గరనుండి ఉత్తరం వచ్చింది? వాడు చదువు సంధ్యల్లో లీనమై వున్నాట్ట" అన్నాడు భూపతి.

"అవునవును, నామతి ఇదై పోను. నాకు జ్ఞాపకమే లేక పోయింది. పరదేశంలో ఉన్నాడుకదా అని నా వుబలాటం మరేమీకాదు". అదికాకుండా ఇంగ్లండుకి Telegram ఇస్తే రూపాయి, రెండు రూపాయల్తో జరుగుతుందనుకున్నా వేమిటి? కనీసం వందో లేక ఇంకొంచెం ఎక్కువో పడుతుంది."

అప్పుడే Telegraph office నుండి peon వచ్చి భూపతి చేతికి ఓ Telegram ఇచ్చాడు. అది Prepaid Telegram అని భూపతి గ్రహించాడు. చారు మొహం వెలవెల బోయింది, ఆమె దొంగతనం పట్టుబడిపోయిందనుకుంది చారు. తన అభరణాన్ని తాకట్టుపెట్టి (నౌఖరుద్వారా) అమల్ కి Reply Telegram ఇచ్చిందని, రెండురోజుల తరవాత భూపతి తెలుసుకున్నాడు.

"చారుకి ఇలా చెయ్యాల్సిన అవసర మేమొచ్చింది ? తనతో చెబితే తను ఆపని చెయ్యడా? తనదగ్గర దాపరికమా? నౌఖరుద్వారా తాకట్టు పెట్టించడమా? ఛీ! ఛీ! ఇది బాగు లేదు అనుకున్నాడు" భూపతి తనలో.

చారు అమల్‌పట్ల ఇంత ఔత్సుక్యం ఎందుకు చూపి స్తోంది? ఒక అస్పష్టమైన సందేహం అలక్ష్యభావంతో, అతని హృదయంలో ముల్లులా గుచ్చుకొని, అతన్ని బాధపెట్ట సాగింది. భూపతి తన సందేహాన్ని ప్రత్యక్షంగా చూడదల్చుకో లేదు. కాని ఆ సందేహం మాత్రం దూరంకాలేకపోయింది.

♦ ♦ ♦

# 19

అమల్ క్షేమంగానే ఉన్నాడు. మరి ఉత్తరం ఎందుకు రాయడు? అతనిలో ఇంత పరివర్తన ఎలా వచ్చింది? అబ్బా! పాషాణ హృదయుడు. ఒక్కసారి వెళ్ళి గట్టిగా అడగాలను కుంది. కాని, మధ్యను అగాధమైన సముద్ర ముందిగా! దాన్ని ఎలా దాటాలి?

ఇన్నాళ్లు చిరాకుపడుతూనే ఏదో ఒకపని చేస్తుండేది, ఇప్పుడది లేదు. ఒకప్పుడు చూచినా, పొరపాటు జరగడం మాత్రం తప్పదు. నౌకర్లు దొంగలైపోయారు. ఆమె దీన భావాల్ని చూసి లోకులు నానావిధంగా అనసాగారు. గుస గుసలు బయల్దేరాయి. ఆమెమాత్రం మారడంలేదు. ఎప్పటి లానే వుంది.

వుండివుండి కూర్చున్న చారు హఠాత్తుగా లేచి "భోరున" ఏడ్చేది. అమల్ పేరువింటే ఆమె మొహం వివర్ణమవుతుంది. భూపతి ఇదంతా చూశాడు. ఎప్పుడూ లేని ఆలోచన అతని

మనస్సులో ఓ నిముషంవరకూ తిరిగింది ఈ ప్రపంచం. అతనికి నీరసంగా కనిపించింది. మధ్యాను అతను ఆనందంగా ఉన్న సమయం భూపతిని వెక్కిరించ నారంభించింది.

అవి తల్చుకుని సిగ్గుపడేవాడు. ఒక్కసారి తను రాసిన రచనలు జ్ఞప్తికి వచ్చాయి. భూమి బ్రద్దలైతే అందులో ప్రవేశించాలనుకున్నాడు. గబగబా చారుదగ్గరకు వచ్చి అన్నాడు. "నా రచనలేవీ?" అన్నాడు. "నా దగ్గరున్నయ్" అంది చారు "ఇలా తే" అన్నాడు.

అప్పటికి చారు "హల్వా చేస్తోంది ఇప్పుడే కావాలా?" అంది. "ఆఁ......ఇప్పుడే కావాలి!" అన్నాడు గట్టిగా. పొయ్యిమీదనుండి పెనం దించింది. కోపంతో పుస్తకాన్ని పొయ్యిలో పడేశాడు.

"ఇదేమిటిలా చేశారు?" అంటూ పుస్తకాన్ని తీయబోయింది. "ఉహుఁ...కాలిపోనీ..." అంటూ ఆమెచేయి పట్టుకుని వారించాడు. చారు ఆశ్చర్యంతో చకితురాలై, కాల్తున్న పుస్తకాన్ని చూస్తూ నిలబడిపోయింది. పరిస్థితి అంతా చారు బోధపర్చుకుంది. ఓ దీర్ఘమైన నిశ్వాసం విడిచింది. వంటగదినుండి బయటికి వచ్చింది.

చారు ఎదుటనే పుస్తకాన్ని కాల్చాలని స్వతహాగా భూపతికి కోరిక లేకపోయింది. కాని, ఒక్కసారి అతీతమంతా కళ్లెదుట హాజరయింది దానికి తోడుగా.

అగ్నిలో నెయ్యివేసినట్టు పొయ్యికూడా ఎదురుగుండా కనబడింది. అతని నెత్తిమీద దెయ్యాలు సవారీ అయినట్లని

పించింది. అతను సంబాళించుకోలేకపోయాడు. అందుకే కోపంతో పుస్తకాన్ని పొయ్యిలో పడేశాడు.

పుస్తకం కాలిపోయి, బూడిదయిం తరవాత, భూపతి కోపం చల్లారింది ఓ మోస్తరుగా. అతనెదుట దీనభావంతో చారు నిలబడినట్టు స్పష్టంగా కనిపించింది. భూపతికి "హల్వా" అంటే చాలా ఇష్టం! పెనంలో తయారయిపోయిన వేడి హల్వాని చూశాడు. పాపం! ఎంత ప్రేమతో తనకు ప్రియమైన ఫలహారం చారు తయారుచేసిందో! అయితే చారు తనను మోసం చేస్తుందా? ఆమె అన్యమనస్కంగా వుందా! ఎందుకు?

ఆమె మనస్సులో, ఏ విధమైన కష్టముందో తనతో చెప్పకూడదూ! చెబితే నష్టమా మరి?

మరి, ఇదంతా నటన? దీ నవసరమేముంది? పాపం! చారు! అబల!—కాదు రాక్షసి...అంతా మాయ! అనుకుంటూ రోగంవున్న రోగిని డాక్టరు దూరంనుండే ఎలా చూస్తాడో, అలానే ఒక్కసారి చారుని చూశాడు.

పాపం! ఈమెమీద ఎన్ని అత్యాచారాలు జరిగాయి. ఆమె హృదయవేదన చెప్పుకోడానికి ఆమెకు ఎవరూ లేరా?

భూపతి తన పడకగదిలోకి వెళ్ళి చూశాడు. చారు కిటికీ దగ్గర నిలబడి బయటికి చూస్తోంది. ఆమెదగ్గరకు వెళ్లి నిలబడ్డాడు. ఏమీ మాట్లాడకుండా ఆమె తలమీద తన చెయ్యి వేశాడు.

*　　　*　　　*

# 20

"ఏమిటి ? సంగతేమిటి ? ఇంత బిజీగా ఉన్నావేం?" అని మిత్రులు భూపతిని ప్రశ్నించారు.

"దినపత్రిక".

"మళ్ళీ పత్రికా? ఈ సారి పత్రికకోసం ఇల్లువాకిలంతా తగలెడతావేంటి ?"

"కాదబ్బా ! నేను పత్రిక నడపటంలేదు; మైసూరులో ఓ పత్రికకి నాకు సంపాదకత్వందొరికింది."

"ఇల్లు వదలి అంతదూరం వెడతావా ? చారునికూడా నీతో తీసుకపోతావా ?"

"లేదు, మా మామయ్య వచ్చి ఇక్కడ వుంటారు."

"అయితే ఇంకా సంపాదకత్వం పిచ్చి వదలలేదన్న మాట."

"మనిషికి ఏదో ఒకపిచ్చి ఉండితీరాలి కదూ ! నిషా అంటే మరీ బాగుంటుంది."

భూపతి వెళ్ళిపోతూన్న సమయంలో—

"ఎప్పుడు వస్తారు ?" అని చారు అడిగింది.

"నీకేమి తోచకపోతే, నువ్వెప్పుడు ఉత్తరం రాస్తే అప్పుడే వస్తాను" అంటూ భూపతి వెళ్ళబోతూంటే, గబగబా అతని దారి కడ్డంగా నిలబడి, చారు అతని చేతుల్ని పట్టుకుని—"నన్నుకూడా మీతో తీసుకు వెళ్ళండి. ఇక్కడ నేను ఒక్కర్తెనే ఉండడం నా కిష్టంలేదు" అంది.

భూపతి 'టప్' మని ఆగిపోయాడు.

ఆమె చెయ్యి విదుల్చుకుని, వరండాలోకి వచ్చి నిల బడ్డాడు. అమల్ నుండి వేరైన తరవాత, ఆ ఇల్లంతా శూన్యంగా కనిపిస్తూ, కసరడానికి వస్తున్నట్టనిపిస్తుందేమో చారుకి.

అందుకని, ఆ ఇంట్లో ఉండడాని కిష్టంలేక అక్కడనుండి అంటే, ఆ యింటినుండి పారిపోవాలనుకుంటుందో ఏమిటో!

కాని, తన విషయమై చారు ఏమీ ఆలోచించలేదే! తనెక్కడికి పారిపోతాడు! అంతులేని ఆలోచనా పరంపరలు అతని హృదయాన్ని కలచివైచాయి...

"నేను నిన్ను తీసుకు వెళ్ళలేను" అన్నాడు భూపతి. ఆమె మొహం వివర్ణమైంది. 'దబాలున' గోడకు జేరబడింది. లేకపోతే పడి పోవల్సిందే!

"సరే, పద. నాతో" అన్నాడు భూపతి.

"అవసరం లేదు" అని చారు జవాబిచ్చింది.



# సంధ్య - ఛాయ

ఆడవాళ్ళల్లో రెండుజాతు లున్నాయని కొంతమంది అనుభవజ్ఞు లంటారు. ఒకటి మాతృస్థాన మలంకరిస్తుందిట; రెండోది ప్రియురాలి స్థానమట. ఋతువుల్తో స్త్రీని పోలిస్తే, తల్లిని వర్ష ఋతువుతో పోల్చవచ్చట. నీళ్లు ప్రసాదిస్తుంది; ఫల పుష్పాలు వగైరాలు సమకూరుస్తుంది. తాపాన్ని వుపశమింప జేస్తుంది. జీవితంలోని అనుభవాల్ని పూర్తిజేస్తుంది. ఇంకా...

మరి ప్రియురాలేమో వసంత ఋతువుతో పోల్చవచ్చునట. అది రహస్యంగా, గాంభీర్యంగా వుంటుంది. దాని చంచలత్వం రక్తంలో చలనం కలిగిస్తూ ఓ తుఫానులాంటిది చెలరేగిస్తుంది. జీవితంలోని మాధుర్యమంతా ప్రియురాలిలోనే వుంది. (ఇదెంతవరకో ! అనుభవించినవారికే తెలియాలి.)

'శశాంక' భార్య 'సంధ్యారాణి' మొదటి తెగకు చెందింది. పెద్ద కళ్లు, మొహంలో గాంభీర్యం, చామనచాయగా వుంటుంది. మొహంలో ఎర్రని కుంకుమబొట్టు. భర్తకు ప్రతి పనీ ఎంతో ఓర్పుతో చేసిపెడుతుంది సంధ్య. భార్య అన్నీ చక్కపెడుతుంది కదా అని శశాంక సాధారణంగా అన్ని విషయాల్లోనూ అశ్రద్ధ చూపించేవాడు. రాస్తూరాస్తూ టేబిల్ మీద కలం అలాగే వదిలేసి బయటికి వెళ్ళేవాడు. తిరిగి వచ్చేసరికి అది కనబడదు. అదికూడా ఎంతో జాగ్రత్తగా వుంచేది సంధ్య. స్నానానికి వెళ్ళేప్పుడు 'రిస్టువాచీ'కూడా టేబిల్ మీద పడేసి వెళ్లిపోయేవాడు. దాన్ని భద్రంగా దాచేది సంధ్య.

ఒకోసారి విసుక్కుంటూ సంధ్య అంటుంది కదా – "అబ్బబ్బా! మీ అశ్రద్ధవల్ల నామతి పోతోందండి. ఎన్నిసార్లు చెప్పినా వినిపించుకోరుగదా." ఎబ్బే! అది మొండిఘటం. శశాంకమాత్రం అలాగే వున్నాడు.

ఒకసారి శశాంక తన మిత్రునింటికి విందుకు వెళ్ళాడు. రాత్రి పన్నెండున్నరైంది. ఇంకా పేకాట సాగుతూనే వుంది. అప్పుడు అతని మిత్రుడు ముఖర్జీ 'వార్నింగ్' ఇస్తాడు. "మిస్టర్ శశాంక, మీపాలిటి యమదూత వచ్చి బయట గొంతు చించుకుంటున్నాడు."

ఎదుట తననౌకరు 'కలువా' సాజక్ తెల్లటి మీసాల్తో. జీవితమంతా వీళ్ళఇంటిలోనే గడిపాడు. చీకటి రాత్రులనీ, ఎక్కడన్నా రాయీ రప్పా తగుల్తుందేమోననీ, లాంతరు కూడా ఇచ్చి మరీ కలువాని పంపించింది సంధ్య. భార్యమీద విసుక్కుని, శశాంక పేకముక్కల్ని పారేసి ఇంటికి బయల్దేరాడు కలువా వెంట, దారి తెలీని చిన్నపిల్లాడికిమల్లే.

మరోసారి బయట వరండాలోని గదిలో శశాంక ఎవరితోనో మాట్లాడుతున్నాడు. పది నిమిషాలన్నా అయిందో లేదో, లోపలినుండి అంటే సంధ్యనుండి చీటీలు వస్తున్నాయి. "నిన్న మీకు ఒంట్లో బాగులేదని జ్ఞాపకముందా? దయచేసి కాస్త త్వరగా భోజనానికి లేవండి." మరోచీటీ – "ఎంతరాత్రయిందో, ఎంత సమయమైందో మీకేమన్నా తెలుస్తోందా?" వగైరాలు.

ఇంట్లోకి రాగానే మళ్ళీ సంధ్యమీాద విరుచుకుపడ్డాడు. సంధ్య అన్నదికదా - "మీారిలా అంటారుగానీ, నేనిలా మీా వెంటపడకపోతే మీాకు అశ్రద్ధ మరీ ఎక్కువైపోతుంది. మా చిన్నాన్నగారింటికి ఓసారి 'హరిద్వార్' వెళ్ళినప్పుడు మీాకు హఠాత్తుగా ఎంతజ్వరం వచ్చిందో జ్ఞాపకముందా?" ఆమె కేమీా జవాబు చెప్పలేక ఊరుకున్నాడు శశాంక; అల్లరిపనులు చేసేప్పుడు, చిన్నపిల్లాణ్ణి తల్లి గదమాయిస్తే ఊరుకున్నట్టు. శశాంకుని ఆరోగ్యంపట్ల సంధ్య ఎంత పట్టుదలతో వుంటుందో, అతని గౌరవమర్యాదల పట్లకూడా అదే శ్రద్ధ కనబరుస్తుంది.

ఓసారి శశాంక బొంబాయి వెళ్ళటానికి తయారయాడు. అందుకని 'కలకత్తా ఎస్ప్లనేడ్ బుకింగ్ ఆఫీసు'కి వెళ్ళి బొంబాయి మెయిల్లో ఓ ఫస్టుక్లాసు కంపార్టుమెంటు రిజర్వు చేయించాడు. 'ఖరగ్‌పూర్' స్టేషన్ రాగానే 'టీ స్టాల్'కు వెళ్లి ఏవో తినుబండారాలు కొన్నాడు. కంపార్టుమెంటువద్దకు తిరిగి వచ్చాడు. అక్కడి దృశ్యంచూచి ఆశ్చర్యపోయాడు.

'మిలిటరీ' దుస్తుల్లోనున్న ఓవ్యక్తి సంధ్యను పెట్టె ఖాళీ చెయ్యమని కళ్ళెర్రజేస్తూ ఆజ్ఞాపించాడు. ఒక సుప్రసిద్ధమిలిటరీ జనరల్ పేరుచెప్పి ఆ కంపార్టుమెంటు అతనిదేననీ, పొరపాటు వల్ల శశాంకకు ఇచ్చారనీ, వెంటనే ఖాళీచెయ్యమనీ' స్టేషన్ మాష్టర్‌కూడా చెబుతున్నాడు.

శశాంకకూడా ఆశ్చర్యబోతూ, భయంతో మరో కంపార్టుమెంటుకి వెళ్ళటానికి తయారయాడు. వెంటనే సంధ్య అన్నదికదా - "మమ్మల్నెవరు దింపుతారో చూస్తాగా!

పిల్చుకురానోయ్ మీ జనరల్‌ని, చూస్తాను ఎటువంటి వీరాగ్రే సరుడో పాపం! ఎన్నియుద్ధాలు గెల్చాడో! ఈ జనరల్ పదవిని సంపాయించాలని ఎంతమందిని చంపాడో! వెళ్లు వెళ్లు – నా మొహం చూస్తావేం? కదులు ఇక్కడినుండి !"

అప్పటికి శశాంక ప్రభుత్వంలో 'ఇంజనీరు'గా పనిచేస్తు న్నాడు. అందుకని ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రభుత్వోద్యోగు లకు కోపంతెప్పించటం అతని కిష్టంలేకపోయింది. "దెబ్బలాడి లాభంలేదు. ఇంకా ముందు కంపార్టుమెంట్లున్నాయిగా. అక్క డికి పోదాంపద" అన్నాడు శశాంక.

కాని, అతనిమాటలు సంధ్య వినుపించుకోలేదు. ఇంతలో జనరల్‌గారు 'రిఫ్రేష్‌మెంట్ రూమ్'లో భోంచేసి నోట్లో సిగార్ పెట్టుకుని అక్కడికివచ్చాడు. అక్కడిదృశ్యం, సంధ్య రౌద్రాకారంచూచి, తనే మరోకంపార్టుమెంటు వెతు క్కోటానికి బయల్దేరాడు. "అతనెంత పెద్దవాడో తెలుసా ?" అన్నాడు శశాంక. "నాకు తెల్సుకునే అవసరంలేదు. మనం 'రిజర్వ్' చేయించుకున్నాం. ఈ విధంగాచూస్తే మీకన్నా గొప్పవాడుకాడు;" అంది సంధ్య.

"అతను నిన్నవమానిస్తే?" అన్నాడు శశాంక.

(ఇదేం ప్రశ్న !)

"నన్నవమానిస్తాడా? మరి మీ రెందుకున్నారు ?"

శశాంక ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. ఇంట్లో తనుఎంత అశ్రద్ధగావున్నా పనిలోమాత్రం తనెప్పుడూ అశ్రద్ధ చూపించ లేదు. తన పై అధికారులు ఏదన్నామాటంటే పడేవాడుకాడు.

అసలు, అటువంటి పరిస్థితులు రాకుండావుండాలనే ప్రయత్నించేవాడు.

శశాంక డిస్ట్రిక్టు ఇంజినీరుగా వున్నప్పుడు తనకన్నా అల్పవయస్కుడు, తక్కువ అనుభవమున్నవాడు ఒక యూరోపియన్ కుర్రాడు అసిస్టెంట్ చీఫ్ ఇంజినీర్‌గా నియోగించబడ్డాడు. కారణం – అతను చీఫ్ ఇంజినీర్‌గారికి దగ్గరబంధువు.

దీంతో శశాంక మనస్సు చివుక్కుమంటుందని పెద్దదొరకి తెలుసు. అందుకే శశాంకనుపిల్చి అన్నాడు–"అయామ్ సారీ మిస్టర్ శశాంక. నువ్వన్యథా భావించవనుకుంటా. సాధ్యమైనంతత్వరలోనే నిన్నుకూడా ప్రొమోట్‌చేస్తాను" శశాంక చాలా నొచ్చుకున్నాడు. ఈ సంగతి సంధ్యతో చెప్పకూడదనుకున్నాడు. గాని ఎలాగోలా సంధ్యకు తెలిసింది. "వెంటనే రిజైన్‌చెయ్యండి," అందామె కోపంతో.

భార్యమాటల్ని విన్నాడేగాని, వెంటనే రిజైన్‌చెయ్యటానికి అతనికి మనస్సొప్పిందికాదు. (జీతాల రోజులుతల్చుకుని) శశాంక ఎమ్, ఎస్. సి ప్యాసవగానే, అతనికి పెళ్ళయింది. అత్తవారు ధనికులు. మామగారి ఆర్థికసహాయంతో 'ఇంజనీరింగ్' ప్యాసయ్యాడు., తరువాత ఇంజినీరుగా కుదిరాడు.

సంధ్యకూడా శశాంకఇంట్లో ఏవిధమైన కష్టమూలేకపోయింది. కన్నవారింట ఆమెకు ఎంత హాయిగావుండేదో, శశాంక ఇంట్లోకూడా అలాగేవుంది. పాపం! ఆమె కింతవరకు సంతానంలేదు. ఆ ఆశకూడా లేదు. రిజైన్‌చెయ్యమనగానే శశాంక కాస్సేపు ఆలోచించి అన్నాడు – "నౌకరీ వదిలెయ్య

టానికి నా కేమీ అభ్యంతరంలేదుగాని, నిన్ను సుఖపెట్టలేనేమో నని ఆలోచిస్తున్నా."

"నా కేవిధమైన కష్టమూవుండదుగాని, ఈ అన్యాయాన్నీ, అవమానాన్నీ చూస్తూ మెదలకుండా మీరు సహిస్తే నిజంగా నే నాకు చాలా కష్టంగావుంటుంది. ఈ బానిసత్వం నా కిష్టంలేదు" అంది సంధ్య.

"పోనీ ఇదివదిలేస్తే, ఇంకెక్కడికివెళ్ళినా నౌకరీయే కదా చెయ్యాలి. మరిదానికోసం ఎక్కడికని తిరగమన్నావ్?"

"మరేం ఫరవాలేదు. మా పిన్నికొడుకు శంభూ పెద్ద కంట్రాక్టరు. అతనికి మీరు భాగస్వామిగా వుండొచ్చు."

"దానికిముందే మదుపుపెట్టాలిగా."

"ఎందుకలా సందేహిస్తారు? మా నాన్నగారు నాపేర బ్యాంకులో వేసిన డబ్బుకు వడ్డీ చాలా వస్తుంది. కాబట్టి ఆ విషయంలో మనం జంక నవసరంలేదు."

"అలా వీల్లేదు, అది నీ డబ్బు" అంటూ అక్కడి నుండి కదిలాడు. సంధ్య అతని చొక్కా పట్టుకునిలాగింది. ద్వారానికి ఎదురుగుండా నిలబడి అతన్ని కూర్చోబెట్టి అన్నది కదా - "నేనుకూడా మీ దాన్నేగా! మరి నాదేమిటి, మీదేమిటి? కలంతీయండి. జేబునుండి వెంటనే 'రిజగ్నేషన్ లెటర్' రాయండి. అలా చేసేవరకు నాకు శాంతిలేదు.

పాపం! శశాంక ఓడిపోయాడు. ఆమె మాటను త్రోసి పుచ్చలేక ఉద్యోగానికి రిజైన్ యిచ్చాడు.

*    *    *

# 2

మరుసటిరోజు శంభూ ఇంటికి వెళ్ళింది సంధ్య. "ఏం అన్నయ్యా! మమ్మల్ని పూర్తిగా మరిచిపోయావల్లే వుంది. ఓ ఉత్తరం ముక్కన్నా రాశావు కావు" అంది సంధ్య. "అబ్బే అది కాదమ్మా. అసలు నాకు తీరిక దొరకటంలేదు" అన్నాడు శంభూ. "అన్నట్టు ఈ మధ్యను పత్రికల్లో చూశాను - ఇక్కడెక్కడో మథురాగంజ్‌లో ఓ వంతెన తయారవుతుందట. దానిని నువ్వే కంట్రాక్టు తీసుకున్నావట. చాలా సంతోషం" అందామె. తరవాత తనభర్తను భాగస్వామిగా చేసుకోమని సంధ్య కోరింది. శంభూ ఒప్పుకున్నాడు. రాత కోతలుకూడా జరిగిపోయాయి.

పని జోరుగా సాగుతోంది. ఇన్నాళ్లు శశాంక ఒకరి క్రింద పనిచేసేవాడు. ఇప్పుడు తనే యజమాని. తనుకూడా కష్టపడుతున్నాడు. ఎందుకు? తనభార్య తాలూకు అప్పు త్వరలో తీర్చాలని. చకచకా పని సాగుతోంది. సంధ్య అప్పు మరికొంచెమే వుండిపోయింది.

ఇన్నాళ్లు డబ్బంతా సంధ్యచేతి కిచ్చేవాడు శశాంక. ఇప్పుడామెకు తెలీకుండా సగం బ్యాంకులో జమచేస్తూ మిగతా సగం ఆమెచేతి కిస్తున్నాడు. ఇంటిఖర్చుల్లోకూడా ఏమీ లోపం రాకుండా సర్దుకుంటున్నాడు. తనపనికి సంబంధించిన 'రిజిస్టర్' (క్యాష్‌బుక్)వరకు సంధ్యను రానివ్వలేదు. సమయం వ్యర్థపుచ్చకుండా ఎప్పుడూ పనిగొడవలోనే వుంటున్నాడు శశాంక.

"అంతగా ఇదయిపోకండి. మీ ఆరోగ్యంకూడా చూసుకోండి" అంటుంది సంధ్య. ఆమె చెప్పింది ససేమిరా వినిపించుకోడు. సూర్యోదయ మవగానే (ఈమధ్యనేకొన్న) సెకండ్ హాండ్ ఫోర్డు తనే స్వయంగా నడుపుకుంటూ బయల్దేర్తాడు. మధ్యాహ్నం రెండున్నరకి ఇంటికివచ్చి ఏదో రెండు మెతుకులు నోట్లో వేసుకుని, సంధ్య ఎంత బ్రతిమాలినా వినిపించుకోకుండా మళ్లీ పనిలోకి బయల్దేర్తాడు.

ఓనాడు శశాంక పని సూపర్వైజ్ చేస్తూండగా ఓ ఇనుపముక్క అతని కాలుమీద త్రుళ్లిపడింది. దాంతో అతని ప్యాంటంతా రక్తంతో తడిసిపోయింది. అంత పెద్ద జబ్బేమీ కాదు.

"కొన్నాళ్లు మీరు విశ్రాంతి తీసుకోకూడదూ?" అంది సంధ్య.

"మరి పని?"

"కాని........"

"కానీలేదు అర్థణాలేదు" అంటూ కట్టుకట్టి, చకచకా బయటికి నడిచాడు.

ఆఖరికి వడ్డీతోసహా భార్యతాలూకు అప్పు తీర్చేశాడు శశాంక. ఆమె ఎంతచెప్పినా వినిపించుకోలేదు. భార్యాభర్తల మధ్య 'అప్పు' ఏమిటి? ఆమెకు ఆ మాత్రం స్వాతంత్ర్యంలేదా! పాపం! సంధ్య!........

* * *

# 3

తనకు వచ్చిన ఆదాయంతో శశాంక భవానీపూర్‌లో ఒక 'అప్-టు-డేట్' ఇల్లు కట్టించుకున్నాడు. అన్ని సౌకర్యాలూ వున్నప్పటికీ మునుపటిలాగే పనిచేస్తున్నాడు శశాంక. అందరికీ ఆదివారం శలవైతే, అతనికావేళ సోమవారంలా వుంటుంది. ఆదివారంనాడుకూడా సమయం వ్యర్థపుచ్చడు. ఒకప్పుడు శలవురోజున, తన గదిలో కూర్చున్నా, ఏదో డ్రాయింగు చూస్తూంటాడు. లేకపోతే పని తాలూకు 'ఎకౌంట్సు' చూస్తాడు. ఇంట్లోకూడా పనిగొడవే.

సంధ్య చెప్పిన ప్రతీమాటకూ శశాంక చిరాకుపడతాడు. పైగా ఆమెను తనగదిలోకే రావద్దంటాడు. ఓసారి అతని 'పుట్టిన రోజు' వచ్చింది. ఇల్లంతా సంధ్య ఎంతో శ్రద్ధతో అలంకరించింది. చాలామంది నాహ్వానించింది. అదంతా చూస్తూ "ఇవ్వాళ ఇంత హుషారుగా అలంకరిస్తున్నావు, బొమ్మల పెళ్లా?" అన్నాడు.

"దైవమా! ఇదికూడా మీకు జ్ఞాపకంలేకపోయిందే! ఈవేళ మీ పుట్టినరోజండీ! ఈవేళ మధ్యాహ్నం మీ రెక్కడికీ వెళ్ళకూడదు. బంధువులందర్నీ పిలిచాను" అంది సంధ్య.

"మరి బిజినెస్?" అన్నాడు శశాంక మొహంలో గాంభీర్యం తెచ్చుకుంటూ.

"ఈవేళ ఒక్కరోజుకోసంకాదు- ఒక్కపూటకోసం, మీరు నామాట మన్నించాలి. చూడండి, ఇంతమంది నాహ్వానించాను. మీరింట్లో లేకపోతే వాళ్ళంతా ఏమనుకుంటారు?"

"ఇలాంటివి నా కిష్టంలేదు సంధ్యా" అంటూ చరచరా బయటికిపోయాడు శశాంక. ఓడిపోయిన సైనికునిమల్లే తన గదికివెళ్లి మంచంమీద పడి, కొంతసేపు ఏడ్చింది.

మధ్యాహ్నం బంధువులంతావచ్చారు. శశాంక ఇంట్లో లేకపోయినా కార్యక్రమమంతా ఎలాగో నెట్టుకుపోయింది సంధ్య. వరుడులేని పెళ్లికిమల్లే అతని పుట్టినరోజుపండుగ ఎలాగోలాగ అయిందనిపించింది.

బంధువులంతా వెళ్ళిపోయారు. కొన్ని వేల ఆలోచనలతో, భర్తచేష్టల్ని ఆలోచించుకొంటూ అతనికోసం ఎదురుచూడసాగింది.

*                    *                    *

# 4

శశాంక 'బ్యాంకు'లో జమచేసినడబ్బు ఒక 'ల'కారం వరకు వెళ్ళింది. అప్పుడే సంధ్యకూడా మంచంపట్టింది. ఎంతమంది డాక్టర్లు వచ్చినా 'ఇదమిద్ధ'మని తేల్చలేకపోయారు. ఆఖరికి మంచంమీంచి లేవలేనిస్థితికూడా వచ్చింది. ఓసారి వీళ్ళ కుటుంబాన్ని పరిశీలించాల్సిన అవసరం ఎంతన్నావుంది.

సంధ్య తండ్రిపేరు రాజారామ్‌బాబు. బరీసాల్ జిల్లాలో గంగానదికి చేరువగానే ఇతని జమీందారీ వుంది. షాలీమార్ లోనున్న పడవల కార్ఖానాలో కూడా ఇతనికి భాగముంది. కుస్తీ, వేట అంటే ఇతనికి చాలా సరదా. కర్రసాములో అత

నిది అందెవేసిన చెయ్యి. మృదంగం వాయించటం అతని 'హాబీ'. ఆంగ్ల గ్రంథాల్ని కూడా చాలామట్టుకు తిరగవేశాడు. "మర్చంట్ ఆఫ్ వెన్నీస్, హామ్లెట్, జూలిస్ సీజర్"లోని కొన్ని పంక్తులుకూడా ముఖస్తంగా వల్లించగలడు. మెకాలే ఇంగ్లీషు అతని ఆదర్శం.

బర్క్ పుస్తకాలంటే పడిచస్తాడు. హిందీలో తులసీ రామాయణం అతనికి ప్రియమైన గ్రంథం. అతనికి హిందీ బాగావచ్చు. కోడిగ్రుడ్లు, చేపలు, మాంసం అతనికి ప్రీతి. కాని రానురాను వాటిని పూర్తిగా మానుకున్నాడు. షోగ్గా అలంకరించుకుంటాడు. బలిష్ఠమైన శరీరం.

ఇప్పుడు ముసలాడయ్యాడు. కాని, ఈ వయస్సులో కూడా 'నలుగుర్ని తంతాను' అన్నట్టుగా వుందతనికి దేహ దారుఢ్యం. 'లేదు'అన్న పదం అతని జాతకంలోనేలేదు. ప్రతి సంవత్సరం 'దుర్గాపూజ' చాలా హడావిడిగా జరుగుతుంది. ప్రజల్లో మంచి పలుకుబడివున్న మనిషి. పెద్ద పెద్ద గవర్న మెంటు ఆఫీసర్లతో పరిచయముంది. స్నేహముంది.

అతను తల్చుకుంటే సునాయాసంగా 'రాజాబహద్దర్' టైటిల్ దొరికేది. కాని, తన కవసరం లేదన్నాడు. 'గవర్న మెంట్ హౌస్'లో అతనంటే ఎంతో గౌరవముంది. సంధ్యకు పెళ్ళయింతరవాత, ఆ యింట్లో అతని పెద్దకొడుకు 'కుమార్' చిన్నకూతురు 'ఛాయ' మాత్రమే మిగిలిపోయారు. భార్య ఏనాడో గతించింది. స్కూల్లో 'కుమార్' ప్రతీ సంవత్సరం

ఫస్టున ప్యాసయేవాడు. ఆటల్లోకూడా కుమార్ ఎన్నో బహు మతులు సంపాయించాడు. ఆరోగ్యవంతుడుగా తండ్రికిమల్లేనే వుండేవాడు.

పుష్పాలచుట్టూ తుమ్మెదలు తిరుగునట్లు అతని చుట్టూ ఆడపిల్లల సమూహం వుండేది. కాలేజీ వరండానుండి అతను బూట్సు టకటకలాడిస్తూ వెడుతూంటే, విద్యార్థినులు అలా చూస్తూ నిలబడిపోయేవారు. కాని అప్పుడే పెళ్లిచేసు కోవాలని అతని కిష్టంలేదు. యూరప్ వెళ్లి ఏదన్నా పెద్ద డిగ్రీ సంపాయించాలని అతనికి కోరికగా వుండేది. ఆ ఉద్దేశంతోనే కుమార్ ఫ్రెంచి, జర్మన్ భాషల్ని నేర్చుకోసాగాడు. ఆ ఉద్దేశం అలా వుంచుకునే 'లా'లో ప్రవేశించాడు.

అప్పుడే కుమార్ రోగగ్రస్తుడయ్యాడు. ఫలానా జబ్బని ఏ డాక్టరూ చెప్పలేకపోయాడు. రాజారామ్‌బాబుకి ఓ మిత్రు డున్నాడు. అతనొక సుప్రసిద్ధడాక్టర్. శస్త్రచికిత్సలో నిపుణుడు. అతను కుమార్‌ని చూశాడు. శస్త్రచికిత్స చెయ్యాలన్నాడు. ఆపరేషన్ చేశాడు. ఓదగ్గర చెయ్యబోయి మరోదగ్గర చేశాడు. ఫలితంగా కుమార్ చచ్చిపోయాడు.

శస్త్రచికిత్స అనవసరమనీ, అలాచేస్తే ప్రాణంమీదికే వస్తుందనీ శేఖర్‌బాబు చెప్పాడు. శేఖర్‌బాబు కుమార్ సహ పాఠి. శేఖర్ డాక్టర్‌పరీక్ష ప్యాసయి ఆరుమాసాలైంది. కుమార్ జబ్బులోనున్నప్పుడు అతనుకూడావచ్చి చూచిపోతుండేవాడు. శేఖర్‌కూడా కుమార్‌కి కావలసిన శుశ్రూష చేస్తుండేవాడు. అయితే శేఖర్ మాటల్ని రాజారామ్‌బాబు వినిపించుకోలేదు.

అదీ ఫలానా జబ్బనీ, గాలి మార్పుకోసం పర్వత ప్రాంతాలకు వెడితే నయమవుతుందనికూడా శేఖర్ చెప్పాడు. కాని ఎవరన్నా వినిపించుకుంటేగా! ఆఖరికి కుమార్‌ని చేతులారా పోగొట్టుకున్నందుకు రాజారామ్‌బాబు చాలా చాలా విచారించాడు. ఈ ఘటనతో రాజారామ్‌బాబుకి శేఖర్‌పట్ల ఆదరాభిమానాలు వృద్ధికాసాగాయి. అతని రెండోకూతురు ఛాయకూడా శేఖర్ అంటే ఎంతో గౌరవమర్యాదలు ప్రదర్శించేది. తండ్రీ కూతుళ్ళ ఆదరాభిమానాలకు పాత్రుడైన శేఖర్, వాళ్ళింటికి తరుచుగా రాకపోకలు సాగించ నారంభించాడు.

ఓనాడు రాజారామ్‌బాబు ఛాయతో అన్నాడుగదా– "చూశావా తల్లీ! వుండివుండి కుమార్ నన్ను పిలుస్తున్నట్టనిపిస్తుంది. 'మానవుల రోగాల్ని దూరం చెయ్యండి' అని చెబుతున్నట్టుగా వుంటుంది. ఇహ లాభంలేదమ్మా! వాడిపేరుతో నేనొక ఆస్పత్రి కట్టించాలని నిశ్చయించాను."

"అవునునాన్నా, ఇది చాలా బాగుంది. డాక్టర్ పరీక్ష చదువుకోటానికి నన్ను మీరు యూరప్ పంపించండి. లేడీ డాక్టర్ డిగ్రీ సంపాయించింతరవాత ఆసుపత్రి భారమంతా నేనే తీసుకుంటాను" అంది ఛాయ.

"సరే అలాగే చేద్దాం. వాడి ఆత్మకూడా తృప్తి కలుగుతుంది. ఇక్కడి చదువు పూర్తయాక యూరప్ వెదుదువుగానిలే" అన్నాడు రాజారామ్‌బాబు.

మళ్లా శేఖర్ విషయమై ఆలోచించాడు. కుర్రాడెంత మంచివాడు! బుద్ధిమంతుడు. తక్కిన కాలేజీ కుర్రాళ్ళకుమల్లే

పోకిరీ వేషాలు వెయ్యకుండా, ఏవిధమైన దురభ్యాసాలు లేకుండా ఎప్పుడూ పుస్తకాలతోనే సమయం గడుపుతాడు. ఆఖరికి ఛాయతో అన్నాడుకూడాను—

"అమ్మాయ్! నువ్వు శేఖర్‌తో కలిసి పనిచేస్తే చాలా బావుంటుందని నా ఊహ. నీకోసం అంతకన్నా మంచికుర్రాణ్ణి ఎక్కణ్ణుంచి తీసుకురాగలను?" శేఖర్ ఆడవాళ్ళంటే కాస్త దూరంగా ఉండేవాడు. ఛాయతోకూడా అంత చనువుగా వుండేవాడు కాడు. కాని ఛాయకుమాత్రం ఎప్పుడూ శేఖర్‌తో ఉత్సాహంగా ఉల్లాసంగా ఉండాలనిపించేది. అందుకే తండ్రి చెప్పిందాన్ని స్వీకరించింది; అదన్నా లేడీ డాక్టర్ డిగ్రీ సంపాయించింతరవాత. శేఖర్ కూడా ఈ సంబంధానికి ఒప్పుకున్నాడు. కాని, తనలాంటి వ్యక్తికి వివాహమంటే ఓ గొప్ప త్యాగమన్నాడు. ఆత్మహత్యతో సమానమన్నాడు. ఏమిటో?

రాజారామ్‌బాబు, పెద్దల్లుడు శశాంకను ఓసారి పిలిపించాడు. శేఖర్ని కూడా విందు కాహ్వానించి ఇద్దర్నీ పరిచయం చేశాడు. విందు ముగిసింతరవాత శశాంక, భార్యతో ఇలా అన్నాడు—"ఈ కుర్రాడు మహా పెద్ద కబుర్లాడుతున్నాడు – పండిపోయిన ముసలాడికి మల్లే." "మీకంత ఈర్ష్యగా వుందెందుకు?" అంది సంధ్య. శేఖర్‌ని చూచి శశాంకకు తృప్తికలగలేదు. ఓ పిచ్చివాడి చేతిలో ఛాయ పడింది కదా అని విచారించాడు.

*　　*　　*

# 5

కొన్నాళ్ళతరవాత రాజారామ్‌బాబు ఈ ప్రపంచంతో సంబంధం వదులుకుని పోయాడు. తన అభిరుచికి తగ్గట్టు ఛాయను తయారుచెయ్యాలనుకున్నాడు శేఖర్. ఛాయ చూట్టానికి ఎంత అందంగా వుంటుందో, ఆమె స్వభావంకూడా అంత మంచిది – కోమలమైందీనూ. ప్రతీదాంట్లోనూ నేనే వున్నానంటుంది.

విజ్ఞానవిషయాల్లో ఆమె ఎంత శ్రద్ధగా వుంటుందో సాహిత్యంలో కూడా అంతే. ఆటల్లో (స్పోర్ట్సు) ఎంత సరదా వుందో సినీమాలు, నాటకాల్లోకూడా అంతే. రేడియో కార్యక్రమాలపట్ల ఆమె ఎప్పుడూ అశ్రద్ధ చూపించదు.

వీధిలోంచి ఏదన్నా పెళ్లి ఊరేగింపు వెడుతూంటే ఛాయ గబగబా ద్వారం దగ్గరకు వచ్చి నిలబడుతుంది. చిన్నపిల్లల్లో ఎటువంటి అమాయకత్వం గోచరిస్తుందో అదే ఆమెలో కూడా మూర్తీభవించి వుంది. పాట సమానంగా రాదు గానీ, వీణమాత్రం బాగా వాయిస్తుంది. కొంత 'వైలిన్' కూడా నేర్చుకుంది. ఇన్నీ వుండికూడా శేఖర్ ఎదుటమాత్రం ఆమె గంభీరంగానే వుంటుంది.

శేఖర్ సమయం వ్యర్థపుచ్చేవాడుకాడు. అదే పాఠం ఛాయకూ కూడా నేర్పాడు. "నువ్వింకా చిన్నపిల్లకుమల్లే చిలిపిగా వుంటావేం? నువ్వు సీతాకోక చిలుకలాంటిదానివి. ఇష్టానుసారంగా తిరుగుతావు. కాని ఏమీ సంగ్రహించవు. అలా

కాకుండా నువు తేనెటీగనవాలి. మధువును సేకరించాలి. మనిషై పుట్టాక ప్రతినిమిషంకూడా ఎంతో అమూల్యమైందని గ్రహించాలి" అంటాడు శేఖర్.

ఇదంతా వింటుంది ఛాయ. శేఖర్ చెప్పిందాన్ని అమలులోకి తేవాలని ప్రయత్నిస్తుంది. ఒక్కోసారి విసుగెత్తి ఆమె ఏదన్నా నవలగానీ పత్రికగానీ చదువుతుంది. వాటిని శేఖర్ చూడగానే వెంటనే ఆపుచేస్తాడు. ఓ సారి ఆమె సినిమాకు వెళ్ళిందని శేఖర్‌కు తెలిసింది. ఆమెకోసం నిరీక్షించి ఆమె రాగానే బాగా చీవాట్లు పెట్టాడు. వెంటనే ఇంగ్లీషులో అన్నాడు – "చూడు ఛాయా! మీ అన్నయ్య ఆత్మను తృప్తి పర్చటానికి ఏ కార్యభారాన్నయితే నువ్వు నెత్తిమీద పెట్టుకున్నావో, దాన్ని ఇంత త్వరగా మర్చిపోయావా?"

ఆమె జవాబు చెప్పలేదు. తరవాత ఆమె ఖద్దరు చీరలు కట్టుకోసాగింది. డ్రాయర్లో చాక్లెట్లు మూలుగుతున్నా వాటినుండి ధ్యానం మళ్ళించుకుంది. తన ప్రవర్తన పూర్తిగా మార్చాలనుకుంది. మళ్ళీ శేఖర్ విషయమై ఆలోచిస్తుంది. శేఖర్‌కీ శశాంకకీ చాలా తేడావుంది. ఎప్పటికీ వాళ్ళభావాలు ఒకటి కానేరవు; ఒక్క విషయంలో తప్ప – కోపంవస్తే ఇద్దరూ ఇంగ్లీషులోనే ఆకోపాన్ని ప్రదర్శిస్తారు.

ఎప్పుడన్నా సంధ్య ఇంటికి ఛాయవెడితే శేఖర్ కిష్టంగా వుండదు. తనువెళ్ళటమే కాకుండా శేఖర్ని కూడా రమ్మంటుంది. దానిమీద శేఖర్ మండిపోతాడు. ఛాయ, శశాంకతో చనువుగా వుండటం చూస్తే శేఖర్‌కి మరింత ఒళ్లుమంట. అంటాడు

కదా – "ఇదిగో ఛాయా! నేను చెప్పింది నువ్వన్యథా భావించకు. నువ్వే చెప్పు, నన్నేం చెయ్యమన్నావో? నీ విషయమై బాధ్యతంతా నా మీదనే వుంది. నా కర్తవ్యాన్ని తల్చుకుని, నీకు అప్రియమైనా ఒక్కోసారి కటువుగా మాట్లాడాల్సివస్తుంది. మరోసంగతి – శశాంకతో నువు అంత చనువుగా తిరగటం మంచిదికాదు. లోకులు నీ చరిత్రను సందేహిస్తారు." ఇంతకూ ఛాయ తనకు కాబోయే భార్య – కాబట్టి ఆమాత్రం అనుమానం వుంటం సహజమేనేమో!

శేఖర్ మనస్సు నెందుకు కష్టపెట్టాలి అనే ఉద్దేశంతో తరుచుగా భవానీపూర్ (సంధ్య ఇంటికి) వెళ్ళటం మానుకుంది ఛాయ. తన ఆనందానికి శేఖర్ అడ్డుపడుతున్నందుకు ఛాయ చాలా విచారించింది. ఏడ్చింది. కాని లాభం...?

శేఖర్‌కూ తనకూ వున్న సంబంధం ఏమిటి? తనమీద అతనెందుకు అధికారం చలాయించాలి! అతని మాటల్ని తనెందుకు వినాలి! అత నాజ్ఞల్ని తనెందుకు పాలించాలి! అతనిముందు తన నిరంకుశత్వమంతా ఏమైపోతోంది! అతనంటే తనెందుకు అంతగా భయపడాలి! ఇదంతా ఏమిటి?... ఎందుకు?...ఏమో!

ఓసారి శేఖర్ అన్నాడు కూడాను. "ఛాయా! సాధారణంగా స్త్రీలు పురుషులనుండి ఆశించే పొగడ్తలు నా నుండి నీకు లభించవు. అయితే నేను నీకిచ్చింది – అన్నిటికన్నా ఎక్కువ సత్యమైందీ అమూల్యమైందీ అని మాత్రం గ్రహించు."

* * *

# 6

శేఖర్ చేస్తున్న 'రిసెర్చి' పూర్తయిపోయింది. యూరప్‌లో నున్న ఒక సుప్రసిద్ధ వైజ్ఞానిక సంస్థకు తన 'రిసెర్చి' వ్యాసాన్ని పంపించాడు. అక్కడివాళ్లు ఇతని రిసెర్చిని శ్లాఘిస్తూ శేఖర్‌కి స్కాలర్‌షిప్‌కూడా ఇచ్చారు. ఇంకా యూరప్‌కు వెళ్ళి ఏదన్నా పెద్దడిగ్రీ సంపాయించాలనే కోరిక కలిగింది. వెళ్ళేప్పుడు ఛాయతో విశేషంగా ఏమీ సంభాషణ జరగ లేదు గాని – "ఇదిగో ఛాయా! నే వెడుతున్నా కాని, నీ కర్తవ్యపాలనలో నువు అశ్రద్ధ చెయ్యవని నాకు గట్టి నమ్మకం, కాబట్టి జాగ్రత్తగా వుండు" అన్నాడు శేఖర్.

"మరేం సందేహించ నవసరంలేదు" అంది ఛాయ.

"నీ పుస్తకాలన్నీ ఆ బీరువాలో వుంచాను. నువ్వో తర్చుగా మీ బావగారింటికి రాకపోకలు సాగిస్తే నీ కర్తవ్య పాలనానికి తప్పకుండా 'బ్రేక్' పడుతుందేమోనని నా కను మానంగావుంది. నేనతన్ని అనుమానిస్తున్నానని అనుకోవద్దు. అతను చాలా మంచివాడు. కాని, అతనికి ఓ నిశ్చితమైన ఆదర్శంమీద నమ్మకంలేదు. దేన్నీ ఆదర్శంగా తీసుకోడు. అందుకని అతనెప్పుడన్నా దెబ్బతింటాడేమోనని నాకు సందే హంగావుంది. ఆఁ! నువు చదవాల్సిందంతా ఎర్రపెన్సిలుతో అండర్‌లైన్ చేశాను. ఇంతే" అన్నాడు శేఖర్.

శేఖర్ వెళ్ళిపోయింతరవాత ఛాయ చదువులో లీన మైంది. ఊసుపోటానికి ఆమె అప్పుడప్పుడు వీణవాయించేది. ఒకోక్కసారి ఆమెకు చదువునుండి విసుగనిపిస్తుంది. ఎందుకు

వచ్చినచదువు? తన స్వాతంత్ర్యాన్నీవిధంగా ఎందుకు భంగ పర్చాలి? టేబిలుమీాదనున్న శేఖర్ ఫోటో కనిపిస్తుంది. Time Table అంతా మళ్ళీ జ్ఞాపకం చేస్తున్నట్టనిపిస్తుంది. మళ్ళీ అనుకుంటుంది - ఆహా! ఏం ప్రతిభ!...ఏం తపస్సు!... ఎంత నిర్మలమైనచరిత్ర!...తనెంత అదృష్టవంతురాలు! అవును! శేఖర్ తన కాబోయేభర్త...దైవము...శశాంక అతన్ని ఎగతాళిచేశాడు. శేఖర్ దృష్టంతా తనడబ్బుమీాదే వుందన్నాడు. కాని, శేఖర్ ఏమన్నాడూ? ఒక దమ్మిడీకూడా అవసరంలేదన్నాడు. స్వార్జనమీాదే ఆధారపడతానన్నాడు. ఆమెతండ్రి శేఖర్ని చదువుకోటానికి యూరప్ పంపిస్తానంటే వద్దన్నాడు. శేఖర్ లో ఇటువంటి ఉన్నతభావాలున్నందుకు ఛాయకు చాలా గర్వమనిపించింది. సంతోషించింది. ఇంకా...

♦ ♦ ♦

# 7

ఆరంభంలో ఇంగ్లాండునుండి శేఖర్ ప్రతీసారి నాలుగైదు కాగితాల్లో భారతంలాంటి ఉత్తరాల్ని ఛాయకు రాస్తుండేవాడు. వాటినిండా ఉపదేశాలే వుండేవి. కొన్నాళ్ళ తరవాత శేఖర్ నుండి టెలిగ్రాం వచ్చింది. దాంతో ఆమెకు 'షాక్' కొట్టినట్టయింది. తనచదువుకయ్యే ఖర్చుకోసం 'అర్జంటు'గా డబ్బు (మోతాదు కాస్త ఎక్కువ) పంపించమనివుంది. శేఖర్ విషయమై ఆమెకెంత గర్వముండేదో, దీంతో క్రుంగిపోయింది.

తన మేనేజర్ చేతికి టెలిగ్రామ్‌నిస్తూ 'రూపాయలు...' ఆమెమాటకు అడ్డువస్తూ మేనేజర్ అన్నాడు – "ఏం, ఆశ్చర్యంగావుందా? మీ శేఖర్ బాబు నీ డబ్బుని ముట్టుకోడనే నా కిప్పటివరకు తెలుసు." అసలు శేఖర్ పేరు మేనేజర్ కి గిట్టేదికాదు. "కాని, పరదేశంలో..." పాపం! మాటను పూర్తిచెయ్యలేకపోయింది ఛాయ.

"అవునమ్మా. పరదేశం వెళ్ళగానే ఈ దేశంయొక్క స్వభావాన్ని వదిలిపెట్టి పూర్తిగా మారిపోతారు. అతనడిగింది మనమెలా ఇవ్వగలం! ఇంకా ఇది ఆరంభం. ఈ అభ్యాసం ఇంకా రోజులు గడుస్తూన్నకొద్దీ ఎక్కువకావచ్చు. అవుతుంది కూడాను," అన్నాడు మేనేజర్.

"కాని, పరదేశంలో డబ్బులేకపోయినందువల్ల అతనెన్ని చికాకులు పడుతున్నారో!"

"సరే, అలాగేకానీ తల్లీ ! నేను డబ్బుపంపించేస్తాను. కాని మళ్లీ మళ్లీ చెబుతున్నా – డబ్బడగటం ఇది మొదటిసారి, దీనికి అంతులేదనిమాత్రం గుర్తుంచుకో."

మేనేజర్ చెప్పింది అక్షరాలా నిజమైంది. కొద్దిరోజుల తరవాతనే మళ్లీ, మొదట పంపించిన సొమ్ముకన్నా ఎక్కువ సొమ్ము పంపించమని టెలిగ్రాంవచ్చింది. ఆరోగ్యం బాగుచేసుకోటానికని కారణం చెప్పాడు.

"శశాంకబాబు సలహా తీసుకుంటే మంచిదని నా అభిప్రాయం." అన్నాడు మేనేజర్.

"మీ రింకేమన్నా చెయ్యండిగాని, అక్కయ్యకూ బావకూ ఈ సంగతి చెప్పకండి. మీ కనేక వేల నమస్కారాలు" అంది ఛాయ గాబరాపడుతూ.

"మనం ఈవిధంగా స్వతంత్రిస్తే లాభంలేదమ్మా."

"ఎప్పటికైనా ఈ డబ్బంతా అతనిదేగా!"

"అవునమ్మా! అది నిజమేకాని ఇదంతా వ్యర్థంగా పోకుండాచూట్టం నా కర్తవ్యమవునా; కాదా?"

"ఆరోగ్యం కాపాడుకోటానిక్కాదూ అతనడిగారు! ఇందులో సందేహించాల్సినఅవసరం నాకేమీ కనపట్టంలేదు."

"జబ్బులు అనేకరకాలుగా వుంటాయితల్లీ! ఇదెలాంటి జబ్బో నాకేమీ బోధపడకుండావుంది. ఇక్కడికి వచ్చేస్తే, గాలిమారింతరవాత త్వరగా బాగవుతాడేమోనని నా ఊహ. శేఖర్నిక్కడికి రమ్మని ఉత్తరం రాయకూడదూ?"

శేఖర్ తిరిగిరావటం ఛాయ కిష్టమేగాని అతనిచదువు కంతరాయం కలుగుతుందేమో! "సరే, ఈసారికూడా డబ్బు పంపించేస్తున్నాను. కాని దీంతో డాక్టర్ గారికి (అంటే శేఖర్) జబ్బు నయమయేబదులు ఇంకొంచెం ఎక్కువవుతుందేమోనని నా అనుమానం," అన్నాడు మేనేజర్.

మేనేజర్ మాటలు ఛాయహృదయాన్ని గాయపర్చాయి. ఆమె చిన్నిహృదయంలో ఎన్నో భావాలువచ్చాయి, పోయాయి. ఆమెమనస్సులోకూడా శేఖర్ పట్ల తాత్కాలికంగా అనుమానబీజ మంకురించింది. ఒకోసారి ఈ సంగతి సంధ్యతో

చెబితే బాగుంటుందేమో ననుకునేది. ఇదేసమయంలో సంధ్య జబ్బుగావుంది. జబ్బు ఫలానా అని తేల్చటం కష్టంగావుంది. "ఏదన్నా చెయ్యండిగాని, శస్త్రచికిత్సమాత్రంవద్దు," అన్నాడు శశాంక.

* * *

## 8

ఇప్పుడు శశాంక చేతిలో రెండు పెద్దపనులున్నాయి. గంగాతీరంలోనున్న 'జూట్‌మిల్' పని ఒకటి. రెండోది - టాలీగంజ్‌వైపు 'మిాంక్‌పూర్' జమిాందారుగారి తోటలో ఓ కొత్త భవనం నిర్మించటం. జూట్‌మిల్ పనివాళ్ళ ఇళ్లు మూడు మాసాల్లో తయారవాలి. శశాంకకు ఎక్కడా తీరిక చిక్కటం లేదు. సంధ్య జబ్బుకారణంగా విధిగా యింట్లోనే వుండాల్సి వస్తోంది. కాని మనస్సంతా పనిమిాదనే వుంది.

పెళ్ళయి ఇన్నాళ్ళయింది కాని, సంధ్య కెప్పుడూ ఇటు వంటి జబ్బు రాలేదు. అందుకే మళ్లా ఆమె మామూలు మని షిలా తిరుగాడుతుందో లేదో నని అనుమానంకొద్దీ శశాంక గింజుకుంటున్నాడు. పనికి వెళ్ళటం మానేసి ఇటూఅటూ తిరు గుతూ సంధ్య మంచందగ్గరికివచ్చి కూర్చున్నాడు. "ఎలావుంది సంధ్యా?" అన్నాడు.

"మిా రనవసరంగా ఇదవకండీ, నేను బాగానే వున్నాను" అందామె.

ఆ జవాబుతో కాస్సేపటివరకు శశాంకకు ఏదో భారం తగ్గిపోయిన ట్టనిపించింది. సంధ్య మంచంమిాద నున్నా భర్తకు

అన్నీ సౌకర్యాలూ జరుగుతున్నవో లేదో నని మనస్సులో బాధపడేది. ఇంట్లో నౌకర్లు ఎలా పనిచేస్తున్నారో, వంటవాడు సరిగా వండిపెడుతున్నాడో లేదో, ఖాద్య సామాగ్రిలో ఏ నెయ్యి కలుపుతున్నాడో, సమయానికి నౌకరువెధవ అతను స్నానం చెయ్యటానికి స్నానాలగదిలో వేడినీళ్లు వుంచాడో లేదో—

ఆ దొంగముండ పరుపుమీద చాకింటినుండి వచ్చిన దుప్పటి పర్చిందో, లేక ఆ మాసిపోయిందే ఇంకా వుందో, చాకలిపద్దులు సరిగా ఎవరన్నా చూస్తున్నారో లేదో, అతని బట్టలు చాకలివెధవ తీసుకురాలేదేమో—ఈ ఆలోచనలు ఆమె మనస్సులో తిరుగుతున్నాయి. దాంతో ఆమెకు జ్వర తీవ్రత ఎక్కువైంది. ఆఖరికి మరేమీతోచక ఛాయను పిలిపించింది సంధ్య. "చెల్లాయ్! కొన్నాళ్లు నువ్వు కాలేజీకి శెలవుపెట్టి నా ఇంటిని కాస్త జాగ్రత్త పెట్టమ్మా!" అంది సంధ్య.

అక్కకు శుశ్రూష చెయ్యాలి అనే భావంతో ఛాయ చాలా సంతోషించింది. పైగా ఇది ముందుముందుకి తనకెంతో ఉపకరిస్తుంది కూడాను. మరి, ఆమె డాక్టర్ పరీక్షకూడా చదవాలిగా! రోగియొక్క టెంపరేచర్ చార్ట్ జాగ్రత్తగా నోట్ చేసుకుంది. జబ్బువిషయమై డాక్టరేది చెప్పినా అవి గుర్తుంచుకునేది. తన M. Sc. పరీక్షలో 'శరీరతత్వం' అనే 'సబ్జక్టు'కూడా వుంది.

అందుకే రోగంయొక్క తత్వాన్ని బోధపర్చుకోటంలో ఆమెకు ఎక్కువ కష్టం కలగలేదు. తను చదవబోయే డాక్టర్

పరీక్షకు ఇప్పటినుండీ కాస్త అనుభవం సంపాయించవచ్చు. చాలామట్టుకు Matter కూడా దొరుకుతుంది. "డాక్టర్ చెప్పిందల్లా అక్షరాలా పాలించాలి. ఈ బాధ్యత నామీద నుంది తెలుసా? కాబట్టి నేను చెప్పినట్లు నువు వినాలి" అంది ఛాయ మొహంలో గాంభీర్యం తెచ్చుకుంటూ.

"ఈ గాంభీర్యం ఎవరిదగ్గర నేర్చుకున్నావు ఛాయా? నువు నా విషయమై పట్టుదల చూపించ నవసరంలేదు. నువ్వేదో నా ఇల్లు చక్కబెడతావని నిన్ను పిలిపించాను" అంది సంధ్య. ఆమె ఆలోచించింది—

తన జబ్బు బాగవుతుందో లేదో-తను చనిపోతే, తన భర్తకు సేవచేసే వారెవరున్నారు? - భర్తకు అన్నివిధాలా అసౌకర్యాలు జరుగుతుంటే తన ఆత్మకు తృప్తివుండదు-ఏదో ఛాయ వుంది గాబట్టి సమయం ఇలాగన్నా గడుస్తోంది. అయినా ఛాయ మాత్రం ఎన్నాళ్ళుంటుంది? పెళ్ళయాక ఛాయకూడా అత్తారింటికి పోవల్సిందేగా! మళ్ళీ ఛాయను పిల్చి ఇలా అంటుంది—

"ఛాయా! మీ బావగారి సిగరెట్ కేసులో సిగరెట్లు నింపెయ్యమ్మా! ఆయనకు బొత్తిగా అశ్రద్ధ. నువ్వేదో చూడు తల్లీ! నువు మంచిదానవు కదూ! అదిగో - అతను జేబులో మాసిన రుమాలుపెట్టుకున్నారేమో, మరో రుమాలు అతనికిచ్చెయ్యమ్మా. ఛీ, ఛీ, మీ బావగారి జోళ్లు చూశావా ఎంత అసహ్యంగావున్నాయో. ఆ నౌఖరు వెధవ నోసారి పాలిష్

చెయ్యమని చెప్పు. అతని ఆఫీసు గదిలోకి వెళ్ళి ఓ సారి చూడమ్మా – టేబిల్ మీద క్యాష్ బాక్స్ తాళాలు పడేసి వెళ్ళి పోయారేమో. కాస్త దాన్ని జాగ్రత్తపెట్టు."

♦ ♦ ♦

## 9

ఛాయ ఇంతకుముందల్లా పుస్తకాల్లోనే సమయం గడిపేది. ఇంటిపనుల బాధ్యత ఆమెకేమీ వుండేదికాదు. ఇక్కడికి వచ్చినతరువాత ఇదంతా చూస్తూ చాలా ఆశ్చర్యపోయింది. కొంత అలవాటైందికూడాను. అయినా ఆమెకు ఆనందంగానే వుంది. ఇంట్లోపనంతా సంధ్య చెప్పినట్టు ఛాయ ఎంతో ఉత్సాహంతో చేసిపెట్టేది.

ఛాయ వచ్చినతరువాత శశాంకకు మరేవిధమైన అసౌకర్యమూ జరుగలేదు. ఛాయ సాంగత్యంలో శశాంక తనను తాను మర్చిపోయేవాడు. రోజంతా పనిగొడవే. ఒక్కోసారి సంధ్యకు ఒంట్లో ఎలావుందో ఏమిటో అని విచారంగావుండేది. మళ్ళీ, ఛాయవుంది కదా అని కాస్త ధీమాగా వుండేవాడు. అవును, ఛాయ వుంది కదూ!

ఛాయ...ఛాయ...మనస్సులో ఆమె నామాన్ని శశాంక ఎన్నిసార్లు జపించుకున్నాడో! ఎందుకో – కారణం తనకే తెలీదు. తను ఆమెను ప్రేమిస్తున్నాడా? అవును! ప్రేమిస్తున్నాడు. ఎలా? ఎటువంటి ప్రేమ?...కామమా?... లేక...? ఛీ! ఛీ! ఏమిటీ పాడు ఆలోచనలు? ఛాయ తన

చెల్లెల్లాంటిది. అవును, ఛాయను తన సోదరిలా ప్రేమిస్తు న్నాడు. ఆమె అమాయకత్వం అతన్ని ముగ్ధుణ్ణి చేసింది. నిజంగా ఛాయ చాలా మంచిపిల్ల-చురుకైంది. తెలివైంది-పని పూర్తికాకుండానే పరుగెత్తేవాడు శశాంక. ఆమె సాంగత్యంలో శశాంక చాలా హుషారుగా ఆనందంగా వుండేవాడు. ఛాయ కూడా అలాగేవుండేది.

సంధ్యకుకూడా చాలా తృప్తిగా వుండేది. అప్పటికీ ఆమె మనస్సుండబట్టక భర్తను "మీకు అన్ని సదుపాయాలు సవ్యంగా జగుతున్నయ్యా?" అని అడుగుతుంది సంధ్య.

"నువ్వనవసరంగా ఇలాంటి విచారాలు మనస్సులో పెట్టుకోవద్దు సంధ్యా. అన్నీ బాగానే వున్నాయి. ఒకవ్వేడే వన్నా పొరపాటు జరిగితే మనం సర్దుకోవాలంటావా లేదం టావా? ఛాయ ఇంకా చిన్నపిల్ల. దానికేం తెలుస్తుంది?" అంటాడు శశాంక.

శశాంక తనపనిలో మునుపటిలాగా చురుగ్గా లేడు. కాస్త అశ్రద్ధ చూపించసాగాడు. అతని మనస్సు చికాకుగా వుందేమోనని జబర్దస్తీగా అతన్ని రేడియోదగ్గర కూర్చోబెడు తుంది ఛాయ. మళ్ళా పొద్దున్నవగానే పనిలోకి పోతాడు చిరాకుపడుతూ. మధ్యాహ్నం మూడుగంటలవుతుందో లేదో, ఛాయను చూట్టానికి, ఆమెతో సర్దాగా కాలక్షేపం చెయ్య టానికి అతని మనస్సు తహతహ లాడుతుంది.

ఒక్కోసారి శశాంక పనినుండి రావటం ఆలస్యమైతే ఛాయ మూతి బిగిస్తుంది. ఆమెను ఒప్పించటానికి శశాంక

ముత్తాతలు దిగివచ్చేవారు. తరవాత 'లాన్'లో టెన్నిస్ ఆట్టానికి ఆమెను లాక్కుపోతాడు. కావాలనే శశాంక ఓడిపోతాడు.

ఆదివారంనాడు శశాంక తన ఆఫీసుగదిలో ఎర్రపెన్సిల్ పట్టుకుని సిగరెట్టుమీద సిగరెట్ కాలుస్తూ ఎదురుగుండా ఓ పెద్ద డ్రాయింగ్ పెట్టుకుని దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. గబగబా ఛాయవచ్చి కారులో తిరిగివద్దామని బలవంతంగా ఈడ్చుకుపోయింది.

శశాంక ఆఫీసుగదిలో ఏదో డ్రాయింగ్ చూస్తూంటే, "బావా నాకూడా కాస్త నేర్పించకూడదూ?" అంటుంది ఛాయ. డ్రాయింగంతా బోధపరుస్తాడు శశాంక. అతను చెప్పిందంతా బోధపర్చుకుంటుంది ఛాయ. దానికి సంబంధించిన లెక్కలు వగైరాలు ఆమెకేమీ కష్టమనిపించేది కాదు. ఆమె చురుకుతనాన్ని శశాంక చాలా మెచ్చుకునేవాడు. ఆమెకేదో 'ప్రాబ్లెమ్' ఇస్తాడు. త్వరలోనే దాన్ని 'సాల్వ్' చేస్తుంది.

ఇంటికి డ్రాయింగ్సు ఇంకా తదితర కాగితాలు తీసుకువచ్చి అదంతా చూస్తుంటాడు శశాంక. అదే సమయంలో ఛాయకూడా హాజరై అతనికి సహాయంగా వుంటుంది. ఇదంతా సంధ్య కిష్టంలేదు. మగవాళ్ళతోపాటు ఆడవాళ్లుకూడా ఉద్యోగాలు చెయ్యటమూ? ఏమిటీ విడ్డూరం! ఎవరన్నా వింటే - కాదు, చూస్తే నవ్విపోతారు.

ఓనాడు ఛాయనుపిల్చి-"ఏమే ఈ కొలతలు, లెక్కలు, డ్రాయింగులు నీకంత సరదాగా వున్నయ్యా ఏమిటి?" అంది సంధ్య. "అవునక్కా, చాలా సరదాగా వుంటుంది" అంది

ఛాయ నవ్వుతూ. శశాంకనుకూడా పిల్చి సంధ్య ఇలా అంది- "మీరు దానితోపడి సమయం వ్యర్థం చేస్తున్నారేమండీ? అది నిన్నటి పిల్ల. దానికివంతా బోధపడుతుందా? అనవస రంగా మీరు మరీనూ!"

"అలా అంటావేం సంధ్యా? నేను చెప్పిందల్లా ఛాయ బాగానే బోధపర్చుకుంటుంది. నే నిచ్చిన ప్రాబ్లెమ్స్‌కూడా త్వరలోనే 'సాల్వ్' చేస్తుంది. ఎలాగన్నా ఛాయ చాలా చురుకైంది" అన్నాడు శశాంక.

భర్తజవాబు సంధ్యకేమీ తృప్తి నివ్వలేకపోయింది. మళ్లీ అతనికి అన్ని సౌకర్యాలూ జరుగుతున్నాయో లేదో అనే విచారం ఒకటి. ఇవతల సంధ్య చెప్పినట్టుగా ఛాయ వంటింట్లో కుర్చీ వేసుకుని వంటమనిషికి అన్నీ చెబుతుంది -

ఫలానాకూర వండాలి - అందులో ఇంత ఉప్పువె య్యాలి - మసాలా ఇంతవెయ్యాలి - ఫలానాపచ్చడి - ఫలానా ఏంకర్మ - కొబ్బరిపచ్చడి అతనికెంతో ఇష్టం - హల్వాలో ఇంతనెయ్యి వెయ్యాలి - అన్నట్టు 'టీ' నిండుకున్నట్టుంది - నౌఖరుచేత టీ తెప్పించింది - మనలో మనమాట - ఆ మాట కొస్తే ఏమాటకామాటే చెప్పుకోవాలి - ఏమంటారు? వంట మనిషికి వంట తెలీదూ? అయినా అది సంధ్యారాణి ఆజ్ఞ. ఆమె ఆజ్ఞను ఛాయ శిరసావహించాలి. ఆఁ! అయితే...

ఇదంతా పురమాయిస్తూ మధ్యను వంటావిడ తనకథ చెబుతుంటే అదికూడా వింటోంది. అదేసమయంలో శశాంక అక్కడికివచ్చి గబగబా ఛాయను "విక్టోరియా మెమోరియల్

బిల్డింగ్" చూపించటానికి తీసుకుపోతాడు. ఇంకానయం! ఆ భవనం తన 'కంట్రాక్టరు గిరి'లోనే తయారైందన్నాడు కాడు.

వంటగదిలోనుండి ఛాయ వెళ్ళిపోయి నా భోజనసామగ్రిలో ఏవిధమైన లోపమూ వుండేదికాదు. అప్పటికీ సంధ్యకు తృప్తిగా వుండేదకాదు. ఆమెమనస్సు అదోలావుండేది. తనలో అనుకునేది – "చనిపోయేముందు, నేను బాగా బోధపర్చుకున్నాను. అన్నీచేశాను. అనుభవించాను. కాని, నేనతన్ని ఏవిధంగానూ తృప్తిపర్చలేకపోయాను.

ఛాయ నా ప్రతిస్వరూపమే ననుకున్నాను. కాని, ఛాయ! నేను కాదుగా! అసలు ఛాయ పూర్తిగా ఛాయ. మరో స్త్రీ! ఆమెలో నా ప్రతిబింబముంటుందనుకోటంలో నేను పొరబడ్డానేమో! ఛాయ నా స్థానాన్నాక్రమించలేదు. మరి, నేనుకూడా దాని స్థానాన్నాక్రమించలేనేమో ! నేనుపోతే ఏదోకొంత నష్టం. కాని, ఛాయపోతే అంతా శూన్యమే."

♦ ♦ ♦

# 10

రోజులు ఈవిధంగా దొర్లిపోతున్నాయ్. ఛాయ ఆలోచించింది – ఏమిటిదంతా? తనకర్తవ్యం? శేఖర్ చెప్పిందంతా అప్పుడే మర్చిపోయిందా? ఆమెచదువు? లేడీడాక్టర్ డిగ్రీ? తనహాస్పిటల్? పుస్తకాలు? ఇంకా...?

వెంటనే ట్రంకులోనున్న పుస్తకాల్నితీసి ఛాయ చదవనారంభించింది. గబగబా శశాంకవచ్చి ఆమె పుస్తకాల్ని ట్రంకులోపెట్టి దానిమీద కూర్చున్నాడు. "బావా! ఈ జబ

ద్రస్తీ ఏమంత బాగాలేదు. నా సమయాన్ని వ్యర్థంచెయ్యక నన్ను చదువుకోనివ్వాలి" అందామె. "నీ సమయం వ్యర్థం చేస్తే నాక్కూడా సమయం వ్యర్థమవుతుందికదా. ఇక్కడికిది 'చెల్లు' అయిపోయిందిగా !" అన్నాడు శశాంక.

"ఇప్పటికి నేను వ్యర్థంచేసింది చాలు. ఇహానుండి శాస్త్ర చదువుకోవాలి. ఇక్కడ యూనివర్సిటీ డిగ్రీ సంపాయించింతరవాత ఇంగ్లాండు వెళ్ళి లేడీడాక్టర్ పరీక్ష చదవాలి."

"తరవాత ?"

"తరవాత నే నొక హాస్పిటల్ స్థాపించి, ఆ భారం కూడా నేనే వహించాలి."

"ఇంకెవరి భారం వహించాలి ? శేఖర్ అనే డాబులు రాయుణ్ణా ? అనామకుణ్ణా? వాడి..." ఏదో అనబోయాడు శశాంక. కాని ఛాయ అతని నోరు మూసింది. అంది కదా- "ఛత్ అలాగ మాట్లాడితే దెబ్బలాటైపోతుంది."

హోలీ పండుగవచ్చింది. శశాంకకు పనిఒత్తిడివల్ల హోలీ ఆట్టానికి తీరికలేకపోయింది. మంచంమీదనున్న సంధ్యకు శాస్త్ర 'గులాల్' (కుంకంలాగే వుంటుంది. దాంతో బట్టలు చెడిపోవు. తుడిచేస్తే పోతుంది)పూసినమస్కరించిందిఛాయ. ఆఫీసు గదిలో శశాంక ఏదో లెక్కలుచూస్తూ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఛాయ మెల్లిగా అడుగులువేస్తూ అతనిమొహం నిండా గులాల్ పూసింది.

శశాంక ఊరుకుంటాడా ? టేబిలుమీదనున్న ఎర్ర సిరా అంతా ఛాయమీదకు విసిరాడు. పారిపోతున్న ఛాయను

పెట్టుకుని ఆమె మొహానికి గులాల్ పూశాడు. కేరింతాలతో గదంతా చిందరవందరైంది. సంధ్య కేక వినిపించగానే ఇద్దరూ ఊరుకున్నారు.

తరవాత ఛాయ తన గదిలోకి వెళ్ళింది. కిటికీదగ్గర నిలబడి తోటలోకి చూస్తూ జరిగిందంతా ఆలోచించింది. నవ్వొకుంది. శుభ్రంగా స్నానంచేసి బట్టలు మార్చుకుని మంచంమీద కూర్చుంది. తరవాత నిద్రపోయింది. రాత్రి మూడుగంటలకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. నాలుగు వైపులా చూచింది.

ఆకాశంలో చంద్రుడు దాగుడుమూతలాడుతున్నాడు. గదిలోదీపంలేదు. అంతా చీకటి. కిటికీలోనుండి వస్తున్న వెన్నెల మాత్రం తెల్లని దుప్పటిమీద పడుతోంది. ఎందుకోగాని ఛాయకు అకారణంగా ఏడుపువచ్చింది. తలగడలో మొహం దాచుకుని ఆమె ఏడవసాగింది. అది హృదయరోదన. తేలికైన భాషలో దాన్ని బోధపర్చుకోవటం చాలా కష్టం. దాని కసలు అర్థమేలేదేమో!

అడిగితే ఆమె మాత్రం ఏం జవాబిస్తుందీ? తనెందు కేడుస్తుందో తనకే తెలీదేమో! ఆడవాళ్లు ఒక్కోసారి కారణం లేకుండానే ఏడుస్తారేమో! అలాగే మళ్ళీ ఆమెకు కునుకు పట్టింది. పొద్దున్న ఆలస్యంగా లేచింది. గడియారం ఏడుగంటలు కొట్టింది. గబగబా కాలకృత్యాలు తీర్చుకుని సంధ్య దగ్గరకు వెళ్ళి—

"అక్కా నువు చెప్పిన ఏ పనీ నేను చెయ్యలేకపోతు

న్నాను. నువ్వు అనుమతిస్తే ఇంటికి వెళ్లిపోతాను" అంది ఛాయ. ఈ వేళ మాత్రం 'వెళ్ళొద్దు' అనలేకపోయింది సంధ్య. "సరే, నీ చదువుకేమన్నా ఆటంకం వస్తుందేమో! వెళ్ళు. సంతోషంగా వెళ్లు. అప్పుడప్పుడు అవకాశం దొరకినప్పుడల్లా ఓ సారి వచ్చి చూచి పోతూవుండు" అంది సంధ్య.

* * *

# 11

ఇంటికిరాగానే శేఖర్ ఉత్తరం చూచింది ఛాయ. ఎన్నాళ్ళనుండి వచ్చిపడుందో! ఓవిధమైన జంకుతో, భయంతో ఉత్తరాన్ని ఒకంతట విప్పలేకపోయింది. అంతకుముందు శేఖర్ ఉత్తరానికి "అక్కకు జబ్బుగావుంద"ని రాసింది. ఆమె మనస్సులో మళ్లీ భయం. శశాంక ఇద్దరు నర్సుల్ని నియోగించాడు. ఒకర్తె రాత్రికి, మరొకర్తె పగలు. అప్పటికీ ఆమె సహాయం కావల్సివచ్చింది.

అక్కకు జబ్బుగావుందని రాసినా, ఇదొక పెద్ద కారణంగా తీసుకోడు శేఖర్. తనుచేసిన ఈ అశ్రద్ధకు శేఖర్ క్షమించడేమో! సరే, జరిగిందానికి పశ్చాత్తాపపడి శేఖర్‌ని క్షమించమని వుత్తరంరాస్తుంది. తన తప్పులన్నీ ఒప్పుకుంటుంది. ఇహనుండి తన చదువులో ఎటువంటి ఆటంకమూ రానివ్వదు.

కవరు చింపేముందు, ఆమెదృష్టి శేఖర్ ఫోటోమీద పడింది. ఆమెకు తెలుసు. శశాంకగానీ ఈ ఫోటోనుచూస్తే ఎంతో ఎగతాళి చేస్తాడని. చేస్తే చెయ్యనీ! శేఖర్‌తో తనకు పెళ్లికానుంది. శేఖర్ తనకిచ్చిన ఉంగరాన్నికూడా దాచేసింది. దాన్నిచూస్తే శశాంక మరీ ఎగతాళిచేస్తాడు. ఆమె నిశ్చ

యించుకుంది - సరే, ఇహానుండి శేఖర్ విషయమై ఎవరేదన్నా ఘోరంగా వాదిస్తుంది - వాటిని ఖండిస్తుంది.

ఈ ఆలోచనల్తో పెట్టెలోనుండి ఉంగరంతీసి వ్రేలికి పెట్టుకుంది. కవరువిప్పి ఉత్తరాన్ని చదివింది. సంతోషంతో వెర్రిగా ఓ పొలికేక వేసింది. సంతోషంకొద్దీ ఆమెకు సహజంగా రాకపోయినా ఏదో వెర్రి మొర్రినాట్యం చేసింది. అల మారుమీదనున్న వీణతీసి, ధూళిదులపకుండా, తీగెలన్నా సరి చెయ్యకుండా తలా తోకా లేకండా వాయించ నారంభించింది.

అప్పుడే శశాంక ప్రత్యక్షం-

"సంగతేమిటి? బలే హుషారుగావున్నావు. పెళ్లి ముహూర్తంకానీ నిశ్చయమైందా ఏమిటి?" అన్నాడుశశాంక.

"అవును."

"అయితే మరేం గొడవల్లేవన్నమాట."

"ఉఁహుఁ!"

"అయితే బ్యాండుపార్టీ వాళ్ళకు అడ్వాన్సు ఇవ్వనా? స్పెషల్‌గా మిఠాయిలు తయారుచెయ్యమని చెప్పనా?"

"అంత కష్టపడ నవసరంలేదు."

"అన్నీ నువ్వే చేసుకుంటావా? ఓహో వీరాంగన! ధన్యురాలవు ఛాయా! అయితే పెళ్లికూతురుకి ఆశీర్వాదం కూడా అవసరంలేదా?"

"ఆశీర్వాదానికి కావల్సిన డబ్బు నా దగ్గరనుండే వెళ్లింది."

"అసలు సంగతేమిటో చెబుదూ."

"ఇదిగో ఈ ఉత్తరం– అంతా చెబుతుంది;" అంటూ ఉత్తరాన్నిచ్చింది.

అది చదివాక గదంతా ప్రతిధ్వనించేచేట్టు నవ్వాడు శశాంక. శేఖర్ ఇలా రాశాడు –

"ఏ రిసెర్చిపనైతే నేను వూనుకున్నానో అది భారత దేశంలో సంభవంకాదు. అందుకోసం నా జీవితంలో మరో మహత్తరమైన త్యాగాన్ని స్వీకరించాల్సివచ్చింది. ఛాయతో వివాహసంబంధం తెంపుకోటంతప్ప వేరే గత్యంతరంలేదు. ఒక యూరోపియన్ మహిళ నన్ను వివాహంచేసుకుని నా పనిలో సహాయం చెయ్యటానికి ఒప్పుకుంది. పనిఒక్కటే – అది భారత దేశంలోచేసినా – ఇక్కడిచేసినా ఒక్కటే. ఆ పనికి ఆర్థికసహాయం చెయ్యాలని రాజారామ్‌బాబుకి చాలా ఉబలాటంగా వుండేది.

"గనుక ఆ డబ్బులోని కొంతభాగం ఇక్కడ సద్వినియోగం చెయ్యటం ఎంతమాత్రం అన్యాయంగాని, అనుచితం గాని కాదని నాకుతోచింది. ఈ విధంగాచేస్తే మృతవ్యక్తిపట్ల సన్మానమేననీ – తత్రాపి అతని ఆత్మకు తృప్తిగానే వుంటుందనీ నా అంతరాత్మ ఘోషించింది."

"సరే, మళ్ళీ నీమనస్సు మారదుగదా ?" అన్నాడు శశాంక.

"మారినా ఇందులో నీకేమన్నా నష్టముందా బావా?" అంది ఛాయ.

"ఈ ప్రశ్నకు నిజమైనజవాబు చెబితే నీగర్వం మరింత

ఎక్కువవుతుంది ఛాయా! కాబట్టి, నీ మంచికోసమే నేను జవాబివ్వను. కాని, శేఖర్‌లో చాలా సాహసముందిసుమీ. అతని ధైర్యాన్ని ప్రశంసించాల్సిందే," అన్నాడు శశాంక.

ఎన్నో మణుగుల బరువు తన నెత్తిమీదినుండి దిగిపోయినట్టనిపించింది ఛాయకు. ఈ ఆనందంలో తనేంచెయ్యాలో ఏమిటో తనకే బోధపడలేదు. శేఖర్ తనకు రాసిచ్చిన కార్యక్రమాల ప్రణాళిక, ఉపదేశాలు, తదితర కాగితాలు, అన్నీ చింపిపారేసింది. వీధిలో ఓ బిచ్చగాణ్ణి పిల్చి శేఖరిచ్చిన ఉంగరాన్ని వాడిచేతిలో పడేసింది.

"ఈ పుస్తకాలన్నీ అమ్మేస్తావా?" అన్నాడు శశాంక.

"ఎవరూ కొనకపోతే వాటిగతి ఏమవుతుంది? అందులో శేఖర్ వదిలివెళ్లిన 'భూతం' వుంటుందేమోనని నాకు భయంగా వుంది;" అంది ఛాయ.

"అలాగైతే నేనే వీటిని కొనేస్తాను."

"కొని ఏంచేస్తావు బావా?"

"హిందూశాస్త్ర ప్రకారంగా వాటిని అతివైభవంగా దహనంచేస్తాను. ఇంకా నీకు తృప్తికరంగా లేకపోతే ఆ బూడిదను త్రివేణీసంగమంవరకు తీసుకువెడతాను."

"వద్దు. అలా నా కిష్టంలేదు."

"పోనీ, వాట్నినా లైబ్రరీలో ఓ మూలను 'పిరామిడ్'లా చేసి వాటి తాలూకు 'మమీ' తయారుచేస్తాను."

"సరే, ఇవ్వాళ నువు పనిలోకి వెళ్ళకూడదు."

"రోజంతానా?"

"అంతే."

"ఏం చెయ్యాలి ?"

"కారులో ఊరంతా తిరగాలి."

"అయితే మీ అక్కదగ్గర శలవు తీసుకో."

"అవసరంలేదు. తిరిగివచ్చాక అక్కతో చెబుతాను. అప్పుడామె ఎన్నిమాటలన్నా అన్నీ సహిస్తాను."

"సరే, అయితే మీ అక్క ఎన్నిమాటలన్నా నేను కూడా సహించటానికి 'రెడీ'గా వున్నాను. ఒకప్పుడు కారు టైర్లు పేలిపోయినాసరే నేను విచారించను. గంటకు అరవై మైళ్ళ స్పీడులో వెళ్లి ఒకరిద్దరి బుర్రలు పగలగొట్టి జైలుకి వెళ్ళటానికూ కూడా నేను ఖాతరుచెయ్యను. గాని, ఊరంతా ప్రదక్షిణచేశాక నువు మాఇంటికే వస్తానని నాకుమాటివ్వాలి."

"సరే, అలాగేకానీ." ఊరంతా కారులో తిరిగారు. చాలారోజులవరకూ శశాంక పనులన్నీ అసంపూర్ణంగా వుండి పోయాయి. పనిలో ఇలా అశ్రద్ధచేస్తే మంచిదికాదని తనకు బాగా తెలుసు.

అప్పటికీ తనెందుకలా చేస్తున్నాడో తనకే బోధపడ కుండావుంది. అప్పుడప్పుడు శంభూ, శశాంకయింటికి వస్తూ పోతుండేవాడు. అతన్ని చూడగానే ఛాయకు ఎందుకోగాని భయంకలిగేది. శంభూ వస్తేసరి, ఛాయ కాస్త దూరంగా వుండేది.

ఆవేళ పొద్దున్నే సంధ్యను చూట్టానికి వెళ్ళాడు శంభూ. పొద్దున్న వెళ్ళినవాడు మళ్లీ మధ్యాహ్నానికి బయటికివచ్చాడు.

శంభూ వెళ్ళగానే ఛాయను పిలిపించింది సంధ్య. "రోజూ మీ బావను అతనిపనినుండి విముఖుణ్ని చేసి నువ్వేంచేశావో నీకేమన్నా తెలుసా ?" అంది సంధ్య.

"ఏమయిందేమిటి ?" భయపడుతూనే ప్రశ్నించింది ఛాయ. "శంభూదాదా ఇప్పుడే చెప్పివెళ్ళాడు. మీ బావ గారు కొన్నాళ్ళనుండీ ఏమీ పనిపాట్లు చూట్టంలేదట. పనంతా ఎవరో చటర్జీమీద వదిలిపెట్టారట. ఆ మహానుభావుడు తనకు దొరికినంతమట్టుకు సామానంతా చక్కా అమ్ముకున్నాట్ట. మీ బావగారి కంట్రాక్టుప్రకారంగా ఏ Godowns అయితే కట్టారో వాటి పై కప్పులన్నీ నానా ఛండాలంగా తయారు చేశారట.

"వర్షం పడగానే అవంతా పెట్లిపోయి జల్లెడలా తయారై నేలంతా నీరుమయమైందట. వాట్లోనున్న సామా నంతా మట్టిలో కలిసిపోయాయట. మన కంట్రాక్టు అంటే ఈ చుట్టుపక్కల ఎంతో పేరుంది. ఈనా డది రూపురేఖల్లేకుండా పోయేసమయం దగ్గరకు వచ్చింది. ఆ నష్టమంతా మనమే భరించుకోవాలి. ఇప్పుడు శంభూదాదా మనతో భాగస్వామిగా వుండట్ట. మనతో వేరయిపోతాట్ట."

ఛాయనోటికి తాళంపడిపోయింది. ఆమె ఏమీ జవాబు చెప్పలేకపోయింది. గడిచిందంతా తల్చుకుని చాలా విచా రించింది. కాని, ప్రయోజనం...? వెంటనే సంధ్య కాళ్ళమీద పడి – "అక్కా నన్ను నీయింటినుండి వెళ్ళగొట్టు. ఇప్పుడే నీ నౌకర్లను పిల్చి నన్ను గెంటించెయ్" అంది ఛాయ.

ఆమెను ఎన్నటికీ క్షమించకూడ దనుకుంది సంధ్య. కానీ ఆమె స్థితిచూచి సంధ్య మనస్సులో కనికరం పొంగి పొరలి వచ్చింది. ఆమె తలనిమురుతూ – "మరేం భయపడకు. ఏదో విధంగా జరుపుకుందాంలే" అంది సంధ్య.

ఛాయ లేచి కూర్చుంది. "అక్కా! మీ ఒక్కరికే నష్ట మెందుక్కలగాలి? నాదగ్గరకూడా డబ్బుందిగా! దాంతో ఆ నష్టాన్ని పూర్తిచేసెయ్యకూడదూ?"

"నీకేం మతిగాని పోయిందేమిటి? నాదగ్గరేమీ లేదను కుంటున్నావేమిటి? శంభూదాదాతో ఎక్కువ గొడవ చెయ్యొద్దని చెప్పాను. ఆ నష్టమేదో నేను పూర్తిచేసుకుంటాలే. కాని ఈ సంగతి నాకు తెలిసిపోయినట్టు మీ బావగారితో చెప్పేవు సుమీ!"

"లేదక్కా, నేను చెప్పనులే. కాని, నన్ను క్షమించవూ? ఒక్కసారి 'క్షమించాను' అంటే చాలు. నాకు తృప్తిగా వుంటుంది" అంది ఛాయ కళ్ళల్లో నీరు నింపుకుంటూ.

సంధ్యను ఒక్క నిమిషంకూడా వదల్లేదు ఛాయ. సమయానికి మందివ్వటం వగైరా చిల్లరపనులన్నీ ఛాయ స్వయంగానే చేస్తుంది. పనులన్నీ పూర్తయాక పుస్తకం పట్టుకుని సంధ్యదగ్గరే ఛాయ కూర్చుంటుంది.

శశాంక వస్తాడు. మోహన్ బగాన్ ఫుట్ బాల్ మ్యాచ్ వుందని చెప్తాడు. కాని, ఛాయ "వస్తాన"ని చెప్పదు. దినపత్రిక తీసుకువచ్చి సినీమా కాలమ్‌లో ఒక సినిమాదగ్గర ఎర్రపెన్సిల్ తో మార్క్ చేసి చూపిస్తాడు. "ఈ ఫిల్ములో చార్లీ చాప్లిన్

వున్నాడు. చాలా బాగుంటుంది" అంటాడు. ఛాయ వినిపించు కుంటేగా !

ఇదంతా సంధ్య ఓకంట కనిపెడుతూనే వుంది. భర్త ఈ విధంగా లోలోన బాధపడుతూంటం సంధ్య చూడలేకపో యింది. కాని, పైకిమాత్రం ఊరుకుంది. క్రమంగా అతను నీరసంగా వుండటం, ఏవిధమైన సంతోషరేఖలు అతనిమొహంలో కనబడకపోవటం, భోజనం తగ్గటం, అతను భోంచేసేటప్పుడు ఛాయ అతనిదగ్గర కూర్చోకపోటం అంతా సంధ్య గమనించింది.

ఈ మధ్యను ఇంట్లో వెలిసిన ఆనందజ్యోతి ఇప్పుడులేదు. ఛాయకూడా చాలా గంభీరంగా వుంది. మళ్లా పరిస్థితులు మునుపటిలాగేవుంటే ఎంతో బావుణ్ణనుకుంది సంధ్య.

ఏదో కొత్త 'సర్కస్' వచ్చింది. జంకుతూనే శశాంక అన్నాడు—"ఛాయా ! కొత్తగా ఓ సర్కస్ వచ్చింది. స్పెషల్ క్లాస్ టిక్కెట్లు రెండు కొన్నాను. వస్తావా ?" ఛాయ ఏదో జవాబివ్వకముందే సంధ్య అందుకుంది. – "ఎందుకు వెళ్ళదు ? తప్పకుండా సర్కస్ చూస్తుంది. వెళ్ళమ్మా ఛాయా ! పాపం! చాలారోజులైంది, ఇంటినుండి బైటికి కదలనేలేదు."

ఆ వేళ సర్కస్‌చూశారు. తరవాత సినీమా – మళ్ళీ 'సిరాజుద్దేలా' నాటకం – జూ. కాని, బొటానికల్ గార్డెన్‌కి వెళ్ళేప్పుడు ఛాయ కాస్త బెట్టు చూపించింది. సంధ్యనువదిలి ఎక్కువసేపు బయటవుంటానికి ఛాయకు మనస్కరించలేదు. కాని, సంధ్యయొక్క పట్టుదలవల్ల ఆ వేళకూడా యిద్దరూ బయల్దేరారు.

'ఎవరికోసమైతే పనిపాట్లను సైతం లెక్క చెయ్యకుండా నష్టపడ్డారో, ఆ వ్యక్తిని పోగొట్టుకోటాన్ని అతనెప్పుడూ సహించలేరు' అనుకుంది సంధ్య.

*　　　*　　　*

# 12

శశాంక నౌఖరీ చేస్తున్నప్పుడు సంధ్యతాలూకు తైల చిత్రం ఒకటి చిత్రకారునిచేత చిత్రింపించి హాల్లో గోడకు పెట్టాడు. దాన్ని బయటికితీసి మంచిఖరీదైన ఫ్రేముకట్టించి తనగదిలో పెట్టుకున్నాడు. దానికెదురుగా ఓ చిన్న పూలకుండీ కూడా పెట్టించాడు. దానిలో రోజూ తోటమాలి పూలు పెట్టేవాడు.

ఒక ఆదివారంనాడు సంధ్యతో శశాంక "జూట్‌మిల్ దొరగార్ని అతని స్టీమ్‌లాంచి అడిగాను. ఈవేళ ఆదివారమని, కాస్త అలా ఛాయతో డైమండ్ హార్బర్ వరకు వెళ్లాలనివుంది. అక్కడ మరో కంట్రాక్టుకూడా దొరక నుంది. సాయంత్రం కాకముందే తిరిగి వచ్చేస్తాం." సంధ్య కిష్టంలేకపోయినా బయటికి ఏమీ అనలేకపోయింది.

"మీ భోజనం సంగతేమయినట్టు?" అనిమాత్రం ప్రశ్నించగలిగింది. "అదంతా ఔల్రాంఇచ్చి హోటల్లో ముందే 'ఎరేంజ్' చేశాను."

"సరే వెళ్ళండి," అనగానే శశాంక పరుగుతీశాడు. శశాంక వెళ్లిపోగానే 'బావురు'మని పెద్దగా ఏడవాలనిపించింది సంధ్యకు.

'ఇంకా నేనెందుకు బ్రతికున్నానురా దేవుడా' అనుకుంది తనలో.

మరుచటి ఆదివారం సంధ్య 'పెళ్ళిరోజు'. ఇంతవరకు ప్రతీసంవత్సరం 'ఈ రోజు' ఎంతో సంతోషంగా గడిచేది. ఇప్పుడుకూడా మంచంమీదినుండే నౌఖర్ల చేత అన్ని ఏర్పాట్లు చేయిస్తోంది.

పెళ్లినాడు శశాంక ఏబట్టలు వేసుకున్నాడో, వాటినే ఆ రోజున స్వయంగా ఆమె అతనికి తొడిగించి, తనుస్వయంగా పెళ్ళినాటి పట్టుచీర కట్టుకుంటుంది. తరవాత శశాంకమెళ్లో పూలమాల వేస్తుంది. హారతిస్తుంది. అతనికి తినిపిస్తుంది. గదిలో అగరువత్తులు వెలుగుతాయి. తరవాత గ్రామఫోన్ రికార్డులు వాయిస్తుంది. ఇదే ప్రోగ్రాం.

అంతకుముందల్లా 'ఈరోజు'రాగానే సంధ్యకు తెలీకుండా శశాంక ఆమెకు ప్రియమైన వస్తు వేదన్నా కొని బహూకరించే వాడు. ఈసారికూడా అలాగే జరుగుతుం దనుకుంది.

కింద మోటారుహార్న్ వినిపించింది. వాళ్ళిద్దరూ వెళ్ళి పోయారని నౌఖరు చెప్పాడు. సంధ్య 'బావురు'మంది. అప్పటి నుండీ ఆమెజబ్బు మరింత ఎక్కువైంది. తను బ్రతుకుతుందనే ఆశ ఆమెకు లేకపోయింది. భర్తను పిలిపించింది. శశాంకవచ్చి ఆమెదగ్గర కూర్చున్నాడు.

"నా అదృష్టంకొద్దీ మీరు నాకు భర్తగా దొరికారు. కాని, మిమ్మల్ని సంతోషపెట్టేశక్తి నాకు దేవుడు ప్రసాదించ లేదు. నన్ను క్షమించండి," అంది సంధ్య. శశాంక ఏదో అన బోయాడు. అతన్ని వారించి మళ్ళీ ఇలా అంది—

"మీరిప్పుడేం మాట్లాడకండి. నన్ను చెప్పనివ్వండి. ఛాయను మీ చేతుల్లో పెట్టి వెడుతున్నాను. ఛాయ నా ప్రతిబింబం. ఆమెలో మీరు నన్ను చూడగలరేమోనని నా నమ్మకం. నేను శలవుతీసుకునే సమయంలోనయినా మిమ్మల్ని సుఖపెట్టగలిగానుకదా అనే తృప్తిగావుంది నాకు." అప్పుడే నర్సువచ్చి - "డాక్టర్ గారువచ్చారు" అంది. "రమ్మను" అంది సంధ్య. సంభాషణ ఆగిపోయింది.

చాలామంది డాక్టర్లు వచ్చారుగాని, ఆమెజబ్బు నయం చెయ్యలేకపోయారు. ఆఖరికి శశాంక విసుగెత్తిపోయాడు. అప్పుడే ఊళ్లో ఓ పుకారులేచింది—హిమాలయ ప్రాంతాల నుండి ఓ సిద్ధుడువచ్చాడనీ, అతనిదగ్గర ఎటువంటి జబ్బులకైనా అమోఘమైన మందులున్నాయనీ, అతనిమందులు 'రామ బాణ'మనీ.

భర్తకు తెలీకుండా ఆ సిద్ధుణ్ణి ఇంటికి పిలిపించింది సంధ్య. నర్సు అతనిరాకనే తెలియపర్చింది. ఏదోమూలికను చూర్ణం చేసి పాలల్లో కలిపి ఇచ్చాడు. ఇదే అతని విశేషమైనమందు.

ఇలాంటి సన్యాసుల్నిచూస్తే శశాంక మహా ఇదిగా ఎగతాళి చేస్తాడు. ఈ సన్యాసి విషయం సంధ్య కదపగానే శశాంక అదోలా మాట్లాడాడు. "పోనీలెండి, ఇదికూడా ఓ సారి ప్రయత్నిద్దాం" అంది సంధ్య. విధిలేక శశాంక ఒప్పుకున్నాడు.

15 రోజులవరకు ఆ సిద్ధుడిచ్చిన మందునే వాడింది సంధ్య. ఆశ్చర్యం! ఆమెజబ్బు పూర్తిగా బాగైపోయింది. మంచంవదిలి మళ్ళా మామూలుగా తిరుగాడ నారంభించింది.

అయితే సంధ్య చావలేదు. ఆమె అనుకుంది - "ఇదేమి టీ గొడవ! ఇప్పుడేం చెయ్యాలి! ఆఖరికి నేను బ్రతికివుంటం కూడా మృత్యువుకన్నా ఘోరంగావుంది." అవతల ఛాయ ఇంటికివెళ్ళే సన్నాహంలోవుంది. ఆమెకు ఇక్కడ మరేంపని లేదుగా! ఆమె చదునో ? ?

"నువు వెళ్ళటానికి వీల్లేదు," అంది సంధ్య.

"ఏం ?"

"మన హిందూసంఘంయొక్క చట్టప్రకారంగా అక్కకు సవతిగా వుంటం పాపమా? అలా జరక్కూడదా ?"

"నీ ఉద్దేశం ఏమిటి ?"

"లోకులేమంటారో అని భయపడుతున్నావా? మరేం భయంలేదులే."

శశాంకనుపిల్చి సంధ్యఅంది - "పదండి మనం నేపాళ దేశానికి పోదాం. అక్కడ రాజదర్బార్‌లో మీ కేదోపని దొరకనుందన్నారు కదూ! ప్రయత్నిస్తే తప్పకుండా దొరుకు తుందని నా నమ్మకం. అక్కడ మనమెలాగున్నా అడిగేవారు లేరు."

శశాంకనూ, ఛాయనూ ఏమీమాట్లాడనిచ్చింది కాదు సంధ్య. ప్రయాణసన్నాహాలు చురుగ్గా సాగుతున్నాయి. అప్ప టికీ ఛాయమాత్రం ఖిన్నవదనంతో మొహందాచుకుని యిటూ అటూ తిరుగుతోంది.

వెళ్ళేరోజు దగ్గరకురాగానే - "ఈ ప్రయాణం ఓవారం రోజులు ఆపితే మంచిదని నాఊహ. నేను మేనేజర్‌తో

కాస్త ఇంటిని జాగ్రత్తగా కనిపెట్టుకుని వుండమని చెప్పి వస్తాను." అంటూ ఛాయ వెళ్ళిపోయింది.

ఇదేసమయంలో శంభూ అక్కడికి చిన్నబోయిన మొహంతో దాపురించాడు. "మంచిసమయానికే మీరంతా వెడుతున్నారు సంధ్యా! నీతో మాట్లాడిం తర్వాత నీ భర్తతో భాగస్వామిగా నుండక నేను వేరయిపోయాను. లెక్కలు చూచాక మీ డబ్బంతా స్వాహా అయినట్లు తేలింది. అదేకాకుండా అప్పుకూడా పెరిగింది. అది తీర్చటానికి యిల్లు కూడా అమ్మాల్సి వస్తుందేమో!" అన్నాడు శంభూ.

"ఇదంతా మీ బావగారికి తెలుసా?" సంధ్య ప్రశ్న.

"బాగా తెలుసు. ఏదో కాస్త అశ్రద్ధవల్ల జరిగింది కదాఅనీ మళ్లీ మరి కాస్తఅశ్రద్ధచేశాడు. దాంతో మిగిలినడబ్బు కూడా 'గోవిందా' అయిపోయింది. సరే, అయిందేదో అయిం దిలే. దేవునిదయవల్ల అతనికి నేపాళంలో పనిదొరకనుంది. అదే చాలు. కాబట్టి మరేం చింతించ నవసరంలేదు" అంటూ శంభూ వెళ్లిపోయాడు.

పేదరికానికి సంధ్య భయపడలేదు కాని...సరే తన దగ్గర మిగిలిన నగల్ని అమ్మేస్తే దాంతో సంసారం సాఫీగానే నడుస్తుంది.

ఈలోగా ఛాయను తన భర్త పెళ్లిచేసుకుంటే ఆమె తాలూకు ఆస్తికూడా కలిసివస్తుంది. అతని వ్యాపారంకోసం తను ఖర్చుపెట్టిన డబ్బుకూడా గంగలో కలిసిపోయింది. మరి, ఛాయ తాలూకు ఆస్తి దొరకగానే తనని ప్రతినిమిషం ఎగ

తాళిచేస్తూ, ఎత్తిపొడుస్తూ ఎన్ని అత్యాచారాలు జరుగుతాయో! అయినా ఛాయ అలా చేస్తుందా! ఏమిటో! ఆ జబ్బులోనే ఈ కాస్త ప్రాణం 'హరీ' అంటే...హుఁ!

* * *

# 13

శంభూతో వ్యాపారం విషయంలో సంధ్యతాలూకు డబ్బు తగలడిందని శశాంక తెల్సుకున్నాడు. ఆఖరికి శంభూతో రాజీపడ్డాడు. శశాంక ఆలోచించాడు—

ఉద్యోగం 'రిజైన్' చేసేప్పుడుకూడా సంధ్యనుండే ఆర్థిక సహాయం దొరికింది. ఇప్పుడుకూడా ఆమె సహాయమే కావల్సి వచ్చింది. సంధ్యఅప్పు నెత్తినపెట్టుకునే నేపాళదేశం వెళ్లాలా? అక్కడ దొరికిన జీతంతో సంధ్యతాలూకు అప్పుతీర్చటం కష్టమే. లేదు. నేపాళం వెళ్ళకూడదనే నిశ్చయించుకున్నాడు. సంధ్య – ఛాయ – తను ముగ్గురూ ఇక్కడేవుండాలి.

సంఘం ఏంచేస్తుందో అదికూడా చూస్తాడు. ఇప్పుడే మళ్ళీ వ్యాపారం మొదలెడతాడు. సంధ్యనుపిల్చి అన్నాడు కదా – "ఇదిగో సంధ్యా! నేను నేపాళం వెళ్ళను. వెళ్ళదల్చుకోలేదు. ఇక్కడే ఈ కలకత్తాలోనే వుంటాను. సంఘానికి భయపడి పారిపో దల్చుకోలేదు. తెలిసిందా?" ఆవేశంతో అరిచాడు.

'దేని కా ఆవేశం? ఇంతకూ నవ్వేందేమి?' పొత్తు క్యంతో ప్రశ్నించిందామె. 'నవ్వింది సంధ్యా! నన్నంత పిరికిపందగా భావించకు. నా గొంతుకొన్న వదిలి నేనెక్కడికో పారిపోతానని నువ్వెప్పుడూ అనుకోవద్దు.'

భర్త చెయ్యిపట్టుకుని ప్రాధేయ - పూర్వకంగా అడిగింది సంధ్య - 'ఏమిటయిందండీ? కాస్త విపులంగా బోధ పర్చరాదూ!' 'నా నెత్తిమీద నీ అప్పు పడింది. ఎంతోసేపు ఈ విషయాన్ని నువ్వు దాచలేవు. అప్పటిలాగే ఇప్పుడు కూడా నీ అప్పు తీర్చటానికి సదుంకల్పాను. నా వ్యాపారం తగలడింది. దాన్ని మళ్ళీ చేవనెత్తాను. వింటున్నావా? ఇది నా ప్రతిజ్ఞ. అప్పుడు నువ్వెలా నన్ను విశ్వసించావో ఇప్పుడుకూడా అలాగే విశ్వసించు.' 'మీరుకూడా నన్ను విశ్వసించండి. నా కర్తవ్యమేదో నాకు బోధపర్చండి. మీకు నేనేవిధంగా సహాయపడగలనో ఆ దీక్షనివ్వండి.' బయట పోస్టుజవాను కేక - 'ఉత్తరం' రెండుత్తరాలు వచ్చాయి. ఛాయ - ఒకటి సంధ్యకు, మరోటి శశాంకకు.

'ఇప్పుడు నేను బొంబాయికి వెళ్ళేదార్లో నున్నాను. ఇంగ్లండు వెడుతున్నాను. నాన్నగారి కోరిక ప్రకారంగా-కాదు - ఆజ్ఞననుసరించి. లేడీడాక్టర్ నవాలి నేను. బహుశః ఆరేడు సంవత్సరాలవుతుం దనుకుంటా. మీ ప్రశాంతమైన సంసారంలో నేనగ్నివర్షం కురిపించానేమో! ఈమాత్రాని

కది చల్లారిపోయి వుంటుందేమో! నావిషయమై మీరు చింతించ నవసరంలేదు. మిమ్మల్ని తల్చుకునే నేను విచారిస్తున్నాను...'

రెండో వుత్తరం సంధ్యకు రాయబడింది— 'అక్కా— నీ కనేకవేల నమస్కారములు. నా అజ్ఞానంకొద్దీ నే నేదో తప్పు చేశాను. నన్ను క్షమించు. అది తప్పు కాకపోతే మాత్రం నాకు సంతోషమే. ఎందులో సుఖముందో ఇదమిద్ధమని నాకు సరిగా తెలీదు. ఒకప్పుడు సుఖంలేకపోతే లేకపోవుగాక! ఏదన్నా తప్పుచేస్తే నాకు భయంగానే వుంటుంది.